# రైట్ హానరబుల్ శ్రీనివాస శాస్త్రి

ట్ ఎన్ జగదేశన్ రాసిన వి ఎస్ శ్రీనివాస శాస్త్రి ఆంగ్ల పుస్తకానికి తెలుగు స్వేఛ్చానువాదం

రైట్ హానరబుల్ అనేది గౌరవాన్ని చూపే ఉపసర్గ. ఇది యునైటెడ్ కింగ్‌డమ్, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, ఆంగ్లోఫోన్ కరేబియన్ సభ్యులుగా ఉన్న ఇతర ప్రదేశాలలో నిర్దిష్ట వ్యక్తులకు ఇవ్వబడుతుంది, భారతీయులలో  రైట్ హానరబుల్ శ్రీ శ్రీనివాసశాస్త్రి ఒక్కరు.



# గబ్బిట దుర్గాప్రసాద్

harsh

జూలై 2023

Contents

# అపూర్వ విషయం



సాహితీ బంధువులకు శుభాకాంక్షలు. సరసభారతి బ్లాగ్ ఏర్పరచి దశాబ్ద కాలం దాటింది. అంతకు ముందు, ఈ కాలం లోనూ నేను రాసిన రచనలన్నీ ఒక చోటుకు చేర్చాలని మా రెండవ అబ్బాయి శర్మ తపన పడుతూ, వాడి ఉద్యోగ ధర్మాన్ని నిర్వహిస్తూ ఈ పనికి సుమారు ఆరునెలలముందు శ్రీకారం చుట్టాడు. ఎప్పటికప్పుడు నాకు పురోగతి తెలియజేస్తూ, గొప్ప విజన్ తో ముందుకు సాగుతూ మొట్టమొదటి సారిగా నారచనలు డిజిటల్ గా మార్చి, "సమస్త భక్త శిఖామణులు " శీర్షిక తో సుమారు 700 పేజీల దేశ భక్తులు, దైవభక్తులు, రాజ్యభక్తులైన మంత్రులు మొదలైన వారి గురించి నేను రాసినవన్నీ క్రోడీకరించి 75వ భారత స్వాతంత్ర్య దినోత్సవ పుణ్య సమయం లో ఆన్ లైన్ లో నాతో అవిష్కరింప జేశాడు. వాడి దీక్షకు కృషికి విజన్ కు అభినందనలు. ఏదో రాసుకొంటూ పోవటమేకానీ, దానికింత ప్రశస్తి ఉంటుందని నాకెన్నడూ అని పించలేదు. ఇదంతా చూశాక, తప్పులు దిద్దే సమయం లో కొన్ని అసలు నేనే రాశానా అనే అనుమానం వచ్చిన సందర్భాలు కూడా ఉన్నాయి. మా వాడిని అడిగితే "నువ్వే రాశావు నాన్నా "అని జ్ఞాపకం చేశాడు. ఇది నా సాహిత్యజీవితం లో ఒక మైలు రాయి.

ఇంతటి తో ఆగలేదు. నేను వివిధ రామాయణ, భారత, భాగవత,వేద ఉపనిషత్తులు మొదలైన వాటిపై విశ్లేషణ రూపంగా రాసినవన్నీ ఒక చోటికి చేర్చి డిజిటల్ రూపమిచ్చి రెండవ భాగం గా సుమారు 450 పేజీల "వేద, ఇతిహాస, తాత్విక రచనల విశ్లేషణ"గా నామకరణం చేసి విద్యా ప్రదాత శ్రీ వినాయకుని పుట్టినరోజు శ్రీ వినాయక చవితి నాడు నాచేత ఆవిష్కరింప జేస్తున్నందుకు మహదానందంగా ఉంది. ఎన్ని సార్లు తప్పుల జల్లెడ పట్టినా, కొన్ని కంటికి కనిపించకుండా దూసుకు పోతూనే ఉన్నాయి. థ,ఠ,ఢ వంటి అక్షరాలు స్పష్టంగా రాయటానికి జంత్రిక ను నాకు ఎప్పటికప్పుడు అందించి, వేగ వంతంగా రాయటానికి తోడ్పడుతున్న మా మనవడు చి. భువన్ కు ఆశీరభినందనలు. ఇంతటి అక్షర వారాసి ని చూస్తుంటే అద్భుతమని పిస్తోంది. ఇంకా కొన్ని భాగాలు వీలువెంట డిజిటలైజ్ చేసి, వేర్వేరు శీర్షికలతో ఆవిష్కరిస్తాము. ఇదంతా మా తలిదండ్రుల ఆశీర్వాదాలు, మా ఇలవేల్పు శ్రీ సువర్చలాంజనేయ స్వామి దీవెనలు, శ్రీ సరస్వతీ మాత కరుణా కటాక్షమే అని సవినయంగా మనవి చేస్తూ, మా శ్రీమతి, మాకుటుంబ సభ్యులు అందిస్తున్న ప్రోత్సాహానికి, సాహితీ బంధుల ఆదరాభిమానాలకు అభినందనలు తెలియ జేస్తున్నాను. ఇప్పడు భారత 76 వ స్వాతంత్ర్య దినోత్సవం 15-8-23న చంద్రునికో నూలుపోగుగా మరియు శాస్త్రి గారి 155 వ జయంతి (సెప్టెంబర్ 22) సందర్భంగా రైట్ హానరబుల్ శ్రీనివాస శాస్త్రి టి ఎస్ జగదేశన్ రాసిన "వి ఎస్ శ్రీనివాస శాస్త్రి" ఆంగ్ల పుస్తకానికి తెలుగు స్వేచ్చానువాదం పుస్తకం గా రావడం మరొక మైలురాయి.

గబ్బిట దుర్గాప్రసాద్ ఆగస్టు. 2023

ఉయ్యూరు

## ఒక్క నిమిషం

కాలం తో పాటు సాంకేతిక మారింది. ఇంతకు ముందు తెలిసినవి అన్నీ పుస్తకం లో రాసుకొని, సమావేశాలలో అందరికి వినిపించటం అనేది అలవాటు గా జరిగేది. 2010 లో సరసభారతి ఉయ్యురు లో ఒక సాంస్కృతిక సంస్థ గా ప్రారంభం అయ్యి సాహితీ సభలు, ఉగాది కవి సమ్మేళనం, సమావేశాలు స్థానిక గ్రంధాలయాలలో, దేవాలయాలలో జరిగేవి. సరసభారతి చిన్న పత్రిక గా రూపుదిదుకొంది.

సహజం గా సైన్స్ టీచర్ అవ్వటం వల్ల ప్రతిదీ నా అవసరాలకు మేరకు నేర్చుకోవటం బాగా అలవాటు.. ఈ వయసులో కంప్యూటర్ నేర్చుకొనటం, తెలుగు లో టైపు చేయటం, నోట్స్ తయారు చెయ్యటం ఈమెయిలు రాయటం. సమాధానాలు రాయటం నేర్చుకోన్నవి. బహుశా మా తరం వాళ్ళకంటే ముందుగా కంప్యూటర్ నేర్చుకుని ఇమెయిల్ ద్వారా సాహితీ రచనలు పంపటం ప్రారంభం అయ్యింది ఈ ప్రయాణం. ఇమెయిల్ తెలుగు లో రాసినవి స్కాన్ చేసి. బంధువులకు, మిత్రులకు పంపటం అలవాటు అయ్యింది.

అప్పుడే ప్రసిద్ధ వ్యక్తులు బ్లాగ్ ద్వారా తమ రచనలను, ఆలోచనలను పంచుతున్నారు. పిల్లలు బ్లాగ్ పెడితే అందులో ఇంగ్లీష్ లో రాయటం. తెలుగు వి స్కాన్ చేసిపెట్టటం. ఇది ఒక మెట్టు. సాహితీ బంధు గ్రూప్ తయారుచేసి. సాహితీ మిత్రులకు పంపటం మలి మెట్టు.తెలుగు లో రాయాలంటే సాఫ్ట్వేర్, కీబోర్డ్ ఉండాలి ఎందుకో అది కష్టం గా అనిపించింది. అప్పుడే గూగుల్ యూనికోడ్ తో తెలుగు లో రావాలటం. చాలా బాగా ఉండటం. ఇంగ్లీష్ లో కొడితే తెలుగు లో రావటం అది ఇమెయిల్ లో, బ్లాగ్ లో చేరటం. జరిగింది మొరొక మెట్టు. రోజుకు ఒకటి, లేదా రెండు పోస్ట్స్ తో ప్రారంభం అయ్యి. ఒక అలవాటు గా మారి రోజుకు పది.. డజన్ల వరకూ వెళ్ళింది. బ్లాగ్ ప్రారంభం అయ్యిన తరువాత గ్రామీణ ప్రాంతం నుంచి తెలుగు లో ఉసూల గూడు (బ్లాగ్స్) కూడా రాస్తారు అని ప్రపంచానికి తెలిసింది. తెలుగు బ్లాగర్స్ అందరికి సరసభారతి బాగా పరిచయం. కూడలి ద్వారా దేశ విదేశాల తెలుగు వారికీ బ్లాగ్ చేరింది.

ఉదయం వార్తా పత్రికలలో వచ్చే అంశాలతో ప్రారంభం అయ్యి, సాయంత్రం ఒక పుస్తకం, కవి మీద సమీక్ష సాయంత్రం కొన్ని సార్లు రాత్రి పొద్దు పోయేవరకూ రచనలు జరిగేవి. దాదాపు 10-12 గంటలు నోట్స్ రాసుకోవటం. టైపు చెయ్యటం, ఫోటోస్ కాలేక్ట్ చెయ్యటం. ఇమెయిల్ ఇవ్వటం ఇలా... సోషల్ మీడియా విస్తరించి బ్లాగ్ లో రాసింది ఆటోమేటిక్ గా ఫేస్బుక్, ట్విట్టర్ మొదలైన వాటికి వెళ్ళటం. ప్రపంచమంతా తెలియటం జరిగింది ఇది మరొక్క మెట్టు. అమెరికా ప్రయాణం లో పరిచయం లేని వాళ్ళు కూడా గుర్తు పట్టి బ్లాగ్ గురించి గొప్పగా చెప్పటం విశేష అనుభూతి. బ్లాగ్ లో సాహిత్యం, పుస్తక విశ్లేషణ, సభలు. ప్రయాణాలు. రాజకీయాల, దేవాలయములు, సినిమా, నా దారి. సరసభారతి సమావేశాలు... ఇలా జీవితం లో మనకు తారసపడే ప్రతి అంశం మీద రాయటం అవి సోషల్ మీడియా లో చేరటం జరిగిపోయేవి. టైపింగ్ లో కొన్ని తప్పులు దొర్లినా మంచి మనసుతో దానిని అర్ధం చేసుకొని బ్లాగ్ కి సహకరించిన వారి అందరికి ధన్యవాదాలు.

లాభాపేక్ష, వ్యాపార ద్రుష్టి లేకుండా రాసినవి, సేకరించినవి భావి తరాలకు తెలియాలనేదే ఈ ప్రయత్నం. పుస్తకాలలో నిక్షిప్తమైన వి ఈ తరం, రేపటి తరాలకు అందించటమే ఆశయం. వికీపీడియా కూడా తమ రిఫరెన్స్ కోసం సరభారతి పోస్ట్స్ లంకె వెయ్యట జరుగుతోంది. ప్రపంచం మొబైల్స్ లోకి మారినప్పుడు అందరూ బ్లాగ్స్ ఆపేసినా సరసభారతి కొనసాగించటం విశేషం. వాట్సాప్ లో కూడా మిత్రులకు గ్రూప్ తయారుచేసి పోస్ట్ పంపటం ప్రారంభం.గత రెండు సంవత్సరాలుగా చాలా సౌకర్యం గా ఉండటం తో రోజు ఉదయం పది గంటలకు లైవ్ ప్రోగ్రాం చెయ్యటం అలవాటుగా మారింది. దాదాపు 1300 గంటల లైవ్ చేసి వాటిని youtube లో అప్లోడ్ చెయ్యడం జరిగింది. సరసభారతి బ్లాగ్ పది లక్షల వీక్షకులలో బ్లాగ్ లో రాసి పుస్తకం రూపం లో వచ్చినవి దాదాపు. 40. అంచెలంచలు గా ఎదుగుతూ పదివేల పోస్ట్స్ కు నేను రాసినవి చేరాయి. ముద్రితం కానివి దాదాపు 500 వ్యాసాలు. పదివేల పేజీలు, యాభై లక్షల పదాలు, రెండు కోట్ల అక్షరాలూ. వీటిని సేకరించి తప్పులు సరి దిద్ది క్రమ పరిచి **అంకాత్మక** (డిజిటల్) పుస్తకాలు గా ఆవిష్కరించి మీకు అందించే ప్రయత్నమే ఇది.

రైటానరబుల్ శ్రీనివాస శాస్త్రి గారిపై తెలుగులో ఎవరూ రాయలేదు. పబ్లికేషన్ డివిజన్ ఆఫ్ ఇండియా వారు "బిల్డర్స్ ఆఫ్ మోడరన్ ఇండియా సిరీస్ "లో టి. ఎస్. జగదీశన్ తో ఇంగ్లీష్ లో రాయించి ప్రచురించారు. నేను దాన్ని అనువాదం చేసి మీకు అందిస్తున్నాను.

## గ్రంథకర్త పరిచయం



| | |
|---|---|
| పేరు : | **గబ్బిట దుర్గాప్రసాద్** |
| జననం | **27-6-1940 ఉయ్యూరు కృష్ణాజిల్లా** |
| తలిదండ్రులు | **గబ్బిట భవానమ్మ, మృత్యుంజయ శాస్త్రి** |
| భార్య | **ప్రభావతి** |
| విద్య | **ఎం ఏ, తెలుగు, బి.ఎస్ సి. బి.ఎడ్.** |
| ఉద్యోగం | **ఫిజికల్ సైన్స్ టీచర్, పదానోపాధ్యాయుడు -కృష్ణా జిల్లా పరిషత్ (1963-1998)** |
| సంతానం | గబ్బిట మృత్యుంజయ శాస్త్రి, సమత సంకల్ప్, భువన్ సాయి తేజ<br>లక్ష్మీ నరసింహ శర్మ, ఇందిర శ్రీ హర్ష సాయి, హర్షి తాంజని<br>నాగ గోపాల కృష్ణ మూర్తి, రాణి గౌతమ శ్రీ చరణ్, రమ్య<br>వెంకట రమణ, మహేశ్వరి<br>కోమలి విజయలక్ష్మి, సాంబావధాని శ్రీకేత్, ఆశుతోష్, పీయూష్ |
| స్వీయ రచనలు | 1 ఆంధ్ర వేద శాస్త్ర విద్యాలంకారులు 2 జనవేమన 3 దర్శనీయ దేవాలయాలు 4 శ్రీ హనుమత్ కథా నిధి 5 శ్రీ ఆంజనేయ స్వామి మహాత్మ్యం 6 సిద్ధ యోగిపుంగవులు 7 మహిళా మాణిక్యాలు 8 పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు 9 దర్శనీయ దైవ క్షేత్రాలు 10 గీర్వాణ కవుల కవితా గీర్వాణం (3 భాగాలు) 13 దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు (2భాగాలు) 15 కేమోటాలాజి పిత డా.కొలాచల సీతారామయ్య 16 దైవ చిత్తం 17 బ్రహ్మశ్రీ మద్దులపల్లి' శాస్త్రి గారి శతజయంతి కరదీపిక 18 ఆధునిక ప్రపంచ నిర్మాతలు - జీవితాలలో చీకటి వెలుగులు 19 షార్లెట్ సాహితీ మైత్రీ బంధం 20 అణుశాస్త్ర వేత్త డా.ఆకునూరి వెంకట రామయ్య 21 ప్రయోగాత్మక కాంతి శాస్త్ర పరిశోధన పిత డా పుచ్చా వెంకటేశ్వర్లు 22 ఊసుల్లో ఉయ్యూరు 23 సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా 24 ఆధునిక ఆంధ్ర శాస్త్ర రత్న మాణిక్యాలు 25 వ్యాఖ్యాన చక్రవర్తి కోలాచలం మల్లినాథ సూరి 26 విదేశీ సంస్కృత విద్వాంసులు. |

| | |
|---|---|
| సంపాదకత్వం | సరసభారతి ప్రచురించిన పుస్తకాలు 1 జ్యోతిస్సంశ్లేషణం 2 ఉయ్యూరు ఊసులు 3 నవకవితా వసంతం 4 మా అక్కయ్య 5 "ఆదిత్య "హృదయం" 6 త్యాగి పే"రెడీలు" 7 శ్రీరామవాణి 8 మా అన్నయ్య 9 శ్రీ సువర్చలా వాయు నందన శతకం 10 శ్రీ సువర్చలా మారుతి శతకం 11 శ్రీ సువర్చలేశ్వర శతకం 12 వసుధైక కుటుంబం 13 Nuclear Scientist Dr.Akunuri Ramayya 14 సాహితీ స్రవంతి (సాహితీ మండలి తరఫున |
| అంకాత్మక | 1 సమస్త భక్త శిఖామణులు 2. వేద, ఇతిహాస, తాత్విక రచనల విశ్లేషణ 3. కోనసీమ అందాలకు వేదపవిత్ర సొబగులు సౌరభాలు అద్దిన ఆహితాగ్నులు,4. దర్శనీయ మహాదే(వ-వి)నాయక ఆలయాలు,5. బ్రహ్మశ్రీ విద్వాన్ శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి,6. శమీ అష్టోత్తరం పూజా విధానమ, 7. సహస్రచంద్రదర్శనం 8. శ్రీ సంకర 9.. శ్రీ శోభ కృత్ ఉగాది కవితా సంకలనం 10. రైట్ హానరబుల్ శ్రీనివాస శాస్త్రి(అనువాదం) |

రైటానరబుల్ శ్రీనివాస శాస్త్రి గారిపై తెలుగులో ఎవరూ పుస్తకం, కనీసం వ్యాసం కూడా రాయలేదు. పబ్లికేషన్ డివిజన్ ఆఫ్ ఇండియా వారు "బిల్డర్స్ ఆఫ్ మోడరన్ ఇండియా సిరీస్ "లో టి. ఎస్. జగదీశన్ తో ఇంగ్లీష్ లో రాయించి ప్రచురించారు. నేను దాన్ని అనువాదం చేసి మీకు అందిస్తున్నాను.




## బాల్యం

22-9-1869 న శ్రీనివాస శాస్త్రి తమిళనాడు లోని కుంభకోణం దగ్గర వలగైమాన్ లో శంకర నారాయణ శాస్త్రి శ్రీమతి బాలమ్మాల్ దంపతులకు జన్మించాడు.. ముగ్గురు అక్కలు,ముగ్గురు తమ్ముళ్ళు. అప్పుడే రాజకీయ చైతన్యం,ఆధ్యాత్మిక విచారం ప్రారంభమైందిదేశం లో. సాంఘిక దురన్యాయాలపై గొంతులు విప్పుతున్నారు ప్రజలు. మూఢ విశ్వాసాలపై ఏవగింపు చూపిస్తున్నారు. 1857 బ్రిటీష రాజ్యం అయిపోయింది. హౌస్ ఆఫ్ కామన్స్ భారత ప్రభుత్వాన్ని విక్టోరియా రాణికి అప్పగిస్తూ తీర్మానం చేసింది. బ్రిటన్ అధికారం లో ఉన్న అన్ని ప్రాంతాలలాగానే ఇండియా ను కూడా చూసు కొంటామని రాణి ప్రకటించింది. ప్రజలు ఊరట చెందారు. సెల్ఫ్ గవర్న మెంట్ ఆశలు చివురిచాయి. అప్పుడు ఏదైనా అలజడి ఉంటే రాణిపై ఉన్న అవిశ్వాసం మాత్రం కారణం కాదు. దీనిసే సురెంద్రనాద్ బెనర్జీ "భారత ప్రజలు మేలుకొంటున్నారు అనటానికి ఇది ఒక సంకేతం "అన్నాడు.

అనాదిగా ఉన్న సంప్రదాయాలను,సంస్కృతిని కాదని పాశ్చాత్య వ్యామోహం లో జమీందార్లు,ధనికులు పడిపోయారు. అప్పుడే రాజారామ మోహన రాయ్ వంటి జాతీయవాదులు భారతీయ సంప్రదాయ సంస్కృతీ పునరుద్ధరణకు నడుం కట్టి జనాన్ని నడిపించారు. మత మూఢనమ్మకాలు వగైరాలపై తీవ్రంగా విరుచుకు పడ్డారు.

దేశ భక్తీ జాతీయత విస్తారం అయింది అయినా బ్రిటీష రాణి కి ప్రజల విధేయత లో మార్పు లేదు. బర్క్ మిల్, గ్లాడ్ స్టన్ వంటి మేధావుల దార్శనికుల ప్రభావం తో వైస్ రాయ్ లైన లార్డ్ కానింగ్,లార్డ్ రిప్పన్ లు వ్యవహరించారు. ఇండియాలో స్వీయప్రభుత్వ పాలనకు ఆశలు బాగా ఏర్పడేట్లు చేశారు.దాదాభాయ్ నౌరోజీ,మహాదేవ గోవింద రానడే ల మహోన్నత వ్యక్తిత్వాల వలన ప్రభావితులైన భారత ప్రజల వలన,దైవ కృప వలన ఇండియా,బ్రిటన్ దేశాల మధ్య సాన్నిహిత్యం,విశ్వాసం దృఢమైంది.

## కుటుంబం

దారిద్ర్యం లో పుట్టిన శ్రీనివాస్ కు సునిసిత మేధ మంచి వ్యక్తిత్వం అబ్బాయి. పుట్టిన ఊరు నది గట్టున ముత్తాత తండ్రి,ముత్తాత, తాత ల మూడు పవిత్ర సమాధులున్నాయి. ఈ ముగ్గురు గృహస్థాశ్రమాన్ని నిర్విఘ్నంగా గడిపి చివరి దశలో సన్యాసం స్వీక రించి ప్రాపంచిక సుఖాలకు దూరమైన వారే. శ్రీనివాస్ తండ్రి కూడా చివరికి సన్యాసం తీసుకోవాలనే అనుకొన్నాడు,కానీ అనుకోకుండా హార్ట్ ఎటాక్ తో చనిపోయాడు. పూజారి కుటుంబం. భక్తీ శ్రద్ధలతో భగవత్ సేవ చేసే వాడు. కానీ విపరీతమైన కోప దారి కోపం వస్తే నిప్పు మీద కోతి అనిపించేవాడు. దుర్భాషలాడేవాడు. తండ్రి విపరీత గుణాలను చూసి శ్రీనివాస్ చాలా జాగ్రత్తగా మసలు కొనేవాడు.తల్లి సాధుస్వభావం అతడికి గొప్ప ప్రేరణ కలిగించింది. తల్లిని గురించి రాస్తూ "మ అమ్మ సెక్యులర్ కుటుంబం లో పుట్టింది. ఉన్నత భావాలతో విరాజిల్లింది అవే నాకు వచ్చాయి. పురాణాలన్నీ ఆమెకు వచ్చు. నాకు హాయిగా మనస్ఫూర్తిగా నేర్పించేది "అన్నాడు. కనుక బాల్యం లోనే పుణ్యపాపాలు స్వర్గ నరకాలు తప్పు చేస్తే పడే శిక్ష సుఖ సంతోషాలు అన్నీ అవగతమయ్యాయి. రాత్రులు నిద్ర లో భూతాలూ పిశాచాలు కనిపించి భయ పెట్టేవి. ఉదయం కాగానే హాయి గా ఉండేది. కొన్ని సుఖ స్వప్నాలు కూడా వచ్చేవి. వాటి గురించి "ఒకసారి మహా విష్ణువు కలలో మహా ప్రకాశమానంగా కరుణా కటాక్షాలతో దేవతలతో,మహర్షుల తో కన్పించి క్రమంగా విపరీతంగా పెరిగిపోయి వర్ణించలేని విధంగా మహా స్వరూపంగా దర్శన మిచ్చాడు. నా కళ్ళు అర్జునుడి కంటే స్పష్టంగా ఆ విశ్వ రూపాన్ని చూశాయి ధన్యుడనయ్యాను. తర్వాత ఇలా చాలా సార్లు కలలు వచ్చాయి.భగవద్గీతలో పన్నెండవ అధ్యాయం లో వర్ణింపబడిన విశ్వ రూప సందర్శన భాగ్యం అది"అని చెప్పాడు.



ఇలాంటి విషయాలు స్నేహితులకు చెప్పేవాడు. మనసంతా పవిత్రంగా ఉండేది. తల్లి తండ్రికంటే ఎక్కువకాలం జీవించింది. సెల్ఫ్ గవర్నమెంట్ విషయం లో ఇంగ్లాండ్ వెళ్లి అక్కడి వారితో చర్చించాల్సి ఉన్నా శ్రీనివాస్,తల్లితో ఉండటానికే ఇష్టపడ్డాడు. ఆమె అతడి చేతుల్లోనే ప్రాణాలు విడవాలని పెద్ద కొడుకు గా అన్త్యక్రియలన్నీ యదా విధిగా నిర్వర్తించి బాధ్యత నెరవేర్చాలనుకొన్నాడు శ్రీనివాస శాస్త్రి. కానీ 1919 లో ఇంగ్లాండ్

బయల్దేరి వెళ్లాడు. ఏడెన్ చేరకముందే తల్లి మరణించిన వార్త తెలిసి జీవితాంతం కుంగి కుమిలి పోయాడు. ఆమె అంత్యక్రియలు యధావిధిగా నిర్వర్తించ లేని తన దౌర్భాగ్యాన్ని తలచుకొని వ్యధ చెందాడు. తల్లి అంటే అంతటి అభిమానం ఆరాధ్యం అతడికి.

కుంభ కోణం లో చదివి మెట్రిక్ పాసయ్యాడు. అ స్కూల్ లో అతడికి మహా దేశ భక్తుడు,గొప్ప వ్యక్తిత్వం ఉన్న రావు బహదూర్ అప్పుస్వామి అనే ఆ స్కూల్ సంస్థాపక హెడ్ మాస్టర్ ప్రభావం పడి,శాస్త్రిలోని సకల నిగూఢ శక్తులు పురి విప్పుకొన్నాయి. మేధస్సు పరిపక్వమైంది. శాస్త్రి జీవితాన్ని తీర్చి దిద్దిన మహాగురువే అప్పు శాస్త్రి. తన గురువు"సమకాలీన పరిస్థితులన్నీ అవగాహన కలవారు. యువ విద్యార్ధులను ఎలా అభి వృద్ధి మార్గం లో శక్తిస్వరూపులుగా కార్యోన్ముఖులుగా మలచాలో బాగా తెలిసిన వారు. నేను అంటే విపరీతమైన అభిమానం ఉన్న వారు. క్లాస్ రూం లోకి వార్తాపత్రికలు,పార్లమెంటరి రికార్డ్ లు,చరిత్ర పుస్తకాలు మేగజైన్స్ లు తెచ్చి అందులో పార్లమెంటరి విధానాలన్నీ చదివించి మనసుకు పట్టించేవారు. ఒక రోజు గురువుగారు కలకత్తాలోని ప్రముఖ న్యాయవాది,ఇంగ్లీష్ లో మహా వక్త లాల్ మోహన్ ఘోష్ పై రాయబడిన వ్యాసాన్ని చదివి వినిపించారు. అది యూరోపియన్లు,ఆంగ్లో –ఇండియన్స్ "ఇల్బెర్ట్ బిల్ "ను వ్యతిరేకిస్తున్న కాలం. అంటే యూరోపియన్ లపై ఉన్న కేసులను యూరోపియన్ జడ్జి లు మాత్రమె విచారించాలి అనేది. ఈ బిల్ ఇంగ్లీష్,ఆంగ్లో ఇండియన్ లను కలవర పరచింది. వైస్ రాయ్ రిప్పన్,లా మినిష్టర్ కర్ణీ ఇల్బర్ట్ లకు కూడా బాధ కలిగించింది. కలకత్తాలో యూరోపియన్లు,ఆంగ్లో ఇండియన్లు పెద్ద రాలీలు నిర్వహించారు,మీటింగ్ లు పెట్టారు. బారిష్టర్ బ్రాన్సన్ "ఈ నేటివ్ విమర్శ జాక్ –యాస్ కికింగ్ ది లయన్ "అని కూశాడు. దీనికి దీటుగా మరింత పెద్ద బహిరంగ సభ ఏర్పరచి లాల్ మోహన్ ఘోష్ కుక్కకాటుకు చెప్పు దెబ్బగా దిమ్మ తిరిగే సమాధానం చెప్పాడు. దానినే అప్పు శాస్త్రి క్లాస్ లోకి తెచ్చి తమకు చదివి వినిపించారని శ్రీనివాస శాస్త్రి చెప్పాడు. "అప్పుడు నేను ఇంకా కుర్రాడినే అయినా నారక్తం మరిగిపోయింది "అని రాశాడు శాస్త్రి.

## విద్యాభ్యాసం

జీవిత చరమాంకం లో శాస్త్రి "ఆరవ ఫారం లో ఉండగానే మా గురువుగారు అప్పుశాస్త్రి "జెంటిల్ మాన్ "అనే పదానికి గొప్ప అర్ధం చెప్పారు. దాని అర్ధం మర్యాద,స్వరూపం,ఔచిత్యం,కోపం,సంతోషం తగ్గించుకోవటం లను కలిగి ఉండటం అనే విస్తృతార్ధం బోధించారు "అని రాసుకొన్నాడు. అలా అప్పు శాస్త్రి ప్రభావం శ్రీనివాస శాస్త్రి పై చాలా ఉన్నది. మంచి ఆరోగ్యంగా ఆటలు, నది లో క్రీడలతో అన్నిటా ముందుండేవాడు. బాహ్య ఆరోగ్య రక్షణ ఆతడి అంతర్ సౌందర్యానికి శ్రీ రామ రక్ష అయింది. 14ఏళ్ళ వయసులో అంతకంటే తక్కువ వయసున్న పార్వతి తో శాస్త్రి వివాహం 1883లోనే జరిగింది. అప్పటి యువకులు 18 దాటితెకాని పెళ్ళికి ఇష్టపడే వారు కాదు. కానీ తలిదండ్రుల ఒత్తిడి తో తలవంచక తప్పలేదు. పెళ్ళి జరిగిపోయింది. 1884లో మెట్రిక్ మద్రాస్ ప్రెసిడేన్సి లో 13 వ వాడుగా పాసయ్యాడు. ఈ ఉత్తమ రాంక్ ఫస్ట్ యియర్ ఆఫ్ ఆర్ట్స్ లో జీతం కట్టకుండా చేరటానికి అర్హత నిచ్చింది.

కుంభకోణం ప్రభుత్వ కాలేజి లో చేరి,ప్రేసిడేన్సి మొత్తం మీద ఫస్ట్ రాంక్ లో పాసయ్యాడు. ఇంగ్లీష్ లో గోల్డ్ మెడల్ పొందాడు. ఈ రాంక్ వలన బి ఏ లో కూడా ఉచిత విద్యకు అర్హుడై నాడు. అప్పటి క్లాస్ మేట్ లలో కే శ్రీనివాస అయ్యంగార్ –ఈయన తర్వాత మద్రాస్ ప్రభుత్వం లో లా మినిస్టర్,టి.జీవాజి రావు –తర్వాత జిల్లా సెషన్స్ జడ్జ్ ఉన్నారు. అధ్యాపకులలో మహా విద్వాంసులైన ప్రొఫెసర్ సుందర రామ అయ్యర్,ప్రొఫెసర్ సాదు శేషయ్య,మిస్టర్ జి హెచ్ స్టువార్ట్,మిస్టర్ ఎ. బిల్డేర్ బెక్,మిస్టర్ హేన్స్ మాన్,మహా మహోపాధ్యాయ రంగా చారి ఉన్నారు. వీరందరిపై శాస్త్రికి అత్యంత గౌరవం ఆదరం ఉండేది. వారూ అతనిపై అలాంటి వాత్సల్యాన్నే చూపే వారు. ఇందులో చాలామంది శ్రీనివాస శాస్త్రి సాధించిన ప్రపంచ వ్యాప్త విజయాలను కనులారా చూసి పులకించిన వారే.

1887 లో మద్రాస్ లో శాస్త్రి మొట్టమొదటి సారిగా సురేంద్ర నాద బెనర్జీ భారత జాతీయ కాంగ్రెస్ లో ప్రసంగం చేయటం విన్నాడు. అప్పటికి ఇంకా జూనియర్ బి ఏ క్లాస్ లోనే ఉన్నాడు. లాంగ్వేజ్ పరీక్ష రాయటానికి మద్రాస్ వచ్చాడు. ఆకాలం లో మారుమూల ప్రాంతాలవారందరూ మద్రాస్ వచ్చి బి ఏ. పరీక్షలు రాయాల్సిందే. అదృష్ట వశాత్తు సురెంద్రుని ప్రసంగం వినటం అతడి అదృష్టం అయింది. ఈ అనుభవాన్ని జ్ఞాపకం చేసుకొంటూ "సురెంద్రుడు అత్యుత్తమ ప్రసంగం చేశారు. అలాంటి ఉపన్యాసం నా జీవితం లో ఎప్పుడూ విని ఉండలేదు. అది నా మనసుపై గాఢ ముద్ర వేసింది. ఆ వాక్ ప్రవాహానికి అవతలివారిని చీల్చి చెండాటనాన్ని మర్చిపోలేను. గంగా ప్రవాహమే అది. విషయ వివరణ చేస్తూ కావాల్సిన చోట్ల నొక్కి చెబుతూ,నిదానంగా మనసులోకి చొచ్చుకొని పోయేట్లు సందిగ్ధ రహితం గా మాట్లాడిన తీరు నన్ను ముగ్దుడిని చేసింది. సముద్ర తరంగాల లాగా పైకి ఎగురుతూ తగ్గుతూ గొప్ప అనుభూతి కలిగించింది. 'oh !it was splendid,splendid treat for us "అన్నాడు పొంగిపోతూ.

1883లో శాస్త్రి బి ఏ ఫస్ట్ క్లాస్ లో ఇంగ్లిష్ లో ప్రేస్సిడేన్సి మొత్తం మీద ఫస్ట్ మార్క్ లతో పాసయ్యాడు. అతడికి చదువులో గొప్ప సాయం చేసిన వాడు పెద్దక్క భర్త అంటే పెద్దబావ గారు విశ్వ నాద అయ్యర్. ఆయన ప్రోద్బలంతోనే లా కాలేజిలో చేరాడు. దురదృష్ట వశాత్తు చేరిన కొద్దికాలానికే బావ చనిపోతే లా మానేసేయాల్సి వచ్చింది. కుటుంబ బాధ్యత శాస్త్రిపై పడింది అదృష్టవశాత్తు తంజావూర్ జిల్లా మాయవరం లో మునిసిపల్ హై స్కూల్ లో టీచర్ గా అవకాశం వచ్చి 1888లో చేరాడు. హెడ్ మాస్టర్ నారాయణ స్వామి తండ్రిలాగా ఆదరించాడు. కొంతకాలం తన ఇంట్లోనే ఉండమన్నాడు. విద్యార్ధులకు శాస్త్రి మాష్టారిపై గౌరవం ఆయనకు పిల్లలపై అభిమానం బాగా కలిగాయి. ఇలాంటి సత్సంబంధం విద్యార్ధుల ఉపాధ్యాయుల మధ్య ఉండాలి అని చెప్పేవాడు శాస్త్రి. అక్కడి శిష్యులలో టిఆర్ వెంకట రామ శాస్త్రి ప్రముఖ న్యాయవాదిగా లిబరల్ నాయకుడుగా ఎదిగాడు. వీరిద్దరి మధ్య స్నేహం జీవితాంతం ఉండి పోయింది. మాయవరం లో ఉండగానే శాస్త్రికి "వెబ్ స్టర్ ఇంగ్లిష్ డిక్షనరి "తో పరిచయం మొదలైంది. దానిపై రోజూ అనేక గంటలు పని చేసే వాడు. అతడి మిత్రులు "మా వాడికి అది భగవద్గీత అయింది "అని నవ్వేవారు. దీనివలన శ్రీనివాస శాస్త్రికి తక్కువ వయసులోనే ఇంగ్లిష్ లిటరేచర్ పై అద్భుత మాస్టరి సాధించటానికి ఫౌండేషన్ పడటానికి గొప్ప అవకాశం లభించింది.ఇంగ్లిష్ భాషా



నుడికారం,పదబంధం,వ్యాకరణం,ఉచ్చారణ లపై సాధికారత సాధించాడు. మహా వక్తగా ఎదగటానికి గొప్ప ఫౌండేషన్ ఏర్పడింది.

## ఉద్యోగం మద్రాస్ పయనం

మాయవరం లో మూడేళ్ళు హాయిగా ఆడుతూ పాడుతూ టీచర్ గా ఉద్యోగించి శ్రీనివాస శాస్త్రి 1891లో మద్రాస్ సైదాపేట టీచర్స్ ట్రెయినింగ్ కాలేజిలో చేరాడు. ప్రశాంతంగా ఉన్న మాయవరం వదిలి కాంక్రీట్ జంగిల్ మద్రాస్ వెళ్లటం తలి దండ్రులకు,హెడ్ మాస్టర్ నారాయణ స్వామి అయ్యర్ కి ఇష్టం లేదు. కానీ విద్యా బోధకుడికి శిక్షణ అవసరమని తాను విద్యా వేత్తగా రాణించాలని అనుకొన్నాడు శాస్త్రి. ఒక ఏడాది హాయిగా సైదాపేట లో గడిపాడు. అక్కడ అందరూ ఆయనను "సీనియర్ మోస్ట్ ప్యూపిల్ టీచర్" గా గౌరవించారు. క్లాస్ లో కంటే వేదికలమీద ఆట స్థలం లో తన ప్రతిభ చాటుకున్నాడు.

అప్పుడప్పుడు మాత్రం క్లాస్ లో ఉన్న స్పృహ ఉండేది. ఒక రోజు కాలేజి ప్రిన్సిపాల్ మిస్టర్ ఎ. ఎ. హాల్ విద్యార్ధులకు వక్తృత్వం,ఖచ్చితమైన ఉచ్చారణ బోధిస్తూ మూడు ఇంగ్లీష్ పదాలను తప్పు ఆక్సేంట్ తో మాట్లాడాడు. అప్పటికే ఆక్సేంట్ పై మాస్టరి సాధించిన శాస్త్రి ఆమూడు పదాల ఉచ్చారణ తప్పుగా ప్రిన్సిపాల్ పలికాడని తెలియ జేశాడు.ఆమూడుమాటలు –magnificient,formidable,execrable. ప్రిన్సిపాల్ తాను కరెక్ట్ గానే పలికానన్నాడు. వెంటనే డిక్షనరి తెప్పించి శాస్త్రి వాటిని పలికే విధానం వివరించగా తప్పు ఒప్పుకొన్నాడు ప్రిన్సిపాల్..శాస్త్రిపై ఎలాంటి అసూయ పడక నిజాయితీగా వ్యవహరించాడు ప్రిన్సిపాల్ హాల్.శ్రీనివాసన్ తో చాలా చనువుగా వ్యవహరించాడు.

1892లో శాస్త్రి మళ్ళీ మాయవరం వచ్చి మునిసిపల్ హైస్కూల్ లో టీచర్ గా చేరాడు. మళ్ళీ తలిదండ్రుల అభీష్టానికి వ్యతిరేకంగా 1893లో సేలం మునిసిపల్ కాలేజి లో ఫస్ట్ అసిస్టెంట్ గా చేరాడు. ఇరుకు ప్రపంచం నుంచి విస్తృత లోకం లోకి కాలు పెట్టిన అనుభూతి పొందాడు ఈ విషయాన్ని స్నేహితుడు డి.వి. గుండప్ప కు రాస్తూ – "మాయవరం లో ఉన్న ఏడేళ్ళు నువ్వు చెప్పినట్లు డిప్రెషన్ లో ఉన్నానని పించింది. అక్కడి వాతావరణం నన్ను కిందికి లాగేదిగానే ఉందికాని ఎదగటానికి తోడ్పడ లేదు. మంచి సదవకాశాలన్నీ జారిపోతున్నాయని వ్యధ ఎక్కువైంది. నా బదిలీ నాన్నకు హెడ్ మాస్టర్ కూ ఇష్టం లేదు. ఆ అననుకూల పరిస్థితుల నుంచి బయటపడి సేలం లో చేరినందుకు కాస్త ఊపిరి పీల్చు కొన్నట్లు అనిపించింది "అని రాశాడు. సేలం కాలేజిలో రెండేళ్లు ఇంగ్లీష్ టీచింగ్ తో అందరినీ మెప్పించాడు. తనకు సాటి ఎవరూ లేరని పించుకొన్నాడు.

సేలం లో గొప్ప దేశ భక్తుడైన సి విజయరాఘవా చారియార్ ప్రభావం లో పడ్డాడు. ఇండియన్ సివిల్ సర్వీస్ పరీక్షలలో ఇండియాలో,ఇతర చోట్ల ఒకే సారి పరీక్షలు జరగాలి అన్న అభిప్రాయంతో భేదాలున్నాయి వీరిద్దరికి. అప్పుడు ఐ సి ఎస్ పరీక్షలకు ఇంగ్లాండ్ లో మాత్రమె పరీక్షలు జరిగేవి. సర్ ఫిరోజ్ షా మెహతా వంటి వారు

ఇండియాలోకూడా అదే సమయం లో పరీక్షలు జరగాలని కోరారు. కానీ ఒకవేళ ఇండియా పరీక్షలలో పాసైనా,ఇంగ్లాండ్ లో ఒక ఏడాది ట్రేయింగ్ పొంది అప్పుడు ఇండియాలో ఉద్యోగం చేయాలి అన్నారు. విజయరాఘవాచారి దీన్ని వ్యతిరేకించాడు. శాస్త్రిమాత్రం ఫిరోజ్ షా ను సమర్ధించాడు. దీనిపై మీటింగ్ లో కూడా తన అభిప్రాయం వ్యక్త పరచాడు. శాస్త్రి నే అందరూ సపోర్ట్ చేయటంతో రాఘువాచారి అతడి తెలివి తేటలకు సామర్ధ్యానికి చాక చక్యానికి అబ్బుర పడ్డాడు. శాస్త్రిపై మక్కువ ఏర్పడి అతడినితీర్చి దిద్దే పనిలో పడ్డాడు. సేలం మునిసిపాలిటిలో నాన్ అఫీషియల్ చైర్మన్ ను తొలగించి అధికార వ్యక్తిని నియమించటం పై రాఘువాచారి వ్యతిరేకించి,పెద్ద నిరసన సభ నిర్వహించాడు. శ్రీనివాస శాస్త్రిని వార్తాపత్రికలలో ఆర్టికల్స్ రాయటానికి,హిందూ పేపర్ లో ఎడిటోరియల్స్ రాయటానికి సహాయం కోరి పని చేయిన్చుకొన్నాడు. రాజకీయాలపై పెద్దగా ఆసక్తి లేని శాస్త్రి తన సీనియర్ ఆచారి మాటలను గౌరవించేవాడు. ఆయన వద్దే రాచకీయాలలో ఎబిసిడి లు నేర్చాడు.

1885లో శాస్త్రి సేలం వదిలి మద్రాస్ పచ్చయప్ప కాలేజి హైస్కూల్ లో ఇంగ్లీష్ టీచర్ గా చేరాడు. 1886లో భార్య పార్వతి మరణించింది. అప్పటికి వారికొడుకు శంకరన్ చాలా పసివాడు. దీనిపై "పార్వతి ఫోటో ను కూడా తీయించి దాచుకోలేని దౌర్భాగ్యుడిని "అని రాసుకొన్నాడు. 1897లో లక్ష్మి ని ద్వితీయం చేసుకొన్నాడు. క్రమంగా దుఖం మింగుకొంటూ బాధ్యతగల భర్తగా నిలదొక్కుకున్నాడు. 1899లో శాస్త్రి ట్రిప్లికేన్ హై స్కూల్ హెడ్ మాస్టర్ అయ్యాడు. విద్యావేత్త గా గొప్ప పేరు సంపాదించాడు. క్రమ శిక్షణకు మారుపేరుగా ఆ విద్యాలయాన్ని తీర్చి దిద్దాడు. స్కూల్ గౌరవం పెంచాడు క్లాస్ లో కఠినంగా ఉన్నా క్లాస్ బయట విద్యార్ధులతో చనువుగా ఉండేవాడు. విహార యాత్రలకు ఫీల్డ్ ట్రిప్స్ కు వారితో వెళ్ళేవాడు. వారితోకలిసి ఈతకోట్టేవాడు ఆటలు ఆడేవాడు. ఇక్కడి విద్యాబోధన మహత్తరంగా పరమ సంతోషంగా ఉండేది ఆయనకు. దాదాపు విద్యార్ధుల వయసు వాడే అవటంతో వారితో చాలా ఫ్రెండ్లీ గా ఉండేవాడు వారి తప్పులు సరిచేసేవాడు. బాగా చదివినవారికి ప్రోత్సాహక బహుమతులిచ్చేవాడు. కానీ ఈ విద్యా బోధనా సంతోషం చాలదని పించాయి. తన వ్యక్తిత్వం ద్వారా వాళ్ళను మరింత ప్రభావితులను చేయాలని పించేది. అప్పుడే ఆయనకు వి. కృష్ణస్వామి అయ్యర్,జి ఎ నటేశన్,ప్రొఫెసర్ కే బి రామ నాధన్ వంటి ఉత్తములతో గొప్ప పరిచయాలేర్పడ్డాయి. బహిరంగ చర్చలలో పాల్గొనే వాడు. 1943లో శాస్త్రి ట్రిప్లికేన్ లిటరరీ సొసైటీ లో పాల్గొన్న ఒక చర్చ ను చూసి సర్ ఎన్. గోపాలస్వామి అయ్యంగార్ "శాస్త్రి భావనలు నిత్యనూతనాలు అతడి విజ్ఞానం అనంతం అతడి వాడనాపటిమ అసాధారణం "phrasing and enunciation which later made him one of the worlds' great orators in the English language "అని పరవశంతో దాదాపు నలభై ఏళ్ళ క్రితం జరిగిన దాన్ని గుర్తుంచుకొని శ్లాఘించాడు.

## మద్రాస్ టీచర్స్ గిల్డ్

ఆ కాలం లో నే శాస్త్రి "మద్రాస్ టీచర్స్ గిల్డ్ "స్థాపించి ఎడ్యుకేషనల్ రివ్యు ప్రచురించాడు. జి ఎ నటేశన్ కు ఇండియన్ రివ్యు కు సహకరించాడు. తానూ రామనాధన్ ఇద్దరూ కూడా సాహిత్య రంగం లో తమ కృషి అత్యున్నతంగా కొనసాగించాలని ప్రతిజ్ఞ చేశామని,అప్పుడు తానూ హిందూ హై స్కూల్ లో ఇద్దరి పని భారం మోస్తూకూడా. మాంచి ఉత్సాహంతో పని చేశానని రాసుకొన్నాడు. నటేశన్ కొత్త ప్రయత్నానికి పూర్తీ సహకారం అందించానని,,అప్పటికి ఇంకా కరెంట్ రాలేదని,ప్రూఫ్ రీడింగ్ కు రెండు కొవ్వు వత్తుల కాంతి తోనే అర్ధ రాత్రి వరకు,మళ్ళీ తెల్ల వారు జామున చేశానని,తనకన్ను స్పెల్లింగ్ తప్పులను,తప్పు టైపింగ్ ను ఇట్టే పసి కట్టేదని,అప్పటి నుంచి ఇప్పటికీ అరువు పుస్తకాన్నైనా మార్జిన్ వేసి,నాకు తోచిన రిమార్కులు రాయకుండా వదలననీ ఇది,తర్వాత ఆ పుస్తకం చదివే వారు నన్ను తిట్టుకొన్నా ఫర్వా లేదని అదొక "తుత్తి"గా ఉండేదని,తనకు యే కంటి డాక్టరు లాంగ్ సైట్ ఉందని సలహా ఇవ్వలేదని,కానీ వయసు35 కే తనకా జబ్బు వచ్చి,రుగ్వేదం నాటికి అనుభవ మైందని శాస్త్రి రాసుకొన్నాడు.


PORING OVER HIS GITA

ఆ వయసులోనే ఆయన స్పృశించని పబ్లిక్ రంగం లేనే లేదు. సహకార ఉద్యమం పై మక్కువ బాగా ఉండేది "ట్రిప్లికేన్ అర్బన్ కొ ఆపరేటివ్ సొసైటీ "స్థాపనలో ముఖ్య పాత్ర వహించాడు శాస్త్రి. అది ఇవాళ అతిపెద్ద సంస్థగా విస్తరించింది. సాంఘిక సంస్కరణ లపైనా దృష్టి పెట్టాడు. రజస్వలానంతర వివాహాలు ప్రోత్సహించాడు. హిందూ శాస్త్రాలలో దీన్ని సమర్ధించిన విషయాలను వ్యాస రూపంగా 1906లో ఒక కరపత్రం రాసి ప్రచురించాడు. చెప్పటం మాత్రమేకాదు తన కూతురు రుక్మిణి వివాహాన్ని రజస్వలానంతారమే చేసి మార్గదర్శి అయ్యాడు. ఆకాలం లో అది ఒక రివల్యూషన్. నటేశన్ చెప్పిన దాన్ని బట్టి టీచర్స్ గిల్డ్ కొ ఆపరేటివ్ సొసైటీ లతోపాటు శాస్త్రి,అనేక క్లబ్ లు సంస్థలు కుళ్ళి కునారిల్లుతుంటే వాటిలో ఉత్సాహం కల్పించి చైతన్య వంతాలైన అనేక కాంగ్రెస్ కమిటీలను ఏర్పరచాడు..మద్రాస్ ప్రెసి డెన్సి లో ప్రముఖ వ్యక్తిగా గుర్తింపు పొందాడు. రానడే ఇన్ స్టిట్యూట్ ను స్థాపించిన కొత్తలో దాని స్థాపకుడు వి కృష్ణస్వామి అయ్యర్ కు చేదోడు వాదోడుగా ఉంటూ,దాని ఎదుగుదలకు అభివృద్ధికి గొప్ప కృషి చేశాడు శాస్త్రి

## గోఖలే ప్రభావం

1905కే శ్రీని వాస శాస్త్రి అత్యుత్తమ ప్రధానోపాధ్యాయుడు గా లబ్ధ ప్రతిష్టు డయ్యాడు. ఆరోగ్యం భేషుగ్గా ఉంది.సహచర ఉపాధ్యాయులతో విద్యార్ధులతో మంచి సంబంధం నెలకొల్పాడు. కుటుంబ విషయంలోనూ ప్రేమాస్పదుడైనాడు. కానీ 1905లో నటేశన్ "అత్యన్త గోప్యం "అని పంపిన పాంప్లెట్ చూసి తల్లడిల్లాడు. అది

సర్వెంట్స్ ఆఫ్ ఇండియన్ సొసైటి కి చెందినా రూల్స్,ప్రాస్పెక్టస్. అందులోని భాష భావాలు,జనజాగృతి ని ఆధ్యాత్మీకరించటం,దేశ భక్తీ అతడిని కట్టిపడేశాయి. దీన్ని గురించి శాస్త్రి "నేను దాన్ని పదే పదే చదివాను. నన్ను నేను ప్రశ్నించుకోన్నాను. అలాంటి మహత్తర కార్యక్రమం లో నేను భాగ స్వామిని కాలేనా ?"అనే ప్రశ్న అతడిని కుదిపేసింది గోఖలేగారు ఎంతమర్యాదగా,ఆవేశంగా రాశారోఅనిపించింది. శాస్త్రి మనసులో గోఖలే ముద్ర పడింది. 1905లో బెనారస్ లో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ సభలో గోఖలేని చూసి "వృద్ధ జ్ఞాన మూర్తి త్యాగి,ఒక కన్ను స్వర్గం పైనా,ఒకకన్ను సన్యాసం పైనా ఉంచి,లోకాన్ని పరిత్యజించినా తన ముక్తికోసం ప్రాకులాడుతున్నారు.ఆయన త్యాగం,సన్యాసం వలన తనది అనేది ఏదీ ఆయన వద్ద లేనే లేదు. అలాంటి బలిపీఠం మనం ఎక్కగలమా ?అంతటి సర్వోన్నత వ్యక్తీ సన్యాసి మళ్ళీ మనకు దొరుకుతారా ?దేశ భక్తీ ప్రార్ధన అంతా ఆయనలోనే ఉన్నది "అని రాశాడు బెనారస్ కాంగ్రెస్ సభలో పాల్గొని గోఖలే దర్శనంతో పులకించి పోయి తనను సర్వెంట్స్ ఆఫ్ ఇండియన్ సొసైటీలో ఒక సభ్యునిగా చేర్చుకోమని ఒక ఉత్తరం రాశాడు –"మహాను భావా !నేను మద్రాస్ ట్రిప్లికేన్ స్కూల్ మాస్టర్ ను. నాకు 17 ఏళ్ళ విద్యా బోధనాను భవం ఉంది, ఇప్పుడు నాకు 37.నా వయసును చూస్తె భారత దేశ సేవ చేసే భాగ్యం ఎక్కువగా లేదని పిస్తోంది. ఉన్న కొద్దికాలం లో నమ్మకంగా పని చేయగలనా అని పిస్తోంది. అలాంటి నన్ను మీ సంస్థలోకి ఆహ్వానిస్తారని ఆశగా ఉన్నది. ఏదో అప్పటికప్పుడు వచ్చిన ఉద్రేకంతో రాసిన ఉత్తరం కాదు ఇది. ఎన్నో ఏళ్లుగా నా మనసులో సుళ్ళు తిరుగుతున్న భావం ఇది. మిమ్మల్ని స్వయంగా చూడాలనీ నా మనోభావాన్ని మీకు తెలియజేయాలనీ ఈ కాంగ్రెస్ సమావేశానికి ప్రతినిధిగా హాజరయ్యాను "అని శాస్త్రి గోఖలే మహానుభావుడికి రాశాడు. ఈ ఉత్తరంపై ఆయన మిత్రుల మధ్య చర్చ జరిగింది తర్వాత. ఇది "రాజకీయ సన్యాసం "అన్నారు. తనను తన స్నేహితులెవరూ బలపరచ లేదని శాస్త్రి చెప్పాడు. ఒకరిద్దరికి నచ్చినా తనకు చెప్పే సాహసం చేయలేక పోయారు అన్నాడు.

## ప్రజాజీవితము

తన గురువు గోఖలే లాగా శ్రీనివాస శాస్త్రి ఉపాధ్యాయ పదవికి గుడ్బై చెప్పి,ప్రజాజీవిత రంగం లో చేరిపోయాడు. పూనాలోని ఫెర్గూసన్ కాలేజి ని వదిలి "సర్వెంట్స్ ఆఫ్ ఇండియన్ సొసైటీ "స్థాపించటానికి గోఖలే ఎలాంటి బాధను అనుభవించాడో,అలాంటి బాధ శాస్త్రి మద్రాస్ లోని ట్రిప్లికేన్ హైస్కూల్ ను విద్యార్ధులను సహోద్యోగులను వదిలి పెట్టినప్పుడు అనుభవించాడు. ఉపాధ్యాయ వృత్తి పరమ పవిత్రం,మహా ఇష్టం అయినా విద్యాబోధనపై ఎంతో మక్కువ ఉన్నా,విద్యార్ధులను తీర్చిదిద్దటం లో ఎంతో ఆపేక్ష ఉన్నా,చివరికి దేశ సేవలో అంతకంటే సంతృప్తి ఉందని భావించి చేరాడు. తనకు మార్గ దర్శకుడు భగవంతుడే అని నమ్మాడు. వీడ్కోలు సభలో "నా అంతరాత్మ చెప్పినట్లు నడుస్తున్నాను. రామాయణం లో వాల్మీకి రాముని తల్లి కౌసల్య చే చెప్పించిన ఉపదేశం -"యాం పాలయాసి ధర్మం త్వం ధ్రిష్ట్యా చ నియమేన ఛా –సా పై రాఘువా శార్దూల ధర్మ సత్యం అభి రక్షస్తు "అంటే ధర్మం నిన్ను అపాయం నుంచి కాపాడుతుంది. ఆధార్మాన్నే నువ్వు దృఢం గా,అనుమానం లేకుండా అనుసరిస్తే మేలు కలుగుతుంది. "అని చెప్పాడు. పై శ్లోకం అతడిని చాలాసార్లు చాల సందర్భాలలో మొక్కవోని ధైర్యంతో ముందడుగు వేయిన్చిందని స్వయంగా రాసుకొన్నాడు. నమ్మిన దాన్ని ఆత్మ సాక్షిగా అనుసరించాలని సారాంశం.



గోఖలే గారి ఆదేశం తో శాస్త్రి 1906 డిసెంబర్ లో దాదాభాయ్ నౌరోజీ మూడవ సారి అధ్యక్షత వహించిన కలకత్తా కాంగ్రెస్ సభకు హాజరయ్యాడు.. గోఖలే మహాశయుడు శాస్త్రిని అతని బృందాన్ని నౌరోజికి సొసైటీ సభ్యులకు పరిచయం చేశాడు. ఇది సభ పూర్తీ అవగానే జరిగినా 1907 జనవరి 15కు కానీ శాస్త్రి ని సభ్యుడిగా తీసుకోలేదు. ఈ విషయం గుర్తు చేసుకొంటూ శాస్త్రి "బాలీ గంజ్ లో రోలాండ్ రోడ్ లో ఉన్న ఒక ఇంటి పై భాగం లో ఉదయం పూట జరిగింది. స్నానం చేసి నిరాహారంగా కార్యక్రమం అంతా అయ్యేదాకా ఉండమన్నారు. అంతకు ముందు రాత్రి విజిల్ శబ్దం కాని,ప్రార్ధనలు కానీ నాకేమీ విని పించలేదు. గోఖలే గారి ప్రవర్తన పరమ ప్రశాంతంగా మనోహరంగా,సంభ్రమం గా అనిపించి గౌరవం మరింత పెరిగింది. ఆయనతో పాటు ప్రతిజ్ఞా వాక్యాలను పలికాను. అవి నేను సంతృప్తిగా అనుసరించ గలనా అనే భయం కలిగింది. "అని రాసుకొన్నాడు.

సొసైటీ సభ్యునిగా చేరిన తర్వాత మర్నాడు ఉదయమే శాస్త్రి విభజన విషాదం పొందిన తూర్పు బెంగాల్ ను,జరిగిన నష్టాలను ప్రజల కడ గండ్లను తిరిగి చూసి తెలుసుకొన్నాడు. అస్సాం మణిపూర్ లు కూడా అక్కడి

నాయకులలాగానే ఆకర్షణీయం అని పించాయి. ”బారిసాల్ రాజు “అని గౌరవంగా పిలువబడే అశ్విని కుమార్ దత్తా ను ఆయన వ్యక్తిత్వాన్ని చూసి మురిసిపోయాడు. గోఖలే గారి శిష్యరికం లో అయిదేళ్ళు శ్రీని వాస శాస్త్రి ప్రజోపయోగమైన విధులను నిర్వహించగా ఆయన శాస్త్రిని అత్యంత అనుభవం ఉన్న వ్యక్తిగా భావించి మరింత దగ్గరకు చేర్చుకొన్నాడు. సొసైటీ సభ్యులకు ఉపన్యాసాలు,రాతపని కోర్ట్ వ్యవహారాలూ క్షణం తీరిక లేకుండా అయిదేళ్ళు నిర్వహించాడు. 1907లో సూరత్ కాంగ్రెస్ సభకు వెళ్లి,మితవాదులకు అతివాదులకు మధ్య జరిగిన “సూరత్ స్ప్లిట్ “కు ప్రత్యక్ష సాక్షి గా ఉన్నాడు. తిలక్ పాల్, అరబిందో అతివాదులకు,మెహతా,రాస బిహారీ ఘోష్ గోఖలే మితవాదులకు నాయకత్వం వహించారు. మహారాష్ట్ర లో తయారైన లోహపు చెప్పును ఫిరోజ్ షా మేహతాపై ఎవరో విసిరారు. అది బెనర్జీని తాకి మేహతాగడ్డానికి బలంగా దెబ్బ కొట్టింది. గందరగోళం చెలరేగి అసలేం జరుగుతోందో తెలియని భయానక పరిశ్థితి ఏర్పడగా సభను వాయిదా వేశారు. శాస్త్రి గబగబా వేదిక ఎక్కి అక్కడి పెద్దలకు హాని కలగకుండా కాపాడాడు. కుర్చీలు ఒకరిపై ఒకరు విసిరేసుకొంటున్నారు. ఒక యువకుడు ఒక కుర్చీని శాస్త్రిపై విసిరాడు. కొద్దిలో తప్పింది. తేరిపార చూడగా వారిలో తన హిందూ హైస్కూల్ విద్యార్ధులు కనిపించగా ఆశ్చర్య పోయాడు. అందులో కొందరు శాస్త్రి దగ్గరకు వచ్చి హింసాకాండ జరిగినందుకు క్షమించమని కోరుతూ తమిళం లో “సార్ మీరా ?మా హెడ్ మాష్టారా ??”అన్నారు. వేదికపైన ఉన్న బాలగంగాధర తిలక్ ను రక్షించటానికి గోపాల కృష్ణ గోఖలే రెండు చేతులు చాచి రక్షక కవచంగా అడ్డు పెట్టటం కిందికి జాగ్రత్తగా తీసుకు రావటం శాస్త్రి ప్రత్యక్షం గా చూశాడు. రాజకీయంగా తనకు వ్యతిరేకి అయిన తిలక్ మహాశయుని ప్రేమ,ఆదరణ,వ్యక్తిత్వాలను గురించి గోఖలే ఎప్పుడూ పొగుడుతూనే ఉండేవాడని శాస్త్రి చెప్పాడు. శాస్త్రి బొంబాయిలో చివరి మూడు రోజులు ఉండి తిలక్ గారి కేసు విచారణ ప్రత్యక్షంగా చూశాడు. జస్టిస్ డవార్ శిక్ష ను ప్రకటిస్తూ పడుతున్న మానసిక క్షోభను,ఆవేదనను కూడా ప్రత్యక్షంగా చూశాడు. తీర్పును జస్టిస్ అతి ప్రశాంతంగా నెమ్మదిగాక్షోభిస్తున్న హృదయం తో చదివాడు అప్పుడు కోర్ట్ అంతా స్మశాన నిశ్శబ్దం ఆవరించు కొన్నది. ఆసంఘటనపై శాస్త్రి ఒక ఉత్తరం లో –”ఆ దెబ్బకు పూనా ఆయనకు వంగి సలాం చేసింది. ఆబాద ప్రతిఇంటి వారి బాధ అయింది. తిలక్ వంటి మహోన్నత నాయకులు మళ్ళీ మాకు కనిపిస్తారా అని పించింది “అని రాశాడు. శాస్త్రి గుండె నిండా అతివాద భావనలున్నా,గోఖలే దాన్ని మెత్తని మాటలతో తగ్గించేవాడు. 1907లో మరో ఉత్తరంలో శాస్త్రి –”రాబోయే తరాలు మరింత వ్యక్తిత్వం,పౌరుషం,పట్టుదల తీవ్రవాదుల యెడ చూపిస్తారేమో. చరిత్ర నిష్పక్ష పాతంగా జరిగిన సంఘటనలు రికార్డ్ చేయాలి. వాళ్ళ అజాగ్రత,సాహసం ధైర్య శౌర్యాలు మన దేశ విముక్తికి కారణాలు అవవచ్చు. ”extremist is a moderate in a hurry “అన్నాడు శాస్త్రి. శాస్త్రికూడా ఎక్స్ట్రీమిస్ట్ యే కాని అగ్నిని మూటకట్టుకొన్న వాడు. ఆ రోజులలో సర్వెంట్స్ ఆఫ్ ఇండియన్ సొసైటీ పైనా,సభ్యులలపైనా పోలీసు నిఘా ఉండేది. శాస్త్రిని సి. ఐ. డి. చాలా జాగ్రత్తగా గమనించేవాడు.

## కాంగ్రెస్ లో

కాంగ్రెస్ రెండు గా విడిపోయిన మర్నాడు తటస్థ సభ్యులు ఫిరోజ్ షా కంప్ లో సమావేశమై కాంగ్రెస్ సిద్ధాంతాలపై నిబద్ధత,విధేయత ఉన్న వారి సమావేశం జరపాలని నిర్ణయించారు. అందరికి నోటీస్ పంపుతూ ఈ క్రింది విషయాలపై అంగీకారం తెలియ జేయమని ప్రతినిధులను కోరారు. 1-బ్రిటీష సామ్రాజ్యం లో ఉన్నట్లు ఇండియా స్వయం పాలన లో ఉండాలి. బ్రిటీష వారితో పాటు ఇండియా కూడా అవే లక్ష్యాలు,రాజకీయ ప్రయోజనాలు కలిగి ఉండాలి. 2-ఇదంతా రాజ్యాంగ బద్ధంగా,ఇప్పుడున్న విధానం లో సంస్కరణ లతో పాలనావిదానంతో,జాతీయ భావంతో,ప్రజా సంక్షేమ దృష్టితో ఉండాలి. ఈ రెండు విషయాలే కాంగ్రెస్ కు బలాన్ని ఉత్తేజాన్ని తెచ్చి ఆతర్వాత ఏర్పడే రాజ్యంగా రచనలో మౌలికమైనాయి. ఆసమావేశం దీన్ని ఆమోదించి కన్వెన్షన్ కమిటీ ని ఏర్పాటు చేసి,1908 లో అలహాబాద్ లోసమావేశమై వీటిని సమర్ధించే వారు మాత్రమె కాంగ్రెస్ ప్రతినిధులు గా గుర్తింప బడాలని నిర్ణయించారు. 1908లో మద్రాస్ కాంగ్రెస్ ఈ కన్వెన్షన్ కమిటీ ఆధ్వర్యం లోనే జరిగింది. ఈ పెనుభారమంతా శాస్త్రి ఆరాధించే వి కృష్ణస్వామి అయ్యర్ పై పెట్టారు. అయ్యర్ కు సకల విధాల శాస్త్రి అండగా నిలబడి కృత కృతకృత్యుడయ్యాడు. శాస్త్రి, సి పై చింతామణి అంటే" చిర్రావూరి యజ్ఞేశ్వర చింతామణి "తో కలిసి ప్రెసిడేన్సి అంతా పర్యటించి,కాంగ్రెస్ కమిటీలను సెలకొల్పాడు. అది అంత తేలికగా సేలం లో జరగలేదు. ఈ ఇద్దరూ చాలా శ్రమ పడాల్సి వచ్చింది. అక్కడ రాజాజీ,,విజయ రాఘవాచారి వంటి సీనియర్ బార్ సభ్యులున్నారు. కన్వెన్షన్ ఆధ్వర్యం లో కాంగ్రెస్ సభ జరగటాన్ని ఈ ఇద్దరు వ్యతిరేకించారు. ఇన్ని అడ్డంకుల మధ్య మద్రాస్ లో వాలంటీర్ల కెప్టెన్ గా,ఆహ్వాన సంఘ కార్యదర్శి గా విపరీతంగా శ్రమించాడు సభ దిగ్విజయంగా జరిగేట్లు చేశాడు.




సర్వెంట్స్ ఆఫ్ ఇండియన్ సొసైటీ లో పని చేస్తున్నా,శ్రీని వాస శాస్త్రి విద్యారంగం పై ఆ సక్తి కోల్పోలేదు. దక్షిణ జిల్లాలన్నిటినీ కలయ తిరిగి,గోఖలేగారి "ఎలిమెంటరి ఎడ్యుకేషన్ బిల్"కు మద్దతు కూడ గట్టాడు దీని ఉద్దేశ్యం అందరికి తప్పని సరిగా ప్రాథమిక విద్య ఉండాలి. కానీ అది అందని ద్రాక్ష అయింది. 1910లో శాస్త్రి మద్రాస్ యూని వర్సిటి ఫెలో గా గ్రాడ్యుయేట్ ల చే ఎన్నుకో బడ్డాడు. 1920వరకు పదేళ్లు ఆపదవిలో ఉన్నాడు

1913 లో శ్రీనివాస శాస్త్రి లెజిస్లేటివ్ కౌన్సిల్ మెంబర్ గా నామినేట్ చేయబడ్డాడు. అందులో పెద్దగా ప్రాముఖ్యం లేక చర్చలు డిబేటింగ్ లో జరిగినట్లు చౌకబారుగా ఉండటం నచ్చలేదు. విధి విధానాలు బాగా పరిశీలించి పబ్లిక్ అఫైర్స్ పై ప్రశ్నలు సంధించే వాడు. అవసరమైన ముఖ్య తీర్మానాలు ప్రతిపాదిస్నేవాడు అన్నీ ప్రజా సంక్షేమానికి చెందినవే. అతడి వాగ్ధాటి వివేకం విచక్షణత అందర్నీ ఆకర్షించాయి. ప్రాధమిక విద్యా వ్యాప్తి జరగాలని నిరంతరం కోరేవాడు. Government policies should not be efficiency vs expansion,but efficiency cum expansion "అని వాదించే వాడు. విపరీతమైన ఖర్చుతో మోడల్ స్కూల్స్ ఏర్పాటు చేయడాన్ని ప్రభుత్వం ఉపసంహరించు కోనేట్లు చేయటం శాస్త్రి సాధించిన అద్భుత విజయం. మోడల్ స్కూల్స్ వలన డబ్బు దండగ తప్ప సామాన్యులకు ప్రయోజనం లేదన్న అతడి వాదన అందరూ మెచ్చుకొన్నారు.

## సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ

18-2-1918 గోఖలే మూడవ వర్ధంతి సందర్భంగా శాస్త్రి సర్వెంట్స్ ఆఫ్ ఇండియా అనే పత్రికా విభాగాన్ని సర్వెంట్స్ ఆఫ్ ఇండియాసొసైటీ లో ఏర్పరచాడు.దీన్ని కరెంట్ అఫైర్స్ ను బాగా వ్యాప్తి చేయటానికే చేశాడు. దీని మొదటి సంచికలో శాస్స్రి –"గోఖలే మహాశయుని ఆదర్శాలను,బోధనలను పదిలపరచటం,వాటిని జనజీవిత సమస్యలను పరిష్కరించటానికి ఉపయోగించటం ఈపత్రిక విధానం "అన్నాడు. నడిపెవారంతా గురు గోఖలే గారి నడవడిక సిద్ధాంతాలు ప్రవర్తన లను పూర్తిగా అలవరచుకొని,ఆయన నడిచినట్లే నడవాలి నీతి న్యాయబద్ధంగా. ఇందులో శాస్త్రి సంపాదకీయాలు ప్రజాజీవితం లో ఆదర్శం ఎలా ఉండాలో సూచించటమే కాక, సమస్యల సమగ్ర విశ్లేషణ,పరిష్కార మార్గాలు చెప్పటమే కాక "As a master of the music of the written word as well as the symphony of the spoken utterance "గా ఉంటుందని విశ్లేషకలు మురిసిపోయారు. మాంటేగ్ –చేమ్స్ ఫర్డ్ రిపోర్ట్ బయటికి వచ్చినతర్వాత,సెక్రెటరి ఆఫ్ స్టేట్ రెండు కమిటీలను ఏర్పాటు చేశాడు అందులో ఒకటి ఎన్నికైన మంత్రులకు ఏయే విషయాలు ఇవ్వాలి,ఏవి గవర్నర్ కు ఎక్సి క్యూటివ్ కౌన్సిల్ కు రిజర్వ్ చేయాలి,రెండవది –ప్రాంతీయ,కేంద్ర సభల ఎన్నికల విధానం లపై సలహాలివ్వమని కోరాడు. ఎన్నికల కమిటీకి శాస్త్రిన. సురేంద్ర నాద బెనర్జీ లు సభ్యులు వీరు లార్డ్ సౌత్ బరో అధ్యకుడి తో పని చేయాలి. సౌత్ బరో న్నిష్పక్షపాతమైన మనిసి భారతీయులంటే అభిమానం బాగా ఉన్నవాడు. ఈకమిటి నిర్దుష్టంగా నిర్మొహమాటం గా చర్చించి సానుకూలమైన రికమండేషన్లు చేసింది. సౌత్ బరోకు శాస్త్రిపై చాలా గౌరవం ఆత్మీయత కలిగాయి. 1930లో శాస్త్రికి ఒక ఉత్తరం రాస్తూ "మన కమిషన్ పై చిన్న వ్యాసం రాయండి. ఇంతటి సహకారం,ఏకీభావం ముందు ముందు ఉంటుందో లేదో "అని కోరాడు.

ఇండియన్ లిబరల్స్ బొంబాయి నుంచి 28-4-1919 న ఇండియా సంస్కరణలకు అనుకూలంగా బ్రిటీష వారి మద్దతుకోసం బయల్దేరి ఇంగ్లాండ్ వచ్చారు. అందులో శాస్త్రికూడా ఒక సభ్యుడు.ఇదే శాస్త్రి చేసిన మొదటి విదేశీ ప్రయాణం. అప్పుడు ఆయనకు వయసు యాభై. భారతీయ విధానానికి ఆయన వాగ్ధాటి దూర దృష్టి సవివరణ గొప్ప వరాలయ్యాయి. వచ్చిన దగ్గర్నుంచి శాస్త్రి ముఖ్యనాయకుల్ని కలవటం,అనేక సమావేశాలలో

మాట్లాడటం,సంస్కరణలను సమర్ధించి ఇంకా మెరుగులు దిద్దటం లో బిజీబిజీ అయ్యాడు. కానీ ఇంగ్లీష్ వారు మన మాటలను పట్టించుకూనే స్థితిలో లేకపోవటం బాధ కలిగించి శాస్త్రి 5-6-1919 న ఇలా రాశాడు –"ఇక్కడ ఇండియా బాధలు ఏ కొద్దిమందికో తప్ప ఎవరికీ పట్టలేదు. చాలామందికి ఇండియా,అందులోని ప్రజలగురించి అవగాహనే లేదు. తమల్ని దేబిరిస్తున్నందుకు గర్వంగా భావిస్తున్నారు "అన్నాడు. సానుకూలమైన వారిని శాస్త్రి బాగా నచ్చ చెప్పాడు అన్ని కోణాల్లో. లీడ్స్ యూని వర్సిటి కి చెందిన మైఖేల్ సాడ్లర్ ఒక ప్రైవేట్ లెటర్ లో ఇలా రాశాడు –"శాస్త్రి వాదనలు చాలామందిని ప్రభావితం చేశాయి. ఇక్కడి స్త్రీ,పురుషుల సానుభూతి,సపోర్ట్ శాస్త్రికి లభించింది. వీటన్నిటికి మించి –"His spoken,his personality,has charmed and impressed those who have had the privilege of meeting him..And they are many and influential ".

15-8-1919 న " బ్రిటీష పార్లమెంట్ అన్ ఇండియన్ కాన్ స్టి ట్యూషనల్ రిఫార్మ్స్ జాయింట్ సెలెక్ట్ కమిటి "ముందు శాస్త్రి కలిగించిన ప్రభావం వర్ణనాతీతం – Created a great impression and was described -"Characterised by phenomenal mastery,independence,outspokenness and dignity ".అనీబిసెంట్ ప్రతినిధిగా అప్పుడు లండన్ లో ఉన్న సిపి రామస్వామి అయ్యర్ ఇలా రాశాడు –"There is not a name that stands higher in England today than that of V.S.Srinivasa shastry. అలహాబాద్ పత్రిక" లీడర్" లో Mr.H.S.L.పొలాక్ –కమిటీలోని ఏ ఒక్క మెంబర్ కూడా శాస్త్రి లాగా ఆ బిల్ కు షేప్ ఇవ్వలేదు. అన్నివిధాలా శాస్త్రి గోఖలే కు సరైన వారసుడు అనిపించాడు. ఇక్కడ ఈ విషయం లోకూడా గోఖలే "కరదీపిక" మాంటిల్ శాస్త్రి భుజాలాపై ప్రకాశించింది. సంపూర్ణ న్యాయం చేసి మాట్లాడాడు గోఖలే ఆత్మ పరమ సంతోషం అనుభవించి ఉంటుంది శిష్యుడి సమర్ధతను చూసి ". ఆ ఏడాది చివర్లో శాస్త్రి ఇండియా కు తిరిగి వచ్చాడు. తానుకోరిన మార్పులు చేర్పులతో బిల్లు త్వరలో చట్టం అవుతుందని పూర్తి నమ్మకం తో ఉన్నాడు శాస్త్రి.

## లెజిస్లేటర్ గా..

తనకు భార్యకు ట్రిప్లికేన్ గరల్స్ హై స్కూల్ లో మీడియం విషయంలో వచ్చిన భేదాభిప్రాయాన్ని వివరిస్తూ శాస్త్రి –"ట్రిప్లికేన్ గరల్స్ హై స్కూలో ఆడపిల్లలు ఇంగ్లీష్ మీడియం లో చదవక్కరలేదన్నారటమీరు /వాళ్లకు ఆహక్కు లేదా విడ్డూరం కాకపోతే ?"అని ప్రశ్నించిందని రాసుకోన్నాడు. కౌన్సిల్ కూడా మాట్లాడుతూ శాస్త్రి "ఏదో ఒకరోజు మన దేశ ప్రజలు ఇంగ్లీష్ వద్దు అంటారు చూడండి "అని మాట్లాడితే

హౌస్ రిజెక్ట్ చేసింది. క్రమంగా తన భావాలను మార్చుకొని ఇంగ్లీష్ మన స్కూళ్ళు,కాలేజీలలో ముఖ్య పాత్ర వహిస్తుంది. ఇంగ్లీష్ సాహిత్యాన్ని ఉత్తమ భావాలను రానీకుండా తలుపులు మూసిన రోజు దేశానికి దుర్దినం "అన్నాడు. ఉపాధ్యాయుల హక్కుల కోసం జీతాల పెంపు కోసం నిరంతరం పోరాటం చేసేవాడు. జీతాలు బాగా

ఉంటేనే ప్రతిభగల టీచర్లు వచ్చి విద్యాబోధన మెరుగు పరుస్తారు అనే వాడు. సహకార ఉద్యమ వ్యాప్తికి,మునిసిపాలిటీలు గ్రామ పంచాయితీలు సమర్ధంగా పని చేయటానికి కృషి చేశాడు. పరిపాలనలో అన్ని దశలలో అనధికార వ్యక్తుల ప్రభావం ఉండరాదు అనే వాడు. కౌన్సిల్ లో చాలా బాగానే చర్చలు జరిగి తనకు సంతృప్తినిచ్చిందని చెప్పాడు. మద్రాస్ అడ్వో కేట్ జనరల్ హెచ్. ఎం. కార్బెట్" లెజిస్లేటర్ గా శాస్త్రిని అందరూ అభినందించే వారు. ఆయన సభకు గొప్ప గౌరవం తెచ్చారు. ఆయన లేచి నిలబడి మాట్లాడుతుంటే ఆ వాగ్ధాటికి ఆలోచనా స్రవంతికి అభ్యుదయ భావాలకు ముచ్చట పడే వాళ్ళం సభా గౌరవాన్ని పెంచింది శ్రీనివాస శాస్త్రియే. ఒకవేళ ఓడిపోయినా ఆయన పెదవులపై చిరునవ్వు చెరగక పోవటం మహా విశేషం. ఆయన్ను చూస్తే" ఆబాల్య లెజిస్లేటర్ "అంటే పుట్టుకతోనే లెజిస్లేటర్ అయ్యారేమో అనిపించింది "అని రాశాడు.

1915 ఫిబ్రవరి 19 న గోఖలే నిర్యాణం తర్వాత దేశమంతా దుఖాక్రాన్తమై తండ్రిని కోల్పోయినట్లు రోదించింది. సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ దిక్కు లేనిదైపోయింది. గోఖలే చివరి రోజుల్లో ఆయన ముఖ్య అనుచరుడు దావే "మీతర్వాత ఎవరిని సొసైటీకి అధికారిగా నియమిస్తారు ?"అని అడిగితె,ఎవరిపేరూ చెప్పటానికి తిరస్కరించారు. సొసైటీ మెంబర్స్ అందరూ సమావేశమై శ్రీనివాస శాస్త్రి ని ఏకగ్రీవగా ప్రేసిడెంట్ గా ఎన్నుకొన్నారు. అక్కడి వారందరికి ఏమని అనిపించింది అంటే గోఖలే గారే శాస్త్రిని నామినేట్ చేశారని. సి ఎఫ్ ఆండ్రూస్ ఎప్పుడూ శాస్త్రిని "Gokhale 's own chosen successor "అని పిలిచేవాడు..

శాస్త్రి సొసైటి ప్రెసిడెంట్ అయ్యాక అనేక ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వచ్చింది. గోఖలే అంటే గాంధీకి చాలాగౌరవం కొన్ని విషయాలలో భేదిన్చినా. గాంధీని ఒక ఏడాది ఇండియా అంతా తిరిగి చూసి ప్రజల స్థితి గతులు మనోభావాలు తెలుసుకొని రమ్మని సలహా ఇచ్చాడు  గోఖలే. అప్పుడే రాజకీయంలో అడుగు పెట్టమన్నాడు. దురదృష్టవశాత్తు గోఖలే ఆ వెంటనే చనిపోయాడు. గాంధీ సొసైటీ మెంబర్స్ తో కలిసి మాట్లాడే వాడు. ఇరువైపులా బాగా తీవ్రంగా లోతుగా చర్చలు జరిగేవి. ఆ సంఘటన ను గుర్తు చేసుకొంటూ శాస్త్రి "గాంధీ వచ్చి ఎక్కడ కూర్చునే వారో నాకు ఇంకా బాగా జ్ఞాపకం ఉంది.మాతోకలవకుండా ఒంటరిగా ఉండేవారు. వెటకారంగా,మాజీవితాలను నిందిస్తూ,సొసైటీకి ఏమాత్రం త్యాగం చేయని వారిమిగా సూటిగా స్పష్టంగా నిర్దుష్టంగా సామాన్య భాషలో – "ఇండియాకు సేవకులుగా మీరు గర్విస్తున్నారు. దరిద్రంతో బాధపడుతున్న అక్షర జ్ఞానం లేని హరిజనులను కూలీలను మీరు లెక్క చేయటం లేదు. అలాంటి జీవితమే ఇక్కడ మీరు గడుపుతున్నారా ?వారుతినేది తింటున్నారా,వాళ్ళ బాధలు అనుభవిస్తున్నారా వారికి తోడూ నీడగా నిలబడుతున్నారా ?మీ వలన ఎవరికీ లాభం ?.వాళ్ళ వ్యధలు బాధలు పేరుకొని పోతుంటే ప్రేక్షకుల లాగా ఉంటారా ?వారి నిరాశా నిస్పృహలను అర్ధం చేసుకొని అండగా నిలబడ లేరా?"అని సూటిగా ఉద్బోధించారు. యువతకు ప్రతినిధిగా శాస్త్రి లేచి నిలబడి "మాపై కోపం వద్దు కనికారం చూపండి. మీరు మూడో తరగతిలో రైలు ప్రయాణం మొదలు పెట్టి రెండు మూడేళ్ళు మాత్రమే అయిందేమో ?మేము ఇంకా నేర్చుకొంటాం. మమ్మల్ని తప్పుగా అర్ధం చేసుకోకండి ప్లీజ్ "అన్నాడు. గాంధీ తాను అతిగా ప్రవర్తిచానేమో అనుకొన్నారు. ఆయన వెంటనే "నా మాటలు పరుషంగా మీ మనసులను గాయపరచి

ఉండచ్చు క్షమించండి "అన్నారు.గోఖలేకు గాన్ధీపైఉన్న గౌరవం స్వయంగా దగ్గరుండి తెలుసుకొన్న శాస్త్రి గాంధీని సొసైటీలో సభ్యునిగా చేర్చు కోవాలని భావించి,ఆ తర్వాత ఎలాంటి ఇబ్బందులు వచ్చి మీద పడినా తట్టుకోవాలను కొన్నాడు. గాంధీజీ ఒక ఏడాది దేశ పర్యటన పూర్తీ కావచ్చింది. ఇక ఇప్పుడు ఆయనను సభ్యుడిగా తీసుకోవాలి. ఆవిషయం పైశాస్త్రి "మాసభ్యులందరం చాలాఆత్రుతతో చర్చిస్తున్నాం. ఆయనకు మాకు అభిప్రాయాలలో తీవ్ర భేదాలున్నాయి కానీ వాటిని వివరించి చెప్పలేక పోతున్నాం. కానీ ఆయన రాజకీయ పరిణామం మా మధ్య ఇంకా అగాధాన్ని పెంచుతుంది. చివరికి బాధా తప్త హృదయాలతో ఆయనతో" మీ దారి మీది. మా దారి మాది. ఎవరి దారిలో వాళ్ళం నడుద్దాం "అని చెప్పలేక చెప్పాల్సి వచ్చింది. ఈ అభిప్రాయాన్ని గాంధీ చాలా స్పోర్టివ్ గా తీసుకొని శాస్త్రికి ఒక ఉత్తరం రాస్తూ –"మీ సభ్యులు నన్ను మెంబర్ గా తీసుకోవటానికి ఇష్టపడక పోవటం లో తప్పేమీ లేదు. మీరూ నేనూ కలిసి పని చేయటంలో ఇబ్బందులు రావచ్చు. నా అభిప్రాయాలకు మీ సొసైటీ అభిప్రాయాలకు హస్తి మశకాంతరం తేడా ఉంది.మహాత్మా గోఖలే మార్గాన్ని మీరో విధంగా, నేనొక విధంగా అనుసరిస్తున్నాం. పరిస్తితులను అర్ధం చేసుకొన్న గాంధీ తన అప్లికేషన్ ను వాపస్ తీసుకొని హుందాగా ప్రవర్తించారు. గాంధీజీ తన Experiments with truth లో "The withdrawal of my application made me truly a member of the Society "అని రాశారు

## సహాయ నిరాకరణ పై శాస్త్రి వైఖరి

1909లో లాహోర్ కాంగ్రెస్ లో ఒక బహిరంగ సభలో తిలక్,గాంధీని పొగుడుతూ"..మనుషుల్లో మగాడు,నాయకులకే నాయకుడు,,దేశభక్తులకే దేశభక్తుడు గాంధీ. ఆయనలో భారతీయ మానవత్వం ఉన్నత శిఖరాలను అధిరోహించింది "అని మెచ్చాడు.. అదో జగత్ సహోదరుల సర్వతోముఖాభి వృద్ధికి ఆయన చేసిన సేవ అపూర్వం అనిర్వచనీయం ఉత్కృష్టం. చాంపరాన్, ఖేడాలలో ఆయన చేసిన సత్యాగ్రహాలు బాదితులపట్ల ఆయనకున్న ఆదరణ ప్రేమను వ్యక్తీకరించి మహోన్నతుని చేశాయి. రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా జరిపిన దేశవ్యాప్త హర్తాళ్ ఉద్యమం అపూర్వమైన విజయం. అమృతసర్ కాంగ్రెస్ లో మాంటేగ్ కు అభినందనలు తెలిపాడు. హంటర్ కమిటీ రిపోర్ట్ ను యూరోపియన్లు కిరాతక డయ్యర్ చర్యలను మన్నించి,అభినందిస్తే దేశం సిగ్గుతో తలదించుకొని పుండుపై కారం చల్లినట్లుగా భావించింది. ప్రశాంత మనస్కుడైన గాంధీ కోపం పరాకాష్ట కు చేరింది. అదేసమయంలో మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో టర్కీ కిచ్చిన హామీ, ప్రతిజ్ఞ లను బ్రిటీష ప్రధాని మర్చిపోయి టర్కీ విచ్చేదనం చేయటం,ఖలీఫ్ గా టర్కీ సుల్తాన్ ను ఆరాధించే భారతీయ ముస్లిం లు అవమాన భారంతో,కోప ఆవేశ క్రోధాలతో నిరసన వ్యక్తం చేశారు. గాంధీ సహాయ నిరాకరణ ప్రారంభించినప్పుడు,ఆలి సోదరుల ఆధ్వర్యం లోని ఖిలాఫత్ కమిటి మద్దతు తెలిపింది.

## సెల్ఫ్ గవర్నమెంట్ ఫర్ ఇండియా

ఆ తార్వాత 1946 లో గోఖలే పై శాస్త్రి రాసిన పుస్తకానికి ముందు మాట రాస్తూ గాంధీ –"గోఖలే గారిని నా రాజకీయ గురువు గా భావిస్తాను. కనుక శాస్త్రి గారు కూడా నా తో పాటు ఆయన తోటి శిష్యుడే. కానీ ఎంతటి గురుభక్తి ఎంతటి ఆరాధనా శాస్త్రి గారికి గోఖలే పైన ?నేను గోఖలే వారసుడిని అవుదామనుకోన్నాను. కానీ శాస్త్రి వ్యక్తిత్వానికి నేను ఫిదా అయి ఆయనకు లొంగిపోయాను. ఆసోసైటీలో ఒక సభ్యుడిని అయి ఉండేవాడిని. కానీ శాస్త్రి లాంటి ఉత్తమోత్తమ శిష్యుడు గోఖలే వారసుడవటం నాకు ఎంతగానో సంతృప్తినిచ్చింది "అని రాశాడు. శాస్త్రి ముందుగా కాంగ్రెస్ లో వామ, కుడి భావ వాదులమధ్య కాంగ్రెస్ వేదికమీదనే సయోధ్య కుదర్చాలని తీవ్ర ప్రయత్నం లో ఉన్నాడు. ఇది గోఖలే గారి చివరి రోజుల్లో కోరుకున్నదే. కానీ ఫిరోజ్ షా మెహతా తీవ్ర అభ్యంతరాలే కలయిక కు అడ్డుగా మారింది. 1915 లో మెహతా మరణం తర్వాత శాస్త్రి మళ్ళీ మధ్య వర్తిత్వం చాలా తీవ్రంగా చేశాడు. 1915,15,17 సంవత్సరాలు మన దేశ చరిత్రలో వాటర్ మార్క్ గా నిలిచిపోయాయి. జిన్నా హిందూ-ముస్లిం సఖ్యత కోసం ప్రయత్నించాడు. తిలక్ మధ్యస్తులకు నాయకత్వం వహించాడు. దేశం అంతా ఏక స్వరం తో నినదించింది. ఈ సమయంలో శాస్త్రి"సెల్ఫ్ గవర్నమెంట్ ఫర్ ఇండియా అండర్ బ్రిటీష గవర్నమెంట్ " అనే ఒక" కరపత్రం రాసి ప్రచురించాడు. అందులో ఇంకా ఏమాత్రం ఇండియా బ్రిటీష ప్రభుత్వానికి లొంగి ఎలాంటి ప్రభుత్వాలకు ఒప్పుకోకూడదు భారత దేశం బ్రిటీష రాజ్యం నుంచి విముక్తి పొందటమే తక్షణ కర్తవ్యమ్ "అని వివరించాడు. ఇలాంటి కాలం లో కూడా ఇండియన్ లెజిస్లేటివ్ కౌన్సిల్ లోని 19 మెంబర్లు శాస్త్రితో సహా బ్రిటీష ప్రభుత్వానికి ఒక మెమొరాండం సమర్పిస్తూ "బ్రిటీష డోమినియన్లకు లాగా నే భారత దేశం లో స్వీయ ప్రభుత్వం –సెల్ఫ్ గవర్నమెంట్ ఏర్పాటు చేయాలని కోరారు. ఈ చారిత్రాత్మక మెమొరాండం ను "మెమొరాండం ఆఫ్ నైన్ టీన్"గా ప్రసిద్ధి కెక్కింది. ఇదే కాంగ్రెస్ –లీగ్ డాక్యుమెంట్ కు దారి చూపింది శాస్త్రి నాయకత్వం లో. 1916లో లక్నో లో జరిగిన ముస్లిం లీగ్ సమావేశం దీన్ని ఏకగ్రీవంగా ఆమోదించింది. ఇదే లక్నో ప్రకటన అంటే ఒడంబడిక గా గుర్తింపు పొందింది. మింటో –మార్లే విధానం కంటే విస్తృతమైన ప్రాతిపదిక మీద ముస్లిం లకు ప్రత్యేక ఓటర్లు కల్పించ బడ్డారు..గోఖలే ఇలాగే కావాలని 1906లోనే కోరాడు. దానినే తిలక్,సురెంద్రనాద్ బెనర్జీ వంటి ముఖ్యనేతలు కూడా బలపరచారు. మత ప్రాదిపక ఎన్నికలు తాత్కాలికం అనీ త్వరలో విస్తృత ప్రణాళిక ఏర్పడాలని వారంతా భావించారు. అనేక సభల్లో శాస్త్రి ఈ స్కీం ను బలపరుస్తూ ప్రసంగించాడు. 1917 మె లో నాశిక్ లో జరిగిన బాంబే ప్రాదేశిక కాంగ్రెస్ సభకు శ్రీనివాస శాస్త్రి అధ్యక్షత వహించాడు. తిలక్ తో సహా ప్రముఖ నేతలందరూ హాజరయ్యారు. "ది స్టోరిఆఫ్ మై లైఫ్ "లో జయకర్ రాస్తూ "శాస్త్రి ప్రసంగం అందర్నీ మెప్పించింది. జాతీయ ఐక్యత ప్రతి బిమ్బితమైంది. దేశభక్తి పెల్లుబికింది. గోపాల కృష్ణ గోఖలే గారి "కర దీపిక "మాంటిల్ శాస్త్రి గారి చేతిలోకి వచ్చి మరింత స్పష్టంగా వెలుగునిస్తూ దారి చూపింది. గోఖలే గారికి నిజమైన అసలైన సరియైన వారసుడు శాస్త్రి అనిపించాడు "అని పొంగిపోతూ రాశాడు.

## ఇండియన్ లెజిస్లేటివ్ కౌన్సిల్ –భారత జాతీయ శాసన మండలి

1916 జులై లో శ్రీనివాస శాస్త్రి మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్ నుంచి ఇండియన్ లెజిస్లేటివ్ కౌన్సిల్ కు ఎన్నికై మళ్ళీ వచ్చాడు. సేలం కు చెందినవిజయ రాఘవా చారి,డాక్టర్ టిఎం నాయర్అనే దిగ్గజాలను ఓడించి మరీ గెలిచాడు శాస్త్రి. ఆసభలో మదన మోహన మాలవ్యా,చిమన్ లాల్ సేతల్వాడ్,భూపేంద్ర నాద బసు,డి.యి వాచా,,ఇబ్రహీం రహింతుల్లా, జిన్నా,టిబి సప్రూ, బి ఎన్ శర్మ వంటి రాజకీయ దురంధరులున్నారు. శాస్త్రిలోని చొరవ చురుకుదనం వాగ్ధాటి దేశభక్తి,నిజాయితే నిర్భీకత అధికార అనదికారులతో సహా అందర్నీ ఆకర్షించాడు. మండలి చర్చలలో శాస్త్రి పాల్గొని మాట్లాడుతుంటే అందరూ చెవులు రిక్కిన్చుకొని అక్షరం పొల్లు పోకుండా వినే వారు అంతటి సమ్మోహనం కలిగించేవాడు శాస్త్రి. 1914 రాయల్ కమిషన్ ఆఫ్ పబ్లిక్ సర్వీసెస్ పై మాట్లాడుతూ శాస్త్రి త్వరలో భారతీయత అందులోనేకాక దాని అనుబంధ విభాగాలన్నిటా ప్రతిబింబించాలని,అది తక్షణ కర్తవ్యమ్ అనీ చెప్పాడు.మండలిలో ఇది ముందు ప్రతి బిమ్బించాలి అన్నాడు. పబ్లిక్ వర్క్స్ రైల్వే పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్,విద్య,పోలీస్,మెడికల్ సర్వీస్ లో వెంటనే నియామకాలు జరగాలని అనేక తీర్మానాలు ప్రవేశ పెట్టాడు. సర్వీసెస్ లో జాతి వివక్షత చూడ రాదు అన్నాడు. పోటీ పరీక్షలు పెట్టి మంచి ప్రతిభా వంతులనే ఎంపిక చేయాలని కోరాడు. మిలిటరి డిపార్ట్ మెంట్ ఇనర్షియా - అంటే జడత్వం తో బాధ పడుతోందని దాన్ని చైతన్య వంతం చేయాలని కోరాడు. దీనికి కమాండర్ ఇన్ చీఫ్ సమాధానమిస్తూ తానూ ఎప్పుడూ ఇలాంటి ఇనర్షియా మాటలు వినలేదన్నాడు.

## శాస్త్రి – మాంట్ ఫోర్డ్ సంస్కరణలు

20-8-1917 బ్రిటన్ హౌస్ ఆఫ్ కామన్స్ లో సెక్రెటరి ఆఫ్ స్టేట్ మాంటేగ్ "బ్రిటీష ప్రభుత్వ విధానం లో ఇండియన్ ప్రజల సహకారం పాలనా వ్యవహారాలలో,సమర్ధత నైపుణ్యత బాగా కనిపిస్తూ బాధ్యతాయుత ప్రభుత్వానికి సహకారమిస్తూ బ్రిటీష సామ్రాజ్యం లో అంతర్భాగంగా వ్యవహరిస్తున్నారు. ఈ మార్గం లో మరిన్ని ముఖ్యమైన అడుగులు ముందుకు వేయటానికి సిద్ధంగా ఉన్నారు "అన్నాడు. కానీరిఫారం,రిప్రెషన్ అంటే సంస్కరణ,అణచి వేత ప్రక్కప్రక్కనే జరిగిపోతూ ఉండటం దురదృష్టం. అక్కడ మాంటేగ్ సంస్కరణలు ప్రవేశపెడితే,ఇక్కడ రౌలట్ చట్టం ప్రవేశ పెట్టారు. కనుక మాంటేగ్ ప్రతిపాదనలకు ఇక్కడ అనుకూల వాతావరం కనిపించలేదు. ఈ రకమైన గందర గోళం మధ్య 1917 చివర్లో మాంటేగ్ ఇండియా వచ్చాడు. తన రిపోర్ట్స్ పై ఇండియన్ల స్పందన,,వైస్ రాయ్ అతడి సహచారులతో మాట్లాడటం ముఖ్యమైన భారతీయ నాయకులతో మాట్లాడటం అతడి ముఖ్య ఉద్దేశ్యం. శాస్త్రి చాలాసార్లు అతడిని కలిసి చర్చించాడు. మాంటేగ్ తన డైరీలో శాస్త్రిని గురించి 20-12-1917 న –"గోఖలే వారసుడు,సర్వెంట్స్ ఆఫ్ ఇండియన్ సొసైటీ అధ్యక్షుడు శ్రీనివాస శాస్త్రిని మొత్తం మీద కలుసుకొని

మాట్లాడగలిగాను. మహా చురుకైన వ్యక్తి. కాంగ్రెస్ –ముస్లిం లీగ్ స్కీం ను సమర్ధించాడు. ముఖ్యమైన నాలుగు విషయాలను ఒప్పుకొంటే ఏ స్కీం నైనా సమర్ధిస్తాం అన్నాడు. 1- ఆ స్కీం లో అభివృద్ధి విషయాలు,అఆభి వృద్ధికి గారేంటి ఉండాలి 2-ఫిట్నెస్ విషయం లో నిర్దుష్టత ఉండాలి. దీనిపై అవమానం పొందకుండా చూడాలి 3-ఇండియాకుఆర్ధిక స్వాతంత్ర్యం తప్పక ఉండాలి. దీన్ని ఇంపీరియల్ కాన్ఫరెన్స్ లో సెటిల్ చేయాలి 4-జాతులమధ్య సంపూర్ణమైన పూర్తీ సమానత్వం ఉండాలి. దీన్ని బట్టి చూస్తె శాస్త్రి సరైన మార్గం లోనే ఉన్నాడని పించింది. కనుక ప్రభుత్వం ప్రాంతీయ ప్రభుత్వాలకు దీనిపైస్వేచ్చ నిచ్చి ఈ స్కీం అమలు చేయటానికి స్వేచ్చనివ్వాలని ఆఫీసర్లు దీనికి అడ్డు తగలరాదని ఆర్డర్ జారీచేయాలనిపిస్తోంది. చేమ్స్ ఫర్డ్,ప్రభుత్వం ఎంత తక్కువగా పని చేస్తే అంత మంచిది. ఉన్నంతలో తమ శక్తిని ఈమంచికోసం వినియోగించాలి. పగ మన పరిపాలనా విధానానికి  కు ప్రతి బంధకమౌతుంది. ఈవిషయాలు చేమ్స్ ఫర్డ్ కు కూడా తెలియజేస్తాను "అని రాసుకొన్నాడు మాంటేగ్.

ఆరోజే శాస్త్రితో మళ్ళీ సుదీర్ఘంగా మాట్లాడడినతర్వాట మరో విషయంకూడా రాసుకొన్నాడు మాంటేగ్ –"శాస్త్రి బాగా ఉపయోగ పడుతాడు "అని. 9-2-1919 న ఇండియన్ కౌన్సిల్ లో డిబేట్ ను శ్రద్ధగా విన్నాడు మాంటేగ్. భాషా ప్రయుక్త రాష్ట విభజన తీర్మానాన్ని శాస్త్రి వ్యతిరేకించాడు. ఈవిషయాన్ని కూడా మాంటేగ్ తన డైరీలో నోట్ చేసుకొన్నాడు –"ఇవాళ గొప్ప ప్రసంగం అంటే శాస్త్రి దే-"Well delivered well phrased,and very impressive,urging the rejection of the motion ".కాంగ్రెస్ –ముస్లిం లీగ్ స్కీం బాగుంది అని అనిపించినా శాస్త్రి సెక్రటరి ఆఫ్ స్టేట్స్ ప్రపోజల్స్ బాగా నచ్చి వాటిని మెరుగు పరచే ఆలోచనలో పడ్డాడు. అదే కన్స్ట్రక్టివ్ స్టేట్స్ మన్ షిప్ "అనిపించింది. మొదట్లో తిలక్, అనిబిసెంట్ లు కూడా ఆప్రపోజల్స్ ను వ్యతిరేకించారు కానీ గాంధీ,జిన్నాలు సుముఖత చూపారు. 1918 ఆగస్ట్ లో  బొంబాయిలో జరిగినకాన్గ్రేస్ స్పెషల్  సెషన్ లో ఆ ప్రపోజల్స్ ను" అసంతృప్తిగా,నిరాశా జనకంగా" ఉన్నాయని తిరస్కరించారు. ఆ సెషన్ కు శాస్త్రి దూరంగా ఉన్నా, ఢిల్లీ లో డిసెంబర్ లో జరిగిన సభకు హాజరయ్యాడు. తీర్మానం లో 'ఉన్న" అసంతృప్తి నిరాశా పదాలను" తీసివేయమని కోరాడు. బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటుకు నిర్దుష్టగడువు కూడా పెట్ట వద్దన్నాడు. 1-11-1918లో ఏర్పడిన "నేషనల్ లిబరల్ ఫెడరేషన్ "లో శాస్త్రి చేరాడు. కానీ కాంగ్రెస్ ను వదులుకోలేక పోయాడు. తన విధాన సమర్ధనకు కాంగ్రెస్ ను ఒప్పించటానికి విశ్వ ప్రయత్నం చేసి,తానూ నేషనల్ లిబరల్ ఫౌండేషన్ స్థాపక సభ్యులలో ముఖ్యుడైనా కాంగ్రెస్ సభలకు వెళ్లి చివరి ప్రయత్నం చేశాడు.

## రౌలట్ చట్టం

"రౌలట్ చట్టం భయంకరమైన హద్దూ అదుపు లేని దెయ్యాల సంతానం కు కన్నతల్లి "అన్నారు. జలియన్ వాలాబాఘ్ దురంతం దీని ఫలితమే. పంజాబ్ దురంతం తర్వాత  ఇండియన్ కౌన్సిల్ లోని ఒక యూరోపియన్ సభ్యుడు శాస్త్రితో "మీరు కనిపెట్టిన భయంకర రోగం నిజమే అయింది "అన్నాడు. 1924 లో బీసెంట్ సతికి ఉత్తరం రాస్తూ "రౌలట్ చట్టం మన రాజకీయ కష్టాలకు మూలం "అన్నాడు. పంజాబ్ ఉదంతాన్ని దేశ ప్రజలందరితో పాటు

శ్రీనివాసశాస్త్రి కూడా తీవ్రంగా కలత చెందాడు. పంజాబ్ బాంబే,ఢిల్లీ లలో జరిగిన ఈ మారణ కాన్డపై విచారణకు ఏర్పరచిన హంటర్ కమిటీ మెజారిటి యూరప్ మెంబర్లు మైనారిటి ఇండియన్ మెంబర్స్ వేర్వేరుగా నివేదికలిచ్చారు. మైనారిటీల తరఫున రిపోర్ట్ సమర్పించిన చిమన్ లాల్ సేతల్వాడ్ కు శాస్త్రి ఉత్తరం రాస్తూ ఆయన ధైర్యానికి సామర్ధ్యానికి దేశభక్తికి వందనాలు సమర్పించాడు. సర్వెంట్స్ ఆఫ్ ఇండియా పత్రికలో దీనిపై శాస్త్రి ఒక వ్యాసం రాస్తూ –"జలియన్ వాలా దురంతంలో బాధితులు ఇండియన్స్ కాకపోయి ఉంటే,ఇంగ్లీష్ ఐరిష్ లు అయిఉంటే జనరల్ డయ్యర ఊచకోత చాలా తక్కువగా బయట పడేది. డయ్యర్ విధేయతను విపరీతంగా మెచ్చుకోనేది ప్రభుత్వం అతడికి వీర తాళ్ళు కూడా తగిలించేది. మొక్కుబడిగా అతడిని ఇండియన్ కమాండ్ నుంచి తొలగించి చేతులు దులుపుకొన్నారు. వేరొక చోట అతడి ఈ నీచ క్రూర అక్రుత్యానికి పట్టం కట్టి తమ రక్తం గొప్పతనాన్ని చాటుకోనేవారు "అని తెలియజేశాడు.. హంటర్ కమిటీ రిపోర్ట్ పై కౌన్సిల్ లో చర్చ జరగాలని పట్టుబట్టాడు.తీర్మానం కూడా తెచ్చాడు. కానీ వైస్రాయ్ తిరస్కరించాడు. కారణాలు చెబుతూ వైస్రాయ్ "శాస్త్రి రిజల్యూషన్ అంటేనే న్యాయ బద్ధమైనదని మనకు నమ్మకముంది. కానీ పంజాబ్ వగైరాచోట్ల శాంతి వర్ధిల్లాలి అంటే సభలో ఇలాంటి చర్చలుజరగటం భావ్యం కాదు. ఏమైనా దాన్ని రూపుమాపుతాం "అన్నాడు. వైస్రాయ్ కంటి తుడుపు సమర్ధనకు శాస్త్రిసంతృప్తి పడలేదు. దేశానికి మొదటి సారిగా "సహాయ నిరాకరణ "ను ప్రత్యక్షంగా చూపిస్తూ నిరసన తెలియ జేస్తూ సభనుంచి వాకౌట్ చేశాడు.

## మాంటేగ్ సంస్కరణలు

మోర్లె కి గోఖలే ఎలాగో మాంటేగు కు శ్రీనివాస శాస్త్రి అలా.. గోఖలే మోర్లేతో కలిసి సంస్కరణలలో విషయం పెంచాడు. ప్రభుత్వ ఇబ్బందులు గమనించి సానుభూతి కొంత చూపాడు. శాస్త్రి కూడా మాంటేగ్ సంస్కరణలకు అలానే చేశాడు. బిల్లును తయారు చేసే టప్పుడు మాంటేగు ని స్పెక్టేటర్ పత్రికా సంపాదకుడు "బ్రిటన్ తో పూర్తీ సహకారం తో మీతో పని చేసిన ముఖ్యమైన ఇండియా నాయకుడు ఎవరు ?"అని అడిగితె "శాస్త్రి "అని క్షణం కూడా ఆలస్యం చేయకుండా చెప్పాడు మాంటేగ్. సంస్కరణల సమీక్ష సందర్భంలో శాస్త్రి అందులోని ప్రతి విషయాన్నీ క్షుణ్ణంగా పరిశీలించి, దోషాలు చెప్పి,వాటిని మార్పించటం లో కృతకృత్యుడయ్యాడు. 1919 రిఫారంస్ యాక్ట్ ప్రకారం కేంద్రీయ శాసన సభ ను1- కౌన్సిల్ ఆఫ్ స్టేట్ గా,2-లెజిస్లేటివ్ అసెంబ్లీ గా రెండుభాగాలుగా విడగొట్టారు. వీటిలో ఎన్నికైన మెజార్టీ సభ్యులు ఉంటారు అధికార ప్రతినిదులు కూడా ఉంటారు. ప్రతి చట్టాన్ని వైస్రాయ్ ఆమోదించాలి. సభ్యులు ఒప్పుకోకపోయినా ఆయన ఆమోదించే అధికారం ఉంది.కేంద్ర ప్రభుత్వ నిరంకుశాదికారం ఉన్నప్పటికీ,శాసన సభ్యులు ఎలాంటి అధిక్షేపణలైనా చేయచ్చు,ప్రభుత్వం పై ప్రభావం చూపించవచ్చు. రాష్ట్రాలు వాటి లెజిస్లేటివ్ కౌన్సిల్లను విస్తృతమైన ఓటర్ల చేత ఎన్నుకోబడుతారు. ఎక్సిక్యూటివ్ లు రెండు గ్రూపులుగా విభజింప బడ్డారు. దీన్నే శాస్త్రి మొట్టమొదటిసారిగా –డయార్కి అంటే ద్వంద్వ పాలన అని తిరస్కరించాడు. కానీ జాయింట్ కమిటీ రిపోర్ట్ వచ్చాక ఇష్టం లేకుండానే ఆమోదించాడు. ఫైనాన్స్,లా అండ్ ఆర్డర్ అయిన రిజర్వేడ్ సబ్జెక్ట్

లు గవర్నర్,అతడి సలహాదారుల చేతుల్లో ఉన్నా,ట్రాన్స్ ఫర్డ్ సబ్జెక్ట్ లు మాత్రం లెజిస్లేచర్ కు బాధ్యత వహించే మంత్రుల చేతుల్లో ఉన్నాయి. ఇది గుడ్డిలో మెల్ల.

మాంటేగ్ సంస్కరణలకు కొన్ని పరిమితులున్నా,భారతీయ రాజకీయ నాయకులు మంచి ఆలోచనా విధానంతో ప్రవర్తిస్తే ముందుముందు మంచి ఎక్కువగా జరగవచ్చు,ప్రజానీకానికి మేళ్ళు బాగా జరగవచ్చు అని శాస్త్రి భావించాడు. ఆ ఏడాది డిసెంబర్ చివర్లో ఆబిల్లు ఆచరణలోకి వచ్చింది. చక్రవర్తి ప్రకటన వెలువడింది. ఈ సందర్భంగా రాజకీయ ఖైదీలకు క్షమా భిక్ష లభించింది. నాయకులు,ప్రజలు చాలా సంతోషించారు స్పెషల్ ట్రెయిన్ లో ప్రతినిధులతో బొంబాయి నుంచి అమృతసర్ లో జరిగే కాంగ్రెస్ సభలకు వెడుతూ తిలక్,చక్రవర్తికి హోమ్ రూల్లీగ్ కు కేబుల్ ద్వారా ధన్యవాదాలు తెలిపాడు. అమృతసర్ సభలో గాంధీ ఆ సంస్కరణలను బలపరచి,మాంటేగ్ కు ధన్యవాదాలు చెప్పే తీర్మానం ఆమోదివాలనికోరాడు. జిన్నా దాన్ని బలపరచాడు. బిపిన్ చంద్రపాల్ చిత్తరంజన్ దాస్ లు కొన్ని సవరణలు ప్రతిపాదించినా,తిలక్ మొదలైన వారంతా ఆసంస్కరణలు ప్రజల అభి వృద్ధికి బాగా ఉపయోగ పడతాయని "బాధ్యతాయుత ప్రభుత్వాలుత్వరలోనే ఏర్పదేట్లు చూడాలాని కోరుతూ బలపరచారు. అమృత సర్ కాంగ్రెస్ లో ఈ తీర్మానం ఆమోదించిన ఒక ఏడాదిలోపే సహాయ నిరాకరణ ఉద్యమం ప్రారంభమవటం ఊహించని పరిణామం.

## భాషా ప్రయుక్త రాష్ట్రాల పునర్విభజన

బ్రిటీష ఇండియాలో భాషా ప్రయుక్త రాష్ట్రాల పునర్విభజన విషయం కౌన్సిల్ 1918లో చర్చకు వచ్చినప్పుడు శాస్త్రి దాన్ని ఎదిరించాడు. కారణం దానివలన సంకుచిత దేశ భక్తీ,మరిన్ని ముక్కలు దేశం అవుతుందని భయపడ్డాడు. ఆ ఏడాది బడ్జెట్ పై మాట్లాడుతూ రాష్ట్రాల నిర్వహణ భారమంతా బీదవారిపై పడుతుందని,వారిపై పన్నులు పెంచి పీడించటం జరుగుతుందని షేక్స్పియర్ కొటేషన్ ఒకటి గుర్తు చేశాడు –"which haave of late so huddled on his back. Enow pressa royal merchant down and pluck commiseration of his state from brassy bosome and tough hearts of flint "'.1917 చివరలో ప్రభుత్వం "సేడిషన్ కమిటి "ని ఇంగ్లాండ్ కు చెందిన రౌలట్ ఆధ్వర్యం లో ఏర్పరచి ఇండియాలో జరిగిన రాజ ద్రోహ చర్యలను పూర్తిగా అధ్యయనం నివారణ చర్యలు సూచిస్తూ రిపోర్ట్ ఇవ్వమన్నది. అ కమిటీ రికమం డే షనలు చాలా దారుణంగా ప్రజాస్వామ్యానికి వ్యతిరేకంగా ఉన్నాయి. ఇండియా లోని జనం దానిపై తీవ్రంగా అ భ్యన్తరాలు చెప్పి నిరసనలు పెద్ద ఎత్తున చేశారు. ప్రజాభిప్రాయాన్ని లెక్క చేయకుండా ప్రభుత్వం క్రిమినల్ లా,క్రిమినల్ లా అమెండ మెంట్ అనే రెండు బిల్లులను ప్రవేశ పెట్టింది. అనధికార సభ్యులు నామినేట్ చేయబడటం కానీ ఎన్నిక కావటం కానీ జరిగింది. 7-2-1919 న శాస్త్రి రౌలట్ చట్టం పై చారిత్రాత్మక ప్రసంగం కౌన్సిల్ లో చేశాడు. దీన్ని మహాత్మా గాంధి తన స్వీయచరిత్రలో ఇలా రాశాడు –"ఇండియాన్ లెజిస్లేటివ్ చేంబర్ లో నా జీవితం లో ఒకే ఒక సారి పాల్గొన్నాను. అదీ రౌలట్ బిల్ ప్రవేశ పెట్టినప్పుడు. శాస్త్రి ఉద్రేకం తో ఊగిపోతూ ప్రభుత్వానికి ఒక తీవ్ర హెచ్చరిక చేశాడు. సభలో ఉన్న వైస్రాయ్ నోరు మెదపకుండా మౌనంగా

ఆసాంతం విన్నాడు. అతడి దృష్టి అంతా శాస్త్రిపైనా ఆయన వాగ్ధాటి పైనే ఉంది.దానితో పూర్తిగా వైస్రాయి చలించి పోయాడని నాకు అనిపించింది "అని రాశాడు. శాస్త్రి తనలోని చాతుర్యం దేశభక్తి అన్నీ కలగలిపి గుది గుచ్చి అందరిహృదయాలను కదిలించాడు. ఆయన మాట్లాడిన దానిలో ఒక పేరా దేశం లో చాలా బాగా వ్యాప్తమై ప్రసిద్ధి చెందింది అదే –"మా దేశ ప్రజలను చాలా పరీక్షలకు గురి చేశారు. ఇప్పటిదాకా మీరు అమలు చేసిన అన్ని అణచి వేత ఉత్తర్వులైన ప్రెస్ యాక్ట్,డిఫెన్స్ యాక్ట్ వంటి వాటిని మౌనంగా సమర్ధించాం.యుద్ధ కాలం లో గంటకోసారి మమ్మల్ని విచారించి క్షోభ పెట్టారు. వంద మిలియన్ల మందిని మీకు ఇచ్చాం. ఒకటేమిటి మీరు కోరిన వన్నీ సమర్పించాం.మొన్న మీరు చెప్పిన 45 మిలియన్లు కూడా మాకొక పరీక్షే. అయినా ఒప్పుకోన్నాం. మా మనసులు సంతోషంగా,ఆనందంగా ఒప్పుకొన్న ఒక్క విషయమైనా ఉందని మీరు చెప్పగలరా ?మీ ఆకలి తీర్చటానికి బిందెడు పులిపాలు కూడా చస్తూ బతుకుతూ తెచ్చి మీకు సమర్పించాం.ఆపాలు పారబోసి మగ పులి పాలు తెమ్మని మళ్ళీ ఆజ్ఞా పిస్తారా ?""అని నిప్పులు కక్కాడు శ్రీనివాస శాస్త్రి. ఇంత వ్యతిరేకం ఉన్నా బిల్లు 18-3-1919 న ఆమోదానికి వస్తే శాస్త్రి "కొన్ని నిమిషాలలో బిల్లు సభ ఆమోదం పొంది ఆతర్వాత చట్టమౌతుంది. ఇక్కడ ఒక కవికవిత గుర్తుకు వస్తోంది –if it were done,when it is done,then it were well it were well it was done quickly "అన్నాడు మాలో ఎవరికీ ఇష్టం లేకపోయినా గాంధీ దాన్ని భుజాన కెత్తుకొన్నాడు. ఆయన ఎలా దీన్ని నిర్వహిస్తాడో చూడాలి ఈ చీకటి సమయంలో ఆయన అనుయాయులమైన మేము,ప్రభుత్వం,ప్రభుత్వ ఉద్యోగులు,రాజకీయ నిరసనకారులు,నిర్బందితులు "At the end of the business that we also wrote perfectly white " అని గర్జించాడు శాస్త్రి.

## నాగపూర్ కాంగ్రెస్ సభ

1920 డిసెంబర్ నాగపూర్ కాంగ్రెస్ లో మాంటేగ్ సంస్కరణలను ఆరకంగా జరిగినా,ఎన్నికలను పూర్తిగా వ్యతిరేకించటం జరిగింది. శ్రీనివాస శాస్త్రి నాన్ కొ ఆపరేషన్ ను పూర్తిగా వ్యతిరేకించాడు. ఈవ్యతిరేకతపై తన భావాలు వ్యక్తం చేసే సభలలో అయన వ్యతిరేకతను ఎదుర్కొన్నాడు. సున్నిత మనస్కుడైన శాస్త్రి దీనికి చాలా వ్యధ చెందాడు. పనికి రాని అభిప్రాయాలను మోయటం ఆయనకు ఇష్టం లేదు. బలీయమైన మహాత్మాను అడ్డుకోవటం అసాధ్యం కూడా. మహాత్ముడంటే ఆయనకు దైవాంశ సంభూతుడు పేదలను అక్కున చేర్చి సేద దీర్చే మహానుభావుడు. సంస్కరణలను వ్యతిరేకించి తెల్లప్రభుత్వం తో తలపడటం ఆషామాషీ కాదనుకొన్నాడు. ప్రజలపై ఎంతటి పట్టు ఉన్నా,సహాయ నిరాకరణ ఒక్కోసారి ఆయన చేతులు దాటిపోయి తీవ్ర సంచలనాలు కలుగవచ్చు హింసాత్మకంగా మారవచ్చు అని ముందే ఊహించాడు. అయన అంతరంగం యదార్ధమే సూచిస్తుంది –"తరాల భవితవ్యం ఆశలు శిధలమై అశాంతి,అణచి వేట తీవ్రంగా ఉంటుంది. ప్రభుత్వానికి సామాన్యప్రజలకు మధ్య నిత్యం యుద్ధ వాతావరణమేర్పడి అలజడి తీవ్రం అవుతుంది ఇరుపైపులవారికి వెనక్కి తగ్గే సావకాశం ఉండక పోవచ్చు.

దేశప్రజల దుస్థితి భరించ రానిది అవుతుంది "అన్నాడు.తీవ్ర క్షోభతో –"మనం మన పిల్లల విషయంలో వారి ఆశలను చిదిమేస్తున్నామేమో. తేలిక పరిష్కారం వదిలేసి సంక్లిష్ట మార్గం ఎంచుకొంటున్నామేమో "అని రాశాడు.

గాంధీ అంటే వీరాభిమానం ఉన్న శాస్త్రి ఆయన భావాలకు ఇంతవ్యతిరేకంగా ఎందుకు మారాడు ?అది ఆయన రాజకీయ ఫిలాసఫీ,ఆయన ధైర్యమైన వ్యక్తిత్వం,నిర్దుష్టత ముందు చూపు,మనస్సాక్షి. బర్క్ పండితుని శిష్యుడు కాకపోయినా శాస్త్రి వ్యవస్థ పతనం చెందటం,అరాచకం ప్రబలటం ఇష్టం లేని వాడు. లార్డ్ రోస్ బరి బార్క్ ను గురించి ఏది చెప్పాడో శాస్త్రి విషయమూ అంతే –He loved reforms,. Because he hated revolution. He hated revolution because he loved reform ". శాస్త్రి ఎప్పుడూ రాజ్యాంగ ఆందోళనపై విశ్వాసం ఉన్నవాడు. శాస్త్రి –"గాంధీ సమకాలీనులు ఎంతటి చిల్లర దేవుళ్ళు అయినా,దేశం పట్ల,గాంధీ పట్ల బాధ్యత,విధి విధానం ఉండాల్సిన వాళ్ళు. వాళ్ళు అన్నీ స్పష్టంగా చూడలేరు. సరైన మార్గమేదో,ఎలా ఎప్పుడు ప్రవర్తించాలో నిర్ణయించు కోలేరు. వాళ్లకు ఏది న్యాయం అని అనిపిస్తే అదే చేస్తారు. ఆయన ఉ త్కృష్టమైన మంచి సాధించటానికి,అత్యంతమైన చెడును దేశానికి కలిగిస్తున్నాడేమో?చివరికి వారంతాకలిసి ఆయన్నే వ్యతిరేకించవచ్చు. అప్పుడు ఆయన వారిని కనీసం మందలించ లేడు కూడా "అని రాశాడు శాస్త్రి.

గాంధీజీ జాతీయ విషయాలను తన సత్య శోధన లెక్క ప్రకారమే చేశాడు. శాస్త్రి మాత్రం మరింత నెమ్మదిగా వ్యవస్థలకు భంగం కలగకుండా బాధ్యతాయుతంగా గౌరవప్రదంగా ధైర్యంగా చేయాలన్న భావన ఉన్నవాడు. వ్యక్తికీ దేశానికి మధ్య ఉన్న స్వభావంగా భావించాడు. ఒక వ్యక్తి తన స్వంత విషయాలలో నిర్భయంగా జరిగబోయే పరిణామాలను గుర్తించకుండా ప్రవర్తించ వచ్చు.కానీ దేశ వ్యవహారాల,మొత్తం ప్రజల విషయం లో మాత్రం భయంతో జరగబోయే పరిణామాలను ఆలోచించి ముందడుగు వేయాలి. జాతీయ విషయాలలో తప్పనిసరిగా పిరికి తనం ఉండాలి. కారణం సంఘ శ్రేయస్సుతో అది ముడి పడి ఉంటుంది కనుక. 1926లో "కమలా లెక్చర్స్ "లో శాస్త్రి "రైట్స్ అండ్ డ్యూటీస్ ఆఫ్ ఇండియన్ సిటిజన్స్ "పై ప్రసంగిస్తూ –"మన అత్యుత్తమ మేధావులు విప్లకాత్మక అరాచక శక్తుల విషయం లో వారి విధి విధానం లో తప్పులు చేశారు,విఫలమయ్యారు. ఇప్పుడు మనకున్న వ్యవస్థచట్రం లో లొసుగులు ఉన్నా,భవిష్యత్తులో ఉత్తమ రీతిలో మార్చుకొనే అవకాశమున్నా,ఉన్నదాన్ని విచ్చేదనం చేసుకొంటే,కూల్చిపారేస్తే అ శిదిలాలమీద కొత్త నిర్మాణం చేయగలమా ?అందుకే నేను అలాంటి వినాశకర చట్టన్యాయ వ్యవస్థను కూల్చేసే విచ్చిత్తి చేసే ఉద్యమాలలో పాల్గొనలేదు పాల్గొనను కూడా. విధానం నాశనమైతే విధాన ప్రభుత్వం నాశనమౌతుంది "అన్నాడు.

## నూతన రాజ్యాంగ మండలి

శ్రీనివాస శాస్త్రి మాంటేగ్ –చేమ్స్ ఫర్డ్ సంస్కరణల ఫలితం గా ఆవిర్భవించిన నూతన రాజ్యాంగ మండలి –ది న్యు కౌన్సిల్ ఆఫ్ స్టేట్ కు ఎన్నికయ్యాడు. డ్యూక్ కాఫ్ కన్నాట్ –కౌన్సిల్ ఆఫ్ స్టేట్,ఇండియన్ లెజిస్లేటివ్ అసెంబ్లి అనే

ఉభయ సభల సంయుక్త సమావేశానికి 9-2-1921 నప్రారంబోత్సవం చేశాడు.డ్యూక్ చదివిన ప్రసంగం లోని కొన్ని పేరాలు నిజాయితీగా నిర్దుష్టంగా,ఉన్నత భావ మిశ్రితం గా ఉన్నాయనిపించాయి శాస్త్రికి. ఫిబ్రవరి 12 న కౌన్సిల్ ఆఫ్ స్టేట్ మొదటి సారి సమావేశమైనప్పుడు "డ్యూక్ మాటలు అర్ధవంతంగా ఉన్నాయి. ప్రజలు తమ స్వాతంత్ర్య సిద్ధికోసం ఉన్న ఆకాంక్ష వ్యక్తమైంది. ఆయన అన్న మాటలు మరీమరీ చెప్పుకోతగినవిగా ఉన్నాయి –సాధారణంగా రాజకీయ స్వేచ్చ విప్లవం ద్వారా,లేక అల్లరి గందర గోళం,అంతర్ యుద్ధం ద్వారా ప్రజల ఆస్తులు త్యాగాల వలన పొందుతారు. కానీ ఇక్కడ ఒక తరహా ప్రజలు మరొక తరహా వారి మరింత స్వేచ్చకు స్వాతంత్ర్యానికి,ఆనందానికి కారణమైంది. తరచుగా ప్రజలు ప్రశ్నిస్తూ ఉంటారు. -రక్తపాతం లేకుండా యే దేశమైనా స్వాతంత్ర్యం స్వేచ్చా పొందిందా ?అని. అది జరిగిందో లేదోకానీ మేము అంటే ఇంగ్లాండ్,ఇండియా లు మాత్రం చక్కగా చర్చించుకొని ఇంగ్లాండ్ రాజ్యాంగ వ్యవస్థను అర్ధం చేసుకొని,ఇలాంటి ప్రత్యేకమైన వినూత్నమైన రాజకీయ అభి వృద్ధి సాధించాం. మేము త్వరలోనే స్వాతంత్ర్యం పొందుతాము,అదీ పూర్తీ స్వాతంత్రమే సాధిస్తాం ఎట్లా ?శాంతియుత విధానం వలన. అదే స్ఫూర్తి మనం చూపించి ఈ సభను హుందాగా గౌరవ ప్రదంగా నిర్వహించుకోవటానికి మనం అందరం కలిసి కట్టుగా పని చేద్దాం. "అని డ్యూక్ అన్న మాటలను ఉటంకిస్తూ అతడికి శాస్త్రి ధన్యవాదాలు తెలియజేశాడు.

## కౌన్సిల్ ఆఫ్ స్టేట్ లో తీర్మానం

మొదటి రోజునే కౌన్సిల్ ఆఫ్ స్టేట్ లో శాస్త్రి ఒకతీర్మానం ప్రవేశపెడుతూ,అణచి వేతకు సంబంధించిన సూత్రాలను తొలగించటానికి ఒక కమిటీ వేయామని కోరాడు.. కారణం ఇప్పటికే ఆ సూత్రాల వలన విపరీతమనిన అవమానాలకు బాధలకు గురై గాయపడిన ప్రజల మనసు కొంచెం ఉపశమిస్తుంది అన్నాడు. ఆ అణచి వేత సూత్రాలు మూడు రకాలని,అందులో స్టాట్యూట్ బుక్ లో ఉన్న మొదటి క్లాస్ రాజకీయంగా డేంజర్ అని ఎలాంటి పరిస్థితి లోనూ దాన్ని సహించం అనీ,రెండవ క్లాస్ బహిష్కరణకు సంబందించింది. అది ఆది నుంచి అందరికి కంటగింపుగా ఉండటం తో ప్రజలలో అసంతృప్తి విస్తారంగా ఉంది.ఇవి "A relic on barbarous time "అన్నాడు. కనుక వాటిని వెంటనే అబాలిష్ చేయాలన్నాడు. తర్వాత విద్వేష పూరిత సమావేశానికి సంబంధించిన చట్టం,న్యూస్ పేపర్స్ ఇన్సిట్ మెంట్ టు అఫెంసేస్ యాక్ట్ టు కాన్స్పిరసి ని జాగ్రత్తగా పరిశీలించి అవసరమైన మార్పులు నిపుణుల సలహాలపై చేయాలి. చివరగా సభను,ప్రభుత్వాన్నీ అత్యున్నత స్నేహశీల వాతావరణం తో నడిపించమని కోరాడు. బ్రిటీష ప్రభుత్వం లో రాజ్యాంగ బద్ధమైన స్వేచ్చ అత్యంత ప్రశాంత రాజ్యాంగ బద్ధమైన విధానంతో అనుభవిస్తున్నాము. ఇది ప్రపంచంలో ఎక్కడా లేని అపూర్వ విషయం అన్నాడు.

శాస్త్రి చొరవ,ప్రభుత్వం ఆలోచనలో వచ్చిన మార్పు వలన వైస్రాయ్ ఆయన అనుచరులు ఒక కమిటీ ఏర్పాటు చేసి,దాని సలహాతో శాస్త్రి చెప్పిన మార్పులు చేసి, ఎక్సి క్యూటివ్ చర్యలకు న్యాయ విచారణ ఉండాలని నిర్ణయించి

రౌలట్ చట్టాన్ని కూడా ప్రభుత్వం వెనక్కి తీసుకొన్నది. ఇది శాస్త్రి సాధించిన ప్రజాస్వామ్య విజయం..ఆ కాలం లో శాస్త్రిని "మోస్ట్ బ్రిలియంట్ పార్లమెంటేరియన్ "అని మెచ్చుకొన్నారు. పౌరహక్కుల,స్వేచ్చలకుపోరాటం లో శాస్త్రి "చాంపియన్" అన్నారు. అహంకారం గర్వం మూర్తీభవించిన ఒక యూరోపియన్ చెప్పిన ఆశ్చర్యకర విషయం ఒకటి శాస్త్రి చెప్పాడు. -గుర్రం పై స్వారి చేస్తూ వస్తున్న ఆయన నా గదిలోకి వచ్చి "ఇప్పుడు మేము మీకు మిమ్మల్నినమ్మి సెల్ఫ్ గవర్నమెంట్ ఇచ్చాం.దాని ఫలితంగా మీరు మమ్మల్ని జాతి విభేదాలను వెంటనే రద్దు చేయమనే కోరిక మాకు కానుకగా ఇస్తారా ?.నేను దానికి సరైన సమాధానం చెప్పా. అంతే రెండు నిమిషాల తర్వాత మా ఇద్దరి మధ్యా సుహృద్భావంగా మాటలు జరిగాయి. "

చాలా ప్రతినిధి వర్గాలకు నాయకత్వం వహించి ఇంగ్లాండ్ వెళ్ళాల్సి ఉన్నందున శాస్త్రి కౌన్సిల్ ఆఫ్ స్టేట్ కు తరచుగా దూరం అవాల్సి వచ్చేది. కెన్యా విషయమై పొందిన తీవ్ర నిరాశా బాధ వలన శాస్త్రి ఆరోగ్యం క్షీణించి కౌన్సిల్ సభ్యత్వానికి 1925 లో రాజీనామా చేశాడు. 20-1-1925 న సభ్యులకు లార్డ్ వైస్రాయ్ రీడింగ్ –"లెజిస్లేచర్ లో కూడా కొన్ని అనివార్యమైన మార్పులు తేవాలి. ఉభయసభలు నన్ను మన్నించాలి తన ఆరోగ్యం బాగుండ నందువలన' ఈ సభ ప్రారంభం నుంచి సభ్యుడిగా ఉన్న" 'రైట్ ఆనరబుల్ శ్రీనివాస శాస్త్రి " లెజిస్లేచర్ కు చేసిన రాజీనామా తాత్కాలికమే అనీ,ఆయన ఆరోగ్యం కుదుటపడగానే మళ్ళీ సభలో ప్రవేశించి "Add distinction of his intellectual greatness to the legiislature and to devote his great capacities to public affairs "అని శాస్త్రి సేవలకు కీర్తి కిరీటం పెట్టాడు. అంతేకాకుండా శాస్త్రికి పర్సనల్ లెటర్ కూడా రాసి త్వరగా ఆరోగ్యం పొందాలని కోరాడు లార్డ్. దీనికి శాస్త్రి సమాధానమిస్తూ "నేను ప్రజాసేవనుంచి దాదాపు దూరమయ్యాను. "Beg you to imagine the feelings of a man of simple ways who finds himself suddenly smothered beneath garlands and bouquets of exquisite beauty and fragrance ?".సహజంగా రాజకీయాలు మనుషుల్ని కలపటం కంటే దూరం చేయటం ఎక్కువ. ఒక్కోసారి మనం ఏమిటో మనమే తెలుసుకోలేం.మనకు తెలియనంతగా మనలో పోలికలుంటాయి.The human touch I have experienced at your hands is a revelation of the golden chain that binds us all together,but is so seldom seen"అన్నాడు శాస్త్రి.

## సమావేశాల యుగం

ఇండియన్ రైల్వేలపై ఏర్పాటైన ఆక్వర్త్ కమిటీ సమావేశాలలో పాల్గొనటానికి అందులో మెంబర్ అయిన శ్రీనివాస శాస్త్రి అప్పటికే ఇంగ్లాండ్ లో ఉన్నాడు. 1921లో జరిగిన ఇంపీరియల్ కాంగ్రెస్ కుభారత ప్రతినిధిగా నామినేట్ చేయబడి,కచ్ కు చెందిన మహారావ్ తో అక్కడే ఉన్నాడు. బొంబాయి కి చెందిన పురుషోత్తమ దాస్ ఠాకూర దాస్ అనే దేశభక్తి కలిగిన ఉత్తమ వాణిజ్య వేత్త ఆక్వర్త్ కమిటీలో ముఖ్యసభ్యుడు. రైల్వే మేనేజిమెంట్ జాతీయ ప్రభుత్వ ఆధ్వర్యలోనే నిర్వహింప బడాలని గట్టిగా వాదించాడు. దానికి సంబంధించి అన్ని గణాంకాలతో వివరించాడు. శాస్త్రి ఇంపీరియల్ కాంగ్రెస్ సమావేశాలలో బిజీ గా ఉండటం తో ఈ సదస్సుకు ఎక్కువగా హాజరు కాలేకపోయాడు. శాస్త్రి

ద్వారా దాస్ ఒక లెటర్ ను రైల్వేస్ స్టేట్ మేనేజ్ మెంట్ లోనే ఉండాలని పూర్తీ వివరాలతో సంపాదించి అంద జేశాడు. ఈ ఉత్తరం ఆక్వర్త్ ను బాగా మెప్పించి,సుముఖతను వ్యక్తం అయేట్లు చేసింది. చైర్మన్ కాస్టింగ్ వోట్ తో రైల్వేలు స్టేట్ గవర్నమెంట్ అధీనం లో ఉండేట్లు తీర్మానం జరిగింది.

2-6-1921 న ఇంపీరియల్ కాన్ఫరెన్స్ సభలు ప్రారంభమయ్యాయి. శాస్త్రి మాంటేగ్ ప్రక్కనే కూర్చుని తరచుగా విషయాలు చర్చిస్తూ సూచనలు అందిస్తూ ఉన్నాడు ఈ నోట్స్ అంత తర్వాత శాస్త్రి చేత ప్రచురణ పొందింది. మాంటేగ్ పూర్తిగా భారతీయుల పక్షం వహించి అందరి మన్ననలు పొందాడు. శాస్త్రి సాయాన్నే ఎక్కువగా తీసుకొని భారతీయులకు మేలు చేయగలిగాడు. బ్రిటన్ ప్రైం మినిస్టర్ లాయడ్ జార్జ్ కాన్ఫరెన్స్ ను ప్రారంభిస్తూ ఇంపీరియల్ ప్రభుత్వ ఉన్నతభావాలను ఏకరువు పెడుతుంటే,శాస్త్రి ఆయనకు అడ్డు తగిలి తగ్గు బాలయ్యా అంటూ కట్ చేశాడు. ఇంపీరియల్ కాన్ఫరెన్స్ లో తన మొదటి ప్రసంగాన్ని శాస్త్రి జూన్ 21 న చేస్తూ –"మనముందు చాలా పెద్ద పెద్ద పనులున్నాయి చిల్లర పనులు చెప్పి సమయం వృధా పరచ వద్దు. మన ఉభయుల అభిప్రాయం తో బ్రిటీష సామ్రాజ్యంలో పని చేస్తూ సామ్రాజ్యానికి బయట విషయాలపై సుహృద్భావం చూపుతూ ప్రజలకు ఎక్కువ మేలు కలిగేట్లు చూడాలి. మీ ప్రసంగం ఆకర్షణీయమే కానీ, పనులు జరిగేట్లుగా లేదు. ఇండియా ఇంకా డొమినియన్ కాలేదు. అంటే సార్వ భౌమాదికారం పొందలేదు. నేను,కచ్ మహారావ్ డొమినియన్ ప్రతినిధులం గా అనిపించటం లేదు. ఇక్కడ ప్రైం మినిస్టర్ లు గా ఉన్నాం.. మా ప్రభుత్వాలు మమ్మల్ని నామినేట్ చేసి ఇక్కడికి పంపింది. కనుక మా హోదా లో చాలా తేడాఉంది. కానీ వచ్చే యేడుకానీ ఆతర్వాత కానీ మా వారసులు మాకంటే గౌరవప్రదంగా హక్కులతో హాజరవ్వాలని కోరుతున్నాం..మా వారసులు మాలాగా నామినేట్ కాకుండా,సెంట్రల్ లెజిస్లేచర్ ద్వారా ఎన్నుకోబడి రావాలని మా ఆకాంక్ష. అప్పుడే ప్రతినిధికి గౌరవం.ఇప్పటికి మాకు ఇంకా పూర్తీ డొమినియన్ హోదా ఇవ్వబడ లేదు. కానీ మేము ఆ హోదాను సాధించే రహదారిలోనే ఉన్నామని మనవి చేస్తున్నాను. "అన్నాడు. ఈ కాన్ఫరెన్స్ లో పాల్గొనటం వలన శాస్త్రి బ్రిటన్ లో, కామన్ వెల్త లోని సర్వ శ్రేష్టులను కలిసి వారితో మాట్లాడే అవకాశం దొరికింది. ఇండియా మనోభావాలు వారితో అరమరికలు లేకుండా పంచుకొన్నాడు. ఒక రకంగా వారితో సమాన హోదా తో వ్యవహరించాడు. స్వయం ప్రభుత్వం కాని ఇండియా ప్రభుత్వ ప్రతినిధిగా ఇక్కడ శాస్త్రి పాల్గొన్నప్పటికీ,"He proved him self as effective as any representative of a Dominion could be."

## ఇంపీరియల్ కాన్ఫరెన్స్ లో..

పై సందర్భాన్ని కొడుకు కు శ్రీనివాస శాస్త్రి ఒక ఉత్తరం రాస్తూ –"బ్రిటీష ప్రభుత్వం సర్వ సమర్ధులైన బాల్ఫార్,కర్జన్,చర్చిల్,లాయడ్ జార్జి వంటి ప్రముఖుల చేత నిర్వహిమ్పబడుతూ,ప్రపంచం లోనే అత్యంత విశిష్ట ప్రభుత్వం గా ఉంది. వీరికి సాటి వారెవరు ?స్మట్స్ గౌరవనీయుడు, కొంత వరకు వీరి సరసకు రాగలవాడు. కాని అతడిలో వారికున్న విషయ పరిజ్ఞానం,విశాల దృక్పధం లేవు. వాళ్ళ పాలసీ లపై కొంత వ్యతిరేక

భావనలున్నవాడు. ఆస్ట్రేలియాకు చెందిన హగ్స్ చురుకైన వాడు. చెవుడు ఎక్కువ,మానరిజమ్స్ బాగా ఉన్నవాడు. మొండి వాడు. పోరాట పటిమ ఉన్నవాడు. కెనడాకు చెందిన మీఘెన్ శాంత చిత్తుడైన లాయర్. అతని భావాలు అతనివే. వాటికే కట్టుబడి ఉంటాడు. ఇంప్రెసివ్ గా ఉండడు,గొప్ప వక్త కూడా కాదు కానీ,శీల సంపద ఉన్నవాడు. న్యూజిలాండ్ కు చెందిన మాస్సీ ప్రేమింప తగడుకానీ సూటిగా ప్రవర్తిస్తాడు. పాలనాను భవం బాగా ఉన్న వాడు. బాగా మాట్లాడాలని ప్రయత్నిస్తాడుకానీ మాట్లాడ లేడు. అతడి నిజాయితీభావాలు సామ్రాజ వాదం గా ఉంటాయి. కర్జన్ మాట్లాడే తీరు,సమతుల్యత ఆకర్షణీయం. అతడితో మనం మాట్లాడిన క్షణమే మనల్ని తన ప్రభావం లోకి లాక్కొనే ఆకర్షణ ఉన్న వాడు. అతడి పాలిటిక్స్ నాకు ఇష్టం లేకపోయినా,నన్ను బాగా దగ్గర చేసుకొన్నాడు. మాగురువు గోఖలే పై మంచి మాటలు చెప్పాడు. చర్చిల్ మహా మేధావే. కానీ పనిలో కర్జన్ కు సాటి కాదు. విషయం పై మాట్లాడే టప్పుడు జోవియల్ గా అసలైన మేధావి గా కనిపిస్తాడు. స్థిరత్వం లేనివాడు. గర్విష్టి. కానీ అతడిని వదిలించు కోలేని పరిస్థితి. అంటే అనివార్యమైన వాడు –indispensable.బాల్ఫార్ అతడికి అతడే సాటి. అతడంటే నాకు ఎందుకో మోజు ఏర్పడింది. తక్కువ మాట్లాడుతాడు అప్పుడప్పుడు నిద్రలోకి జారుకొంటాడు. అతడు పెదవి విప్పాదంటే నాగ స్వరానికి నాగుపాముతల ఊపినట్లు అయిపోతాం. పెద్దగా సరుకున్న వాడు కాదు. కాని అతడి విజ్ఞత నిర్ణయం నాకు స్ఫూర్తి దాయకాలు. అందుకే పై వారిలో అతడు సర్వ సమర్ధుడు అని నేను అనుకొంటాను "అని రాశాడు.

ఇంపీరియల్ కాన్ఫరెన్స్ లో శాస్త్రి పాల్గొనటం వలన,అతడి జీవితంలో అనేక సత్ఫలితాలనిచ్చే కాలం గా మారింది.. విదేశాలలో సమాన సిటిజన్ షిప్ పోరాటం ఫలించింది. ఒక రకంగా గోఖలే, గాంధీల మిషన్ లకు ప్రతినిధి అయి ఇండియన్ ల హోదాను విదేశాలలో పెంచాడు శాస్త్రి. ఇంపీరియల్ కాన్ఫరెన్స్ లో ఉండగానే గొప్ప రాజకీయ వేత్త – అంటే స్టేట్స్ మన్ అనిపించుకొన్న దక్షిణ ఆఫ్రికా ప్రధాని జనరల్ స్మట్స్ తో

వివాదానికి దిగాడు. స్మట్స్ మామూలు విరోధి కాదు. మొదటి ప్రపంచ యుద్ధం లో ఇంపీరియల్ ప్రభుత్వానికి విశేషమైన సేవలు అందించి అభిమాన పాత్రుడైన వాడు. లీగ్ ఆఫ్ నేషన్స్-నానారాజ్య సమితి స్థాపనలో ముఖ్య పాత్ర వహించిన వాడు. ప్రపంచ శాంతి సౌభ్రాత్రు త్వాలకు కృషి చేసినవాడు –But this great man had a skeleton in his cupboard –the colour bar in South Africa. over which he had,a decade before,come into conflict with Mahatma Gandhi,and he now came into conflict with Sastri. శాస్త్రి ప్రతిపాదించిన ఇండియాకు సమాన పౌరహక్కుల తీర్మానం పై వ్యతిరేకంగా ఇంతా బయటా తీవ్రంగా మాట్లాడి అడ్డు తగిలాడు.

## ఇంపీరియల్ వార్ కాన్ఫరెన్స్

7-7-1921న శాస్త్రి ఒక తీర్మానం ప్రవేశ పెట్టాడు అందులో విషయాలు –"ఈ సమావేశం 1918 ఇంపీరియల్ వార్ కాన్ఫరెన్స్ తీర్మానాన్ని మళ్ళీ సమర్ధిస్తూ,బ్రిటీష కామన్ వెల్త్ లోని ప్రతి సంఘం తన జనాభాను స్వీయ నియంత్రణలో ఉంచుకొంటూ బ్రిటీష సామ్రాజ్యంతో సమాన హోదా అనుభవించాలి. బ్రిటీష కామన్ వెల్త్ పటిష్టత కు సహకరిస్తూ భారతీయుల పౌరసత్వాన్ని గుర్తించి కాపాడాలి. లండన్ లెటర్ అనే పేరుతొ శాస్త్రి ఇలా రాశాడు -శాస్త్రి " మంచి గౌరవప్రదమైన పబ్లిక్ స్పిరిటేడ్ పర్సనాలిటి తో ఇంపీరియల్ మెంబర్స్ పై గొప్ప ప్రభావం కలిగించాడు. టెక్నికల్ గా ఆయన భారత ప్రభుత్వ ప్రతినిధి అయినా,అంతకంటే చాలా ఎక్కువగా కృషి చేశాడు. ఆయనధైర్యం గా సాహసంగా మాట్లాడాడు. అందులో మృదువైన మర్యాద ఉంది..తన దేశం విషయం లో ఒక భారతీయుడు గా అత్యుత్తమ దేశ భక్తితో ప్రసంగించాడు. -At the conference he created a sensation in all quarters by the energetic and firm exposition that he delivered of the views of India on the question of The Imperial Citizenship and the status and disabilities Indian communities over seas"."

రాజకీయ కార్యక్రమాలలో నిండా మునిగి పనిచేస్తున్నా శ్రీనివాస శాస్త్రి స్నేహితులకు కుటుంబంలోని వారికి సుదీర్ఘమైన,మనోహరమైన ఉత్తరాలు రాస్తూనే ఉన్నాడు. చేకర్స్ నుంచి కుమారుడికి ఉత్తరం రాస్తూం అంతటి పని ఒత్తిడి బాధ్యతలో ఉన్నా తన సాహితీ ఉత్సుకతను దాచుకోకుండా బయటపెట్టాడు. ఒక ఉత్తరం లో శాస్త్రి –దగ్గర్లోనే ఉన్న ఒక గ్రామం మహాకవి మిల్టన్ జన్మ స్థలంగా ప్రసిద్ధికెక్కింది. ఈ ఇంటికి సుమారు మైలు దూరం లో ఒక చిన్న అందమైన చర్చి ఉంది.అది చాలా చక్కని ప్రదేశం.అందులో హాంప్ డన్ పారిషనర్స్ అంటే చర్చికి రోజూ వెళ్ళే భక్తులకు దీర్ఘ ప్రసంగాలతో నౌకాధనం లో అసమానతలు గురించి చెప్పేవాడు అందులో అతడికి రావాల్సిన 13 s,6D గురించి వివరించేవాడు దీనికి సంబంధించిన డాక్యుమెంట్ కూడా అక్కడ ఉంది.ఆ ఇంట్లో ఒకప్పుడు ఆలివర్ క్రాం వెల్ కూతురు ఉండేది. అందులో ఒకగోడలో రక్షకుని పోత పోసిన బొమ్మ ఉన్నట్లు ఇటీవలే కనుగొన్నారు పెద్ద ముక్కు,చాతీ వగైరాలున్నాయి. మార్జన్ యుద్ధభూమిలో అతడు రాసిన లెటర్ కూడా మనం చూడచ్చు. కవి గ్రే ఎలిజీ రాసిన స్టోక్ పోగిస్ కూడా చూడచ్చు. ఇక్కడికి అరగంట మోటార్ ప్రయాణ దూరం లో ఉన్నది. అతడు ఎందుకు రాశాడో మొదట నాకు అర్ధం కాలేదు. హాంప్ డన్లో గుర్తింపు పొందని ప్రతిభగల మూగ మిల్టన్,నిర్దోషి అయిన క్రాం వెల్ ల గొప్పతనాన్ని గుర్తింప జేయటానికే రాసి ఉంటాడని నాకు తర్వాత అర్ధమైంది "

ఇంపీరియల్ కాన్ఫరెన్స్ లో శాస్త్రి అనేక ప్రశంసలు పొంది,ప్రీవీ కౌన్సిల్ మెంబర్ గా గౌరవింప బడ్డాడు. బకింగ్ హాం పాలస్ లో ప్రమాణ స్వీకారోత్సవానికి అతి ఖరీదైనడాబు దర్పం తో ఉండే డ్రస్ అంటే స్టేటస్ చిహ్నం గ ధరించ కుండా ఉండటానికిఆయనకు పర్మిషన్ లభించి మామూలు తలపాగా తో హుందాగా హాజరై చక్రవర్తి నుంచి ప్రీవీ కౌన్సిల్ మెంబర్షిప్ అందుకొన్నాడు. ఇది అరుదైన గౌరవం. "ఫ్రీడం ఆఫ్ సిటి ఆఫ్ లండన్ "గౌరవం కూడా ఆయనకు అంద జేశారు. ఆ సందర్భంగా శాస్త్రి చేసిన ప్రసంగం –క్లాసిక్ గా ఉండి,,ఇండియాలోని ఇంగ్లీష్ పుస్తకాలలో

పార్యాంశం అయింది. ఆయన బ్రిటీష సామ్రాజ్యాన్ని భూ ప్రపంచం లో స్వాతంత్ర్య దేవాలలయాలలో ఉత్తమోత్తమమైనది అన్నాడు. ఆస్వాతంత్రాన్ని దూషించటం అతిక్రమించటం చేయవద్దు అని హెచ్చరించాడు. ఇండియా ను బ్రిటీష సామ్రాజ్యం లో సమాన భాగస్వామి గ గుర్తించి గౌరవించాలనీ,మానవ సేవలో తరించాలని వినయంగా కోరాడు. అప్పటి పరిస్థితులలో సామ్రాజ్య పౌరసత్వం ఊహించరానిదే అయినా,But he saw far ahead into the future and anticipated the day when the Prime Minister of India, Jawaharlal Nehru, would receive the Freedom of the City of London,and proclaim the free partnership of the Common wealth. "ఇదీ శాస్త్రికి ఉన్న దూర దృష్టి.

## లిమిటేషన్ ఆఫ్ ఆర్మ మెంట్స్

ఆ కాలం లో బాల్ఫార్,,బ్రియాండ్,వివాని,సేసిల్,రామ్సే మాక్ డోనాల్డ్ వంటి మహా వక్తలున్నారు. ఫ్రెంచ్ లో బ్రియాండ్, ఇంగ్లిష్ లో శ్రీని వాస శాస్త్రి లీగ్ ఆఫ్ నేషన్స్ లో గొప్ప వక్తలుగా గుర్తింపు పొందారు. 1921 నవంబర్ లో శాస్త్రి బ్రిటీష సామ్రాజ్య ప్రతినిధి గా అమెరికాలోని వాషింగ్ టన్ లో జరిగే "లిమిటేషన్ ఆఫ్ ఆర్మ మెంట్స్" సమావేశానికి హాజరయ్యాడు. ప్రెసిడెంట్ హార్డింగ్ అధ్యక్షతన అమెరికా,బ్రిటన్,ఇటాలీ ఫ్రాన్స్,జపాన్ అగ్రరాజ్యాల సమావేశం అది.. నౌకా యుద్ధ సామగ్రిని తగ్గించుకోవటమే ఈ సమావేశ ముఖ్యోద్దేశం..బ్రిటీష దేశ ప్రతినిధి సెక్రెటరి ఆఫ్ స్టేట్స్ బాల్ఫార్,చార్లెస్ ఎవాన్స్ అమెరికాకు,బ్రియాండ్ ఫ్రెంచ్ కు,ప్రతినిధులు. అమెరికన్లకు అప్పటిదాకా శాస్త్రి ఎవరో తెలియదు. జెనీవా లో మొదటి సారే అయినా ఫినిషింగ్ స్పీచ్ ఇచ్చి శాస్త్రి అందరి దృష్టి ఆకర్షించాడు. బ్రిటీష్ అఫీషియల్ భావాలనే వ్యక్తం చేశాడు,ఇండియా తరఫున సాధికార ప్రతినిధి గా జాతీయ సంస్కృతీ వ్యక్తిత్వాల ప్రదర్శన చూపాడు. ఆమెరికన్ ల పై శాస్త్రి ప్రభావం ఇంతింత అనరానిదిగా మహా ప్రభావం కలిగించాడు. అమెరికన్ కాంగ్రెస్ లో భారత దేశ రాజకీయ పరిస్థితి కళ్ళకు కట్టినట్లు చూపించాడు.

వాషింగ్టన్ నిరాయుధీకరణ సమావేశం విలువైన తక్షణ చర్యలకు నాంది గా ప్రత్యేకతను చరిత్రలో సంతరించు కొన్నది. ప్రెసిడెంట్ హార్డింగ్ సమావేశం ప్రారంభిస్తూ –"నేను అమెరికా తరఫున మాత్రమె సాధికారంగా మాట్లాడుతాను. మా లక్షలాది ప్రజలు యుద్ధం కన్నా,నిరాయుధీ కరణనే మనస్పూర్తిగా వాంఛి స్తున్నారు "అన్నాడు. తర్వాత ఆయన తప్పుకోగా,సెక్రెటరి హగ్స్ సమావేశానికి చైర్మన్ గా నియమింప బడి ఇలా –"ఈ సమావేశం ఒకరికొకరు హితవులు చెప్పుకోవటానికి కాదు కర్తవ్యమ్ వెంటనే అమలు చేయాలని "అన్నాడు. వెంటనే స్పూర్తిదాయకమైన స్టేట్ మెంట్ తో తక్కువ మాటలతో నౌకా యుద్ధ సామగ్రి పై పరిమితులను తెలియ జేయగా,వెంటనే అమెరికా గొప్ప ఉదాహరణగా నిర్ణయం తీసు కొన్నది,బాల్ఫార్ కు రాబోయే ఉపద్రవం గురించి సూచన కూడా చేయలేదు. కానీ ఈ కొత్త దౌత్యం వెంటనే ఫలితాలిచ్చింది. ముందుగా బాల్ఫార్ ఆతర్వాత అందరూ ఒప్పుకున్నారు. జపాన్ మాత్రం ఒక సెంటి మెంటల్ షిప్ విషయం లో తటపటాయించింది..శాస్త్రి నాటకీయంగా చేసిన దౌత్యం అందర్నీ ఆకర్షించింది. ఈ విషయం పై ఆయన ఒక ఉత్తరం రాస్తూ –"వాషింగ్ టన్ సమావేశం కొత్త

దౌత్యం తో శక్తి వంతమైంది. ప్రపంచమంతా యూరోపియన్ చాన్సలరీతో విసిగి వేసారి పోయింది. అందుకే నూతన అంతర్జాతీయ నైతికత ఆవర్భవించింది. బాల్ఫార్,కాటో లు తమ దేశప్రభుత్వాల ఆమోదం తెలియ జేయటం సకల మానవాళి యొక్క బాహ్య ఆనందమే. పాత డిప్లొమసి చచ్చి పోయింది. "Long live the new diplomacy ".అన్నాడు.

ప్రజా విజయం మధ్యలో శాస్త్రికి ఒక దుఃఖ వార్తా షాక్ ఇచ్చింది. శాస్త్రి చిన్నకూతురు సావిత్రి మరణించిన వార్త చేరి, ఆయన్ను కలచి వేసింది. ఆదుఖం లోనే వాషింగ్ టన్ నుంచి వెంటనే పెద్ద కూతురు రుక్మిణికి ఉత్తరం రాస్తూ –"ఇప్పటికే మీరంతా తీవ్ర దిగ్భ్రాంతి లో ఉండి ఉంటారు. ఇప్పుడు నేను ఆబాద అనుభవిస్తున్నాను. ఏమని రాయాలో కాళ్ళూ చేతులూ ఆడటం లేదు మనసు బుద్ధి మోద్దుబారాయి. అమ్మా ఏడవకు. నేను యేడుసుస్తున్నాను చాలు. అమ్మను జాగ్రత్తగా చూసుకోండి. విధి ఆమె పై దారుణంగా దెబ్బతీసింది. నేను మీకోసం కొన్న వాచ్ మొదలైన వాటినిఈపాటికి మీకు పంపించి ఉంటే చూసి సంతోషించేది. ఎంత ఫూలిష్ గా ఆలోచిస్తున్నాను నేను. చెల్లి నా కోసం తపించి నన్ను చూడాలని అనుకొని ఉంటుంది. దైవమా!నేను తట్టుకోలేక పోతున్నాను "అని విలపించాడు.

## డొమినియన్ టూర్

LETTERS TO GOKHALE

DHARMASALA, BENARES[1]
27th December 1905

Dear Sir

Some six months ago I came across a little pamphlet marked *Private* and containing a prospectus of the "Servants of India Society". Since then I have had thoughts of joining it as a member. But I knew you would like before taking me to see me if possible and to make inquiries of trustworthy persons regarding my character. The opportunity has come now and I desire to offer my services. You may ask Madras delegates generally about me; but I would mention in particular Messrs V. Krishnaswami Aiyar and G. A. Natesan, through whose kindness I had the pleasure of being introduced to you at Madras.

I am a schoolmaster in Triplicane with about 17 years' service. I graduated B.A. in 1888 and am now 37 years old. My age, I fear, may be against me, as I may not have many years more to give to the service of my country. Nor have I the confidence that I can do very much in the few years that lie before me. Such as I am, however, I offer myself and hope to be accepted.

I don't write this letter under an impulse of the moment; but the idea has been long in my mind, and it

1 Mr Sastri was a delegate to the Benares session of the Congress, of which Gokhale was president.

R—1

వాషింగ్టన్ నుంచి లండన్ కు తిరిగి వచ్చాక ఇంగ్లాండ్లో మరింత ప్రగతి శీల అభిప్రాయం కూడా ఇండియాకు విరుద్ధంగా నే అవటంలో శ్రీనివాస శాస్త్రి నాన్ కో ఆపరేషన్ ఉద్యమం,వేల్స్ రాజు ను బాయ్ కాట్ చేయటం పై బాగా వ్యధ చెందాడు. ఈ విషయం ముందుగానే ఊహించిన శాస్త్రి అయిదవ జార్జి ని ప్రిన్స్ ఆఫ్ వేల్స్ ను ఇండియా పంపవద్దని సలహా ఇచ్చాడు. 1922మార్చి చివరలో శాస్త్రి ఇండియాకు తిరిగి వచ్చాక దేశం, పైకి మాత్రం శాంతి యుతంగా ఉన్నట్లు కనిపించినా లోలోపల ప్రశాంతత లేనట్లుఉదికిపోతున్నట్లు గుర్తించాడు. ఇలాకాక ఇంకో రకంగా ఉండ లేదు అని తెలుసుకొన్నాడు. మహాత్మా గాంధీ,ఆయనతో పాటు దేశ వ్యాప్తంగా వేలాది ప్రజలు అరెస్ట్ అయ్యారు. ప్రభుత్వ అణగార్పు చర్యలు తీవ్రమైనాయి. లండన్ లో శాస్త్రి కీర్తి

ప్రతిష్టలతో వెలిగిపోయాడు. జెనీవా వాషింగ్టన్ లలో మాత్రం మహోన్నత నాయకుడు ప్రారంభించిన ఉద్యమానికి వ్యతిరేకంగా శాస్త్రి ఉండటంతో ఒక మరుగు దొడ్డి ని చూసినట్లు చూశారు.

7-5-1922 న శాస్త్రి బాంబే ప్రాంతీయ లిబరల్ కాంగ్రెస్ సమావేశానికి అధ్యక్షత వహించాడు. అప్పుడున్న రాజకీయ పరిస్థితి పై ఆయన ఇచ్చిన అధ్యక్షోపన్యాసం తనను బ్రిటీష వారి "సేవకుడు "(minion )అని ముద్ర వేసినా,నిష్కల్మష నాయకుడు మహాత్మా గాంధీని కూడా లెక్క చేయకుండా నిర్మోహ మాటంగా మాట్లాడాడు. ప్రభుత్వం ప్రారంభించిన చట్టం న్యాయం పేరిట చూపిస్తున్న టెర్రరిజం పై నిప్పులు కక్కాడు. ఆయన మాటలలో –"ఇవాళ ఉన్నట్లు గా ప్రభుత్వం అపనమ్మకం తో ఎప్పుడూ లేదు "such absolute lack of faith in their sincerity,such rooted tendency to put aside all their pledges,and promises and declarations of intentions as of no value what ever "అని కడిగిపారేశాడు.సహాయ నిరాకరణ ఉద్యమం చాలా స్థిత చిత్తం తో సమతుల్యంగా నడుస్తోంది అన్నాడు. తన హృదయపు లోతుల్నుంచి మాట్లాడుతూ శాస్త్రి ఆ ఉద్యమం మచ్చ లేని –one whose character is above cavil (వితండవాదం )and whose motives are beyond suspicion "మహాత్మా గాంధీ చేత ఆయన నిర్విరామ పర్యవేక్షణకింద జరుగుతోంది అన్నాడు.మహాత్ముని ఉద్యమాలు అదో జగత్ సహోదరుల ఉద్ధరణకోసం జరిగాయి,జరుగుతున్నాయి జరుగుతాయి కూడా. స్వదేశీ కానీ,అస్పృశ్యతా నివారణ ఉద్యమం కానీ కింది తరగతి జనం అభి వృద్ధి కోసమే చేశాడు మహాత్ముడు. ఆయన ప్రారంభించిన ఉద్యమాలు దేశం లోని మారుమూల ప్రాంతాలకు కూడా వ్యాపించి వేలాది స్త్రీ పురుషులు స్వచ్ఛందంగా పాల్గొంటున్నారు అంటే మహాత్మునిపై ఉన్న భక్తీ విశ్వాసం ఆయన తమ ఉద్ధారకుడు అని భావించటం వల్లనే. స్వరాజ్య ఉద్యమంతో లక్షలాది యువకులను జాగృతం చేసి,దేశ భక్తీ రగుల్కొల్పి జాతీయ ఐక్యతకు పట్టం కట్టాడు. అయితే ఈ ఉద్యమం లో కొన్ని లోపాలు ఏర్పడి సంస్థల,ప్రైవేట్ పబ్లిక్ ఆస్తుల ధ్వంసం, వినాశనానికి దారితీయటం బాధాకరం. క్షంతవ్యం కూడా కాదు.ఇలాంటి విపత్కర పరిస్తితులలో శాంతి భద్రతలను కాపాడటానికి ప్రభుత్వం అణచి వేత విధానం తప్పని సరి పరిస్థితి లో అవలంబించి ఉంటుంది. జాతుల మధ్య,కులాల మధ్య చెలరేగిన చిచ్చు నార్పే ప్రయత్నం చేసింది. ప్రతిచిన్న విషయానికి చిన్నా పెద్దా చదువుకున్నవారు చదువు లేని వారూ ఆదా మగా అందరూ నిరసనలకు దిగటం బాయ్ కాట్ చేయటం,సహాయ నిరాకరణ చేస్తూ రోడ్లమీదకు రావటం,మాబ్ సైకాలజీ ప్రదర్శించటం బాధాకరం. ప్రభుత్వాన్ని దెబ్బ కొట్టాలని,ప్రజలను రక్షించాలని ప్రారంభించిన ఉద్యమం,ప్రజల్ని మరింత లోతుగా బాదిం చేది గా మారిపోయింది "అని నిస్సంకోచంగా సహాయ నిరాకరణ ఉద్యమం పై తన అభి ప్రాయాలను గట్టిగా వినిపించాడు. తర్వాత ప్రభుత్వాన్ని నిలదీస్తూ బాధితుల దుఃఖాలను తగ్గించి త్వరలో శాంతి ని నెలకొల్పాలని,ఉద్యమం లో పాల్గొని జైళ్ళ పాలైన వేలాది మంది భారతీయులను వెంటనే విడుదల చేసి వారి మనసులలో ప్రశాంతత కల్పించాలని కోరాడు. శాస్త్రి మాటలు తీవ్ర వాదుల మాటల్లాగా ఎవరిని సంతృప్తి చెందించలేదు. బ్యూరోక్రాట్స్ పెదవి విరిచారు. కలకత్తా పత్రిక స్టేట్స్ మన్ –"approximate to the political sentiments of those who filled the extreme camp "అని శాస్త్రి బావాలపై స్పందించింది

ఇండియా ప్రభుత్వ ప్రతినిధిగా శాస్త్రిని న్యూజిలాండ్ ఆస్ట్రేలియా కెనడాలకు, ఆయా ప్రభుత్వాలతో చర్చించి ఆయాదేశాల లోని ఇండియన్స్ కు సమాన హోదాలో పౌరసత్వం ఇవ్వటానికి అంగీకరింప చేయటానికి పంపించినప్పుడు,శాస్త్రి కి ఉన్న ప్రజాదరణ భారత ప్రజలపై కానీ ఆంగ్లో-ఇండియన్ ప్రెస్ పై కానీ ప్రభావం చూపలేక పోయింది. 12-5-1922 న ఆయన డొమినియన్ లలో పర్యటనకు బయల్దేరే ముందు వైస్రాయ్ లార్డ్ రిడ్డింగ్ శాస్త్రి గౌరవార్ధం గొప్ప విందు ఇచ్చాడు. శాస్త్రి సామర్ధ్యాన్ని జ్ఞాపకం చేస్తూ ఆయన –'శాస్త్రి సేవలు ఇప్పటికే విశిష్టంగా ఉన్నాయి. ప్రజలచే గుర్తింప బడ్డాయి. అవి చరిత్రలో "important page in history "స్థానం పొందాయి అనిశ్లాఘించి సెక్రెటరి ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా విస్కౌంట్ పీల్ పంపిన సందేశాన్ని చదివి వినిపించాడు. అపుడు శాస్త్రి చేసిన ప్రసంగం చారిత్రాత్మకం. అందులో అసమ్మతిని రూపుమాపి,జాతులమధ్య సామరస్యం సాధిస్తున్న తూర్పు –పడమర మధ్య రాజీ సాధిస్తున్న బ్రిటీష కామన్ వెల్త్ పై తనకున్న సంపూర్ణ విశ్వాసం వివరించాడు. తన గౌరవార్ధం ఇచ్చిన విందుకు ధన్యవాదాలు చెప్పిన తర్వాత అసలు విషయం చెప్పాడు-"we never had such a wreck of hope and faith in the Government of today. I say this in all solemnity "అని ముగించాడు. అక్కడున్న సివిల్ సర్వెంట్స్,ఆంగ్లో –ఇండియన్ ప్రెస్ ఈ వీడ్కోలు విందు ను శాస్త్రి సరిగ్గా వినియోగించుకోలేదు అన్నారు. జీవితం చివరి రోజుల్లో శాస్త్రికూడా "mentioned it with humility and remorse as an un fair lapse of taste on his part "అని బాధ పడ్డాడు.

## ఇంపీరియల్ దూత

శ్రీనివాస శాస్త్రి డొమినియన్ టూర్ కు బయల్దేరి వెళ్ళే ముందు,''ఆయన అప్రతిష్ట "కాంగ్రెస్ వారిలో,భారత ప్రజలలో శిఖరాయమానంగా ఉంది. జవహర్ లాల్ ఆయన్ను "ఇంపీరియల్ దూత "'అన్నాడు. కానీ శాస్త్రి మనసులో హృదయం లో బుద్ధిలో ఇండియన్ విషయాలపై ఆసక్తిలేని హెచ్ ఎల ఎస్ పోలాక్ వంటి వారిని చూసి తాను ఒక బృహత్తర దేశభక్తి యుతమైన విధిని డొమినియన్ లలో స్థిరపడ్డ భారతీయుల గౌరవ ప్రపత్తులను పెంచే ఉద్దేశ్యంతో త్రికరణ శుద్ధిగా చేబట్టిన కార్యక్రమం అని నమ్మాడు. ప్రపంచ దృష్టిలో ఇండియా ప్రతిరూపం ను పైకి ఎత్తి చూపటమే అని భావించాడు. అంటే ఇండియా ప్రతిష్ట పెంచి ప్రపంచ ప్రజలకు అవగాహన కల్పించటమే.

2 LETTERS OF SRINIVASA SASTRI

was for this purpose chiefly that I made up my mind to come here as delegate.

I know how busy you are and shall not expect an early answer. But I request you to make your inquiries while the Madras men are within your call. The result I shall wait for till you have leisure. If you decide to take me, I shall require at least six months' time to settle my affairs, as I have some people depending on me, and my affairs are not particularly prosperous. My Madras address is—Head Master, Hindu High School, Triplicane.

Believe me, Dear Sir, Yours, with love and admiration,

V. S. SRINIVASAN

TRIPLICANE

10th February 1906

My dear Sir

I shall try, as desired by you, to go to Poona in the first week of March to learn the full nature of the step that I propose to take. I know it is a serious step; but I know too that it is not dishonourable. However, you are right in wishing to make sure that I am made aware of all the consequences of my action.

If for some reason you change your plan, please let me know in time.

With loving esteem, Yours truly

V. S. SRINIVASAN

వెళ్ళిన ప్రతి చోటా శాస్త్రికి ఆదర స్వాగతమే లభించింది ఆయన ఉపన్యాస ఝురిలో వారంతా తడిసి ముద్దాయి అభిమానులైపోయారు. ఆస్ట్రేలియాలో శాస్త్రి అత్యంత ఘన విజయం సాధించాడు. ఆస్ట్రేలియా ప్రధాని హగ్స్,శాస్త్రి పర్యటన పూర్తియ్యాక అద్భుతమైన చిరస్మరణీయమైన మాటలు రాస్తూ –"your presence is here has been of itself an education to most of us. ''అంటూ మీ ప్రసంగాలు మీ వ్యక్తిత్వం లతో మన మధ్య ఉన్న పక్షపాతం తెరలు తొలగిపోయాయి. భారత దేశ ప్రతిభ ఏమిటో ఇప్పుడే మీవల్లనే మొదటి సారి మాకు తెలిసింది ఆదేశపు విజ్ఞానం మాకు మీద్వారా అవగతమైంది. మాదేశ ప్రజలకు, పార్లమెంట్లోనూ బయటా కూడా మీ ఉపన్యాసాలతో మాకు జ్ఞానం అందించారు. మీరు రాక పోయి ఉంటే అంతటి మహా అదృష్టాన్ని మేము పొందలేక పోయి ఉండేవాళ్ళం. ఉన్న రాజకీయ పరిమితులలో మీరు 1918,1921 సమావేశాలలో తెచ్చిన తీర్మానాలు ఉత్తమోత్తమమైనవి. మీ దేశం తరఫున మీఅసమాన ప్రతిభను ప్రదర్శించి సత్ఫలితాలు సాధించి చరిత్రలో నిల్చిపోయారు. ఒక వేళ మీరు సాధించాల్సిన వాటిలో ఆలస్యం జరిగితే సహనం మాత్రం కోల్పోవద్దు. you have achieved wonders,and in my opinion removed for all time those prejudices and misunderstandings which formerly prevented the admission of your countrymen resident in Australia to the enjoyment of the full rights of citizenship. ''అని మనస్ఫూర్తిగా పొంగిపోతూ యదార్ధం రాశాడు. ఆస్ట్రేలియా టూర్ సద్యో ఫలితాన్నిచ్చింది శాస్త్రికి. 1925లో ఆస్ట్రేలియా పార్లమెంట్ అక్కడున్న భారత పౌరులకు పూర్తీ పౌరసత్వాన్నిస్తూ చట్టం తెచ్చింది. ఇది అద్భుత విజయం శాస్త్రికి. అయినా శాస్త్రి పై "వైట్ ఆస్ట్రేలియా పాలసి "కి లొంగిపోయాడు అనిముద్ర వేశాడు. కానీ ఇలాంటిదానినే పూర్వం గోఖలే నెహ్రూలు కోరారు అని వాళ్ళు మర్చి పోయారేమో ? శాస్త్రి ఆస్ట్రేలియా పాలసీని ప్రశ్నించలేదు,పోనీ దాన్ని సమ ర్ధించ నూలేదు అంటూ సన్నాయి నొక్కులు నొక్కారు. బ్రిటిష సామ్రాజ్యంలో కామన్ సిటిజన్ షిప్ అంటే సామ్రాజ్యంలో ప్రజలు హాయిగా స్వేచ్చగా తిరగటానికి,ఎక్కడైనా నివసించటానికి ఏ వృత్తి అయినా తన అర్హత ననుసరించి చేయటానికి,తన శక్తి సామర్ధ్యాలు స్వయంగా పెంపొందించు కోవటానికి,ఎక్కడ స్థిర నివాసం ఏర్పరచుకొన్నా చట్ట పరిధిలో పూర్తిగా వికాసం పొందటానికి ఏర్పడిన హక్కు. డొమినియన్ ప్రభుత్వాలు తమప్రజలాభీష్టాన్ని అనుసరించి వారి సంస్కృతీ వికాసాలను పరిరక్షణ చేయటం. దీనిపై స్పందిస్తూ శాస్త్రి –"నా పర్యటనలో వైట్ ఆస్ట్రేలియా పాలిసీ ను చర్చించటం లేదు. 1918 ఇంపీరియల్ వార్ కాన్ఫరెన్స్ లో డొమినియన్ లకోరికలకు గౌరవం ఇవ్వాలని ఇండియాతీర్మానించింది కనుక ఆ విషయమై నేను ప్రశ్నించే అధికారం లేదు "అన్నాడు.

శాస్త్రి పై మరో అభియోగం కూడా ఆయన శత్రువులు తెచ్చారు ఆయన బ్రిటీష ఎంపైర్ ను పొగడ్తలతో ముంచ్చాడుఅని. But what Sastri actually did was to picture the Australians an ideal British Empire with justice,fair play and perfect equality amongst its components which alone would have the moral authority to include India in it. ''శాస్త్రిపై మరో అభియోగం సహాయ నిరాకర ఉద్యమాన్ని తిరస్కరించాడు అని. కానీ ఆఉద్యమ నాయకుడు గాంధీ బహుముఖ ప్రతిభను ఆయన మెచ్చుకొన్నాడు. దానితో గాంధీని అభిమానించే వారు మరింత పెరగటమేకాదు ఆయన ఆరాధకులూపిచ్చపిచ్చగా పెరిగారు.

## న్యుజీలాండ్ పర్యటన

ఆస్ట్రేలియా నుంచి శాస్త్రి న్యుజీలాండ్ వెళ్లాడు. అక్కడ అప్పటికే ఇండియన్ లకు వోటు హక్కు ఇవ్వబడింది కనుక పని తేలికైంది. వృద్ధాప్య పెన్షన్,కొన్ని రకాల ఉద్యాగాలు పొందటం లో చిక్కులు పైన కృషి చేశాడు. ఉద్యోగస్తులు తాత్కాలికంగా న్యూజిలాండ్ లో పర్యటించ టానికి ఉన్న అడ్డంకులతొలగించటం గూర్చి ప్రభుత్వం తో చర్చించాడు. భారత ప్రభుత్వానికి శాస్త్రి తన డొమినియన్ టూర్ పై ఒక నివేదిక ఇస్తూ,వారికి ఒక ప్రొ టెక్టర్ లేక కాన్సులర్ ఆఫీసర్ న్యూజిలాండ్ లో ఏర్పాటు చేయాలని కోరాడు. అలాగే ఫిజి ఐలాండ్స్ విషయంలోనూ జరగాలన్నాడు. అలాచేస్తేఇండియా వాసుల ప్రవేశానికి,ఇమ్మిగ్రేషన్ కు డోమినయ్న్ ప్రభుత్వానికి,ఇండియా ప్రభుత్వానికి మధ్య ఉన్న కష్టాలు తేలికగా తొలగించ వచ్చు అన్నాడు. కెనడాలో శాస్త్రి పని మరీ కష్ట సాధ్యమైంది. 1921 ఇంపీరియల్ కాంగ్రెస్ లో శాస్త్రికి మిత్రుడైన మీఘెన్ కు శాస్త్రి రాక సంతోషాన్ని కల్గించింది. కాని ఆయన రిటైర్ అయన స్థానంలో మెకంజి కింగ్ ప్రైం మినిస్టర్ అయ్యాడు.

శాస్త్రి ఆస్ట్రేలియా న్యూజిలాండ్ ప్రజలను తన ప్రసంగాలతో ఉర్రూత లూగించాడు కానీ,కెనడా లో శాస్త్రికి పబ్లిక్ స్పీచ్ లకు అవకాశం ఇవ్వలేదు. కనుక విధానం మార్చి శాస్త్రి వోటర్లకు సూటిగా విజ్ఞప్తి చేస్తూ,చాలెంజింగ్ ప్రసంగాలు చేస్తూ,అగ్నికణాలు వర్షిస్తూ ఆ రెండు దేశాలలో చేసిన ఉపన్యాసాలకు భిన్నంగా మాట్లాడాడు. మాంట్రియల్ లో రిఫారం క్లబ్ లో మాట్లాడుతూ శాస్త్రి బాహాటంగా,సెంటిమెంట్ దట్టించి –"బ్రిటన్ కానీ మరే డొమినియన్ కానీ ఇండియాను వేధించటం కుదరని పని. వేధించే ప్రయత్నాలను ఇండియా తిప్పి కొడుతుంది. మనం సమాన హోదాగల భాగస్వాములు గా సామ్రాజ్యంలోని మిగిలిన ప్రదేశాలలో లాగా శాంతిగా ఉంటే,.మనం ప్రజలకు ఎన్నో మేళ్ళు చేయగలం..సామ్రాజ్యాన్ని బలపరచగలం..ప్రపంచానికి మనందరి అవసరం ఉందని గుర్తుంచుకోవాలి. మేము యూనియన్ జాక్ సాక్షిగా కాపాడు కొంటూ,దేశ గౌరవంపెంచుతూ మా ఆత్మ గౌరవాన్ని పెంచుకొంటూ, ఆపని చేయటానికి సిద్ధంగా ఉన్నాం. ఇలాచేయలేకపోతే ఆతర్వాత మనం చాలా విచారించాల్సి వస్తుంది. మన రాజకీయ విముక్తిని ఈ గొప్ప రాజకీయసంస్థ కు బయట తెల్చుకొందాం.ఆశావహంగానే శాస్త్రి పర్యటన కెనడాలో ముగిసింది. ప్రైం మినిస్టర్ మెకంజి శాస్త్రికి ఒక ఉత్తరంరాస్తూ –"కొద్దిరోజుల్లోనే మీరు కోరిన విధంగా మా కెనడా పార్లమెంట్ సమావేశమై ఇక్కడి భారతీయులకు డొమినియన్ పార్లమెంటరి వోటు హక్కును అందిస్తుందని సంతోషంగామీకు హామీ ఇస్తున్నాను "అని చెప్పాడు అన్నట్లే -1947లో కెనడాలోని ఇండియన్స్ కు పూర్తీ సిటిజన్ షిప్ లభించింది. ఇప్పటిదాకా శాస్త్రి ఒక్కడే "India's first and till today her greatest ambassador. In his noble bearing, sweet reasonableness,,capacity to understand the other man's point of view,high

intellectual gifts and shining eloquence,he had the makings of an ideal ambassador "కానీ ఇండియా అదృష్టం ఏమిటి అంటే శాస్త్రి మానవ సంబంధ మైన అనేక కౌన్సిల్స్ లో పార్లమెంట్ లలో తన అద్భుత భారతీయ వాణిని వినిపించాడు. శాస్త్రి గురించి సి ఎఫ్ ఆండ్రూస్ "He did more than any other Indian statesman to raise the name of the country in the Dominions and elsewhere ".నిజంగా ఇది ఘనమైన ట్రిబ్యూట్.

## నేషనల్ లిబరల్ ఫెడరేషన్

కెన్యా పోయింది అన్నీ పోయాయి




డొమినియన్ టూర్ తర్వాత శాస్త్రి 24-11-1922 న ఇండియా కు తిరిగి వచ్చాడు. అయన దగ్గర స్నేహితులు కానీ బంధువులు కానీ కొద్దిగా దుఖం కాస్త కన్నీరు చిలికారేకానీ అతడి విఫల టూర్ ను పట్టించుకోలేదు. కాని తన సహజ గంభీర స్పూర్తితో శాస్త్రి మళ్ళీ తన కార్యరంగం లోకి అడుగుపెట్టాడు. ఆ డిసెంబర్ లో నాగపూర్ లో జగిన నేషనల్ లిబరల్ ఫెడరేషన్ సమావేశానికి అధ్యక్షత వహించాడు.. రాజ్యంగ సంస్కరణల విధానంగా భారత సైన్యాన్ని భారతీయం గా పూర్తిగా తీర్చి దిద్దాలని,చేసిన వాగ్దానాలన్నీ ప్రభుత్వం వెంటనే అమలు చేవాలని గట్టిగా వాదించాడు. ముందు పెట్టిన పదేళ్ళ గడువు కంటే ఇవి ముందే నెరవేర్చాలని చెప్పాడు. నాన్ కో ఆపరేషన్,నాన్ వయోలెన్స్ వైపు లిబరల్ పార్టీ ముఖం పెట్టరాదు అన్నాడు. విధి సక్రమంగా చేయకపోతే,అన్యాయంగా ప్రవర్తిస్తే, ఎంత పెద్ద నాయకుడి నైనా ఎంత పెద్ద ఆఫీసర్ నైనా ఎదిరిమ్చాల్సిందే అన్నాడు –"మన ఇంగ్లీష్ సోదరులు దీన్ని స్పష్టంగా అర్ధం చేసుకోవాలి. స్వరాజ్ విషయం ఎంతవరకు వచ్చింది అని రోజూ ప్రశ్నించాలి. స్వీయ ప్రభుత్వం విషయంలో ప్రతి ఆఫీసర్ ను అతడి వంతు కార్యక్రమం ఎంతవరకు జరిగింది అని అడగాలి.మనకోసం,ఇండియా కోసం ఖర్చు పెట్టాల్సిన ప్రతి రూపాయిని రాబట్టాలి. రాకపోతే నిలదీయాలి. బ్రిటీష కామన్ వెల్త్ ఆదర్శాలపై మనం నమ్మకం కలిగి ఉండాలి. అందులోనే మన సమాన హక్కులు హోదా గౌరవం ఉన్నాయని గ్రహించాలి. అవి రాతలు వాగ్దానాలలో కాక వెంటనే కార్య రూపం పొందాలని మనం కోరాలి. మన చర్యలు శాంతియుతంగా రాజ్యాంగ బద్ధంగా ఉండాలి. మనం కోరినవి అన్నీ అత్యంత అవసరమైనవే అనే అభిప్రాయం పైవారిలో సృష్టించాలి. మనం కోరుతున్నది ఆదేశిమ్పబడిన అభి వృద్ధి మాత్రమె – ఆర్డర్డ్ ప్రోగ్రెస్. పబ్లిక్ అఫైర్స్ లో మనం గౌరవ ప్రదమైన రాజీ ని తృణీకరించం. ఉన్న స్థితి నుంచి ఇంకా మంచి స్థితి కి తీసుకు వేల్లెట్లుగా ఆ రాజీ ఉండాలి అంతేకాని ఉన్నదాన్ని అధ్వాన్నం చేసేట్లు ఉండరాదు.

డొమినియన్ టూర్ నుంచి తిరిగి రాగానే శాస్త్రి మెదడులో కెన్యాలోని క్రౌన్ కాలనీలో ఉన్న ఇండియన్ ల స్థితి ఎలా ఉన్నది అనే ఆరాటమే. కెన్యా కాలనీలలో ఇండియన్ల,తెల్ల వాళ్ళ మధ్య సత్సంబంధాలు లేవు. లండన్ లోని పలుకుబడిగల వారంతా నిరాశతో చేతులెత్తేశారుఅని నాగపూర్ సభలో చెప్పాడుకూడా. కెన్యాలో ఇండియన్ సెటిలర్స్ క్రితం శతాబ్ది మధ్యభాగంలోనే తెల్లవారికంటే ముందే స్థిర నివాసాలు ఏర్పరచుకొన్నారు. చర్చిల్ పూర్వం లో "ఈస్ట్ ఆఫ్రికన్ టూర్ "లో చెప్పినట్లు ఇండియన్ సెటిలర్స్ అక్కడ బ్రిటీష కాలని ఏర్పడటానికి చాలా కాలం ముందే అవసరమైన దంతా చేసేశారు. బ్రిటీష వారిని ఆకర్షించి,పారిశ్రామిక గ్రూపులుగా ఏర్పడటానికి ఇండియన్స్ ప్రోత్సహించారు. ఇండియన్ సెటిలర్స్ కొత్తగా వచ్చిన బ్రిటీష సెటిలర్స్ ను జర్మని,హంగేరి లనుంచి మొదటి ప్రపంచ యుద్ధకాలం లో సంరక్షించారు. యుద్ధంలో ఇండియన్లు వేలాదిగా చనిపోయారు. మైనారిటి బ్రిటీష సెటిలర్స్ ఇదంతా మర్చిపోయి వాళ్ళకున్న చొరవ అధికారంతో ఆధిపత్యం సాధించారు. ఇండియన్లు అందువల జాతి దురహంకారానికి తీవ్రంగా గురై బాధ పడుతున్నారు,వ్యాపార వ్యాణిజ్యాలలో తక్కువ రకం పౌరహక్కులతో తీవ్రంగా కలత చెందారు,అవమానం పాలైనారు. క్రమంగా వారిలో స్వాతంత్ర ఇచ్చ తీవ్రమై,హక్కులకోసం బ్రిటీష వారితో సమాన సిటిజెన్ షిప్ కోసం ఉద్యమించారు. భారత ప్రభుత్వం వారిని అన్ని రకాల బలపరచింది. కెన్యా బారతీయులకు రెండు సీట్లు ప్రత్యేక వోతర్లతో ఎన్నుకోనబడేట్లు స్వాగతించింది. దీనితో మండిపోయిన కెన్యా వైట్స్ ఎదిరించి కెన్యాలో ఇండియన్ ఇమ్మిగ్రేషన్ పై ఆంక్షలు విధించాలని నెత్తీ నోరూ కొట్టుకున్నారు. ఇంపీరియల్ కాన్ఫరెన్స్లో సమాన పౌరహక్కులు సూత్ర ప్రాయంగా ఒప్పుకోని ఇప్పుడు ఈరబాస చేస్తున్నారు. జనరల్ స్మట్స్ వ్యతిరేకించినా క్రౌన్ కాలనీల సెక్రెటరి ఆఫ్ స్టేట్ చర్చిల్ శ్రీనివాస శాస్త్రి గట్టి పట్టుదల వలన "ఇక బ్రిటీష సామ్రాజ్యంలో జాతి రంగు విచక్షణ ఉండదు,ప్రతిభ కలవారేవరికీ అడ్డంకులు ఉండవు. ఇంతకంటే గొప్ప మంచి నిర్ణయం మేము చేయలేక పోవచ్చు "అని ప్రకటించారు.

## కెన్యాలోని ఇండియన్ వారి హక్కులు

దురదృష్టవశాత్తు చర్చిల్ మాటమీద నిలబడలేదు. తెల్ల సెటిలర్స్ నాయకుడు బ్రిటన్ కు వ్యతిరేకంగా విప్లవం తెస్తామని బెదిరించాడు. ఈలోపు ఇండియా ఆఫీస్,లండన్ లోని కాలని ఆఫీస్ లమధ్య నిరంతర చర్చలు జరిగి వుడ్-వింటర్ టన్ ఒడంబడిక కుదిరి,ఇండియా సెటిలర్స్ కు అనుకూలంగా కొన్ని విషయాల జరిగాయి. చర్చిల్ పదవిలో ఉండగా పూర్తి పరిష్కారం కుదరలేదు. చర్చిల్ స్థానం లో వచ్చిన డ్యూక్ ఆఫ్ డైవిన్ షిర్,లార్డ్ పీలెలు పై అగ్రిమెంట్ ను తిరస్కరించారు. తర్వాత జరిగిన సంఘటనలు జనరల్ స్మట్స్,చర్చిల్ లకంటే ఇండియన్ సెటిలర్స్ పైన ఎక్కువ సానుభూతిగాఉన్నట్లు తేలింది. దీనిపై ఇండియాలో ఆందోళన పెరిగి,ప్రభుత్వం శ్రీనివాస శాస్త్రి నాయకత్వంలో ఒక ఇండియన్ లేజిస్లేటర్స్ బృందాన్ని పంపి కెన్యాలోని ఇండియన్ లకు సమాన పౌరహక్కులు,ఇరు జాతులమధ్య సమానత్వం సాధించామని పంపింది. ఇక్కడ కూడా శాస్త్రి మొదటి రాయబారిగానే ఉన్నాడు. కెన్యాలోని యూరోపియన్ సెటిలర్స్ నాయకుడు లార్డ్ డేల్మార్ లండన్లోని బ్రిటీష ప్రభుత్వాన్ని,లండన్ రాజకీయ సరిల్స్ ను ప్రభావితం చేశాడు. తూర్పు ఆఫ్రికా నేటివ్ జాతుల అభిరుచులకు తన మద్దతు ఉన్నట్లుగా చెప్పుకొన్నాడు. కెన్యాలోని బ్రిటీష సెటిలర్స్ కు వ్యతిరేకంగా బ్రిటీష ప్రభుత్వం ఏదైనా చేస్తే విప్లవం సృష్టిస్తానని హెచ్చరించాడు. కనుక ఇప్పుడు శాస్త్రి బాగా ప్రభావశీలి,క్రూరమైన ప్రత్యర్థితో తలపడ బోతున్నాడన్నమాట. అంతేకాదు అన్ని హామీలను,జాతులమధ్య న్యాయాన్ని,సరస సంభాషణలను తిరస్కరించే బాగా

పకడ్బందీ వ్యూహంతో ఉన్న బృందంతో తలపడాల్సి వచ్చింది. యూరోపియన్ స్టేట్మెంట్ లో-"డర్బాన్ వెనుక ద్వారాన్ని మూసేసింది,ముంబాసా ముందు తలుపు మూసేస్తుంది ".

లండన్ చేరగానే కెన్యా, ఇండియన్ డెలిగేషన్ లు చర్చలు జరపాలని ఒక ప్రణాళిక తయారు చేశాయి. 22-5-1923న శాస్త్రి జి యే నటేశన్ కు ఒక ఉత్తరం రాస్తూ –"ఈ నెల మూడవ తేదీ ఆగాఖాన్ రిట్జ్ హోటల్ లో ఏర్పరచిన సుదీర్ఘ చర్చలు జరిపి ఒక అగ్రిమేంట్ కు వచ్చాం. 1-ఇండియా ఇమ్మిగ్రేషన్ హక్కుకెన్యా విషయం లో పూర్తి నిబద్ధత ఉన్దిమాకు2-వుడ్ –వింటర్ ఒడంబడికలోని మిగిలిన విషయాలైన విడదీయటం,-హైలాం డ్స్ సమస్య పై మాట్లాడుకోవచ్చు. ఒకే రకమైన అర్హతలతో మా జాతులలో పది శాతం వారికి వోటు హక్కు ఇవ్వాలి,పద కొండు లో మాకు నాలుగు నియోజక వర్గాలు కేటాయించాలి. శాస్త్రి ఎన్నో నిద్రలేని రాత్రులు సంభాషణలతో రాతలతో,ఇంటర్ వ్యులతో మనకు సపోర్ట్ గా అభిప్రాయాన్ని కూడా గట్టటంలో గడిపాడు తన సోదరుడు రామస్వామి శాస్త్రికి ఉత్తరం రాస్తూ శాస్త్రి –"లార్డ్ పీల్,వింటర్ టన్సర, లూయీ కేర్వాలతో సుదీర్ఘ ఇంటర్వ్యూలు జరిపాను. ఏదీ దాచలేదు. నాస్వభావానికి విరుద్ధంగా మరీ కరకుగా –బ్లంట్ గా మాట్లాడా. చాలా సూటిగా వాడిగా వేడిగా మాట్లాడిన సందర్భాలున్నాయి జమ్నాదాస్ చాలా ఆశ్చర్యపోయాడుకూడా. పీల్ మనకు అనుకూలం. అనేకవిందు సమావేశాలు ఏర్పాటు చేసి ప్రభావిత వ్యక్తులతో మాట్లాడే అవకాశం కల్పించాడు "అని తెలిపాడు.

పొలాక్,యాన్డర్సన్ లకు సమస్యలపై గొప్ప అవగాహన ఉన్నది. మన హక్కులపై, మనం పోరాడే న్యాయంపై సానుభూతి ఉంది. ఇండియన్ సమస్యను అర్థవంతంగా పరిష్కరించాలనే తపన ఉన్నది. పొలాక్ కూడా ఉభయ డెలిగేషన్ లపై మంచి ప్రభావం చూపాడు. ఇండియన్ డెలిగేషన్ కు మన కేసు వారికి చెప్పగాలిగామని సంతృప్తి వచ్చింది. తర్వాత బ్రిటిష గవర్నమెంట్ తెచ్చిన రాజీ ఫార్ములాపై తీవ్రంగా ఎదురు దాడి చేశారు. అదిఒప్పుకొంటే మనం పూర్తిగా హక్కుల్ని వదలుకొని లొంగి పోవటమే అవుతుందని గ్రహించారు. వైట్ పేపర్ ప్రకటన లో ఇండియాకు చెందిన మూడు విషయాలలోరెండిటిని తిరస్కరించి మొండి చెయ్యి చూపారు. కామన్ వోటర్ల జాబితా,హైలాన్డ్స్ విషయాలను తిరస్కరించి ఇండియన్ లకు ఈస్ట్ ఆఫ్రికాలో ఇమ్మిగ్రేషన్ మాత్రం ఒప్పుకున్నారు.

## అబోవ్ ఆరిజిన్స్ సంరక్షణ సమితి

శాస్త్రికి కెన్యా సమస్య బ్రిటన్ కు చట్టం విషయం లో అందరూ ఒకరే అన్న నిబద్ధత ఒక యాసిడ్ టెస్ట్ అయింది. బ్రిటిష సామ్రాజ్యం పైనా,ఆదర్శాలను నిలబెట్టటం పై అక్కడి రాజకీయ వేత్తల ఆసక్తిపైనా గొప్ప నమ్మకం ఉంది. కాని తానూ ఓడిపోతున్నానని తెలిసి విపరీతంగా బాధపడ్డాడు. ఆరోగ్యమూ సహకరించటం లేదు. అయినా మొండిధైర్యంతో ఉన్నాడు. 1923 జూన్ 5 న లండన్లో బానిస వ్యతిరేక, అబోవ్ ఆరిజిన్స్ సంరక్షణ సమితి సమావేశం లో మాట్లాడుతూ బ్రిటన్ ను తమ అత్యున్నత ఆదర్శాలను నిలబెట్టుకోవలసినది గా అభ్యర్ధిస్తూ శాస్త్రి - "యుద్ధ సమయంలో మీరు చిన్న జాతులన్నిటి సాయం అర్ధించి పొందారు. స్వాతంత్ర్య జండాను ఎగిరెట్లు చూశారు. ఇచ్చిన వాగ్దానాలను నిలబెట్టుకోమని మనస్పూర్తిగా కోరుతున్నాను. ఆ స్వాతంత్ర్యజండా మీ స్వాతంత్ర్యం కోసమే మాత్రమె కాదు,అది ప్రపంచ దేశాలన్నిటికీ చెందింది అందులో

ముఖ్యంగా లీగ్ ఆఫ్ నేషన్స్ కు అంటే బ్రిటీష కామన్ వెల్త్ అంతటికీ చెందిందని మర్చిపోవద్దు. మీ యూనియన్ జాక్ కు అప్రతిష్ట,అగౌరవం తెచ్చుకో వద్దు. ”అని చాలా వినయంగా చెప్పాడు.

రామ్సే మాక్ డోనాల్డ్ ఆధ్వర్యంలో క్వీన్స్ హాల్ లో జరిగిన భారీ బహిరంగ సభకు జబ్బుతో ఉంటూనే హాజరయ్యాడు శాస్త్రి. కానీ కొన్ని నెలల నిరంతర చర్చల తర్వాతకూడా బాల్డ్విన్ కాబినెట్,ఇండియన్ ల వాడనలన్నితిని లోసి పుచ్చటానికి నిర్ణయం తీసుకొన్నది. శాస్త్రి పెట్టుకొన్న ఆశాలన్నీ అడియాశలయ్యాయి. ఎంతోకాలంగా చాలా ఇష్టమైనవన్నీ ఒక్క దెబ్బతో నాశనమయ్యాయి. అమెరికన్ రిపబ్లిక్ కు జాతుల సమస్య తీర్చటంలో అసాధ్యమైనది,కానీ బ్రిటీష కామన్ వెల్త్ సాధించి ఆదర్శంగా ఉంటుంది అన్న నమ్మకం పూర్తిగా దెబ్బతిన్నదిశాస్త్రి లో,విపరీతమైన నిస్పృహతో పెద్ద గొంతుకతో తన విలాపాన్ని వినిపించాడు “The people of India are no longer equal partners in the British Empire,but un redeemed helots in a Boer Empire’’-అంటే బ్రిటీష సామ్రాజ్యంలో ఇండియన్లు సమాన హోదా కలవారు కాదు. విమోచన చెందని స్పార్టా లోని బానిసలకు,పౌరులకు మధ్య ఉన్న సెర్ఫ్ లమాదిరి బోయెర్ సామ్రాజ్యంలో ఉన్నారు. కోపంతో ఊగిపోతూ అరుస్తూ,’’Kenya lost,every thing lost “అని గర్జిస్తూ హితవు చెప్పాడు. శాస్త్రి చెప్పిన ఆమాటలు సామెత గా నిలిచిపోయాయి చరిత్రలో. రాజకీయ విషయాలలో అయన మధ్యస్థ మార్గం ఒడిదుడుకుల పాలైంది. ఈ విషయాన్ని కూతురుకు 1923ఆగస్ట్ ఒకటవ తేదీ ఉత్తరం రాస్తూ –”ఇక్కడి జరగాని సంఘటనల వల్ల నా దృక్పధమే మారిపోయింది. ఇక్కడ ఉన్నా,ప్రశాంతంగా ఉండలేను. ఇంటికి రావటమే మంచిదనిపిస్తోంది. మన దేశ పరిస్థితి లాగానే నా భవిష్యత్తూ అగమ్య గోచరమైనది “అని బాధ పడ్డాడు. ఆగస్ట్ 17న బనారసీ దాస్ కు రాసిన ఉత్తరంలో –”నా దృక్పధం మారి పోయింది. ఇండియాలోని భవిష్యత్ రాజకీయంలో నాకు స్థానం లేదు “అన్నాడు.

ఆ విపరీతమైన ఒత్తిడి మనస్తాపం లోఉన్నకాలం లో శాస్త్రి డాక్టర్ లసలహామేరకు ఒక నర్సింగ్ హోమ్ లో చేరగా కొంతకాలం పూర్తీ విశ్రాంతిఅవసరమని హితవు చెప్పారు. ఆయన గుండె జబ్బు నిత్య అవమానాలు,, దుఖం,ఆవేశాలవలన బాగా పెరిగింది. కెన్యా పరిష్కారం జాతికి పెద్ద తీరని అవమానంగా భావించాడు. కెన్యా విషయంలో ఆయన మాట్లాడిన మాటలు చెప్పిన అభిప్రాయాలు ఏ ఇతర నాయకుడూ చెప్పనివి చెప్పలేనివి. మండిపోతున్న బాధను తన వాక్చాతుర్యంతో శాస్త్రి –”మానవ జ్ఞాపక శక్తి ఎంత తక్కువది ?శ్రమించి పని చేసిన పనులు పొందిన వాగ్దానాలు,అందుకొన్న ఆశలు ప్రశంసలు అన్నీ బూడిదలో పోసిన పన్నీరయింది. చేసిన ప్రతిజ్ఞలు ఏమయ్యాయి?పూర్తి సమానత్వం,భేషజం లేని భాగస్వామ్యం అన్నీ ఏమైపోయాయి. అవన్నీ రాయల్టీ నుంచి బాధ్యతగల మంత్రుల నుంచి. పత్రికలూ,వేదికల నుంచి వచ్చినవేగా ?మనస్పూర్తిగా గుండె లోతుల్లోంచి వచ్చిన మాటలు వాగ్దానాలేగా. ఇన్ని సమావేశాలు ఇన్ని సార్లపర్యటనలు ఇన్నిన్ని చర్చోప చర్చలు జరిగి, పరిష్కారం కుదురుందని నమ్మకం ఉన్న కాలం లో ఇంత గట్టి దెబ్బ కొట్టారు కెన్యా విషయం లో. రేపు ఇండియాకు మాత్రం ఈ దెబ్బ తగలదు అని నమ్మకమేమిటి ?మోసగించరని గ్యారంటీ ఎక్కడుంది ?’’’’అని బాధపడ్డాడు. తనను మోసం చేయలేదు అనుకొన్నాడు.

జబ్బుతోనే శాస్త్రి ఆగస్ట్ లో ఇండియాకు తిరిగి వచ్చాడు గాయపడిన మనసు గుండె నిండా దుఖం తో. ఆరోగ్యం కుదుట పడటానికి ఒక ఏడాది పట్టింది.

# రాజ్యాంగ ముందస్తు కోసం పోరాటం

యరవాడ జైలు లో నిర్బంధం లో ఉన్న మహాత్మా గాంధీ అకస్మాత్తుగా 21-1-1924నజబ్బు పడ్డాడు. అధికార్లు ససాన్ హాస్పిటల్ కు తరలించారు.ఆయనకు అత్యవసరంగా అపెండి సైటిస్ కు ఆపరేషన్ జరగాలని దగ్గర స్నేహితులు ఉంటే కబురు చేయమని డాక్టర్లు గాంధీ తో చెప్పారు. గాంధీ వెంటనే శ్రీనివాస శాస్త్రి డా.పాథక్,ఎన్ సి కేల్కార్ ల పేర్లు చెప్పాడు.మొదటి ఇద్దరూ సహాయనిరాకరణ ఉద్యమ వ్యతిరేకులే. అదృష్టవశాత్తు శాస్త్రి ఆ సమయంలో పూనాలో ఉండటం తో వెంటనే రాత్రి 9 గంటలకు ఆ హాస్పిటల్కు వెళ్ళాడు. శాస్త్రి తానూ రాసిన "మినిట్స్ ఆఫ్ విజిట్ టు మిస్టర్ గాంధీ "లో తాను ఎలాంటి క్రిటికల్ పరిస్థితిలో ఆయన్ను కలిశాడో రాశాడు. ఇది అ ఆ మర్నాడే ప్రచురింపబడింది. అంతటి బాధలోనూ,అనారోగ్యం లోనూ గాంధీ శాస్త్రి ఆరోగ్యం భార్యా పిల్లల క్షేమ సమాచారాలు,సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ సభ్యులయోగ క్షేమాలు అడిగి తెలుసుకొన్నాడు. తన ఆరోగ్య విషయమై ఎలాంటి ఆందోళన జరిగినా తనకు చెప్పాలనీ,తన ఆరోగ్యం,చికిత్స అధికారుల చేతులలో ఉన్దికనుక వారిపై ఎలాంటి ఫిర్యా దు ఉండరాదని చెప్పాడు. ఒక దీర్ఘ స్టేట్ మెంట్ ను తనకు ఆపరేషన్ చేయబోయే కల్నల్ మాడ్డాక్ ను ఉద్దేశించి డిక్టేట్ చేశాడు. శాస్త్రి పెన్సిల్ లో దీన్ని రాశాడు. వెంటనే ఆపరేషన్ చేసెయ్యమని ఆలస్యం అయితే డాక్టర్ పై లేనిపోని అనుమానాలు వస్తాయని తెలియజేశాడు. దీనిపై సంతకం చేస్తుంటే గాంధీజి చేతులు వణికాయి –"shastri noticed he did not dot'' I'' at the end ".



శాస్త్రి మినిట్స్ లో రాసిన విషయాలు –"ఆపరేషన్ రూం సిద్ధం అయ్యాక,,డాక్టర్లు బయటకు వెళ్ళగా నేనొక్కడినే అక్కడ మహాత్మా తో ఉన్నాను. ఒకటి రెండు మామూలు విషయాలు మాట్లాడాక నేను మహాత్మునితో ఇంకేదైనా ప్రత్యేక విషయం చెప్పాలని మీరు అనుకొంటున్నారా /?'అన్నాను. ఆయన ధోరణి చూస్తె ఏదో చెప్పాలనే ఉన్నట్లు అనిపించింది. నెమ్మదిగా ఆయన ',నా ఆపరేషన్ తర్వాత నా విడుదల విషయమై ఏదైనా ఆందోళన జరిగితే,అది నాకు ఇష్టంకాదు అది ఎంతటి సవ్యమార్గాన నడచినా నేను సహించలేను. సమస్యలపై ప్రభుత్వంతో నాపోరాటం పోరాటమే " తగ్గేదేలా'.. కానీ నిబంధనలు నియమాలు ఉండరాదు. ప్రభుత్వం నన్ను జైలు లో ఇంకా ఉంచాలి అనుకొంటే,నన్ను బయటికి పంపటమే గౌరవదాయకం. నా పద్ధతులు,ప్రవర్తన మంచివే అని భావిస్తే నేను ప్రభుత్వంతో పోరాటం చేస్తే,నాకు ఇంగ్లీష్ వారంటే ప్రేమ వారిలో చాలామంది నాకు స్నేహితులున్నారు. వాళ్ళే నన్ను విడిపిస్తారు. కాని అదిమాత్రం తప్పుడు పద్ధతిలో జరగరాదు. ఏ ఆందోళన అయినా అహింసా విధానంలో క్రమ పద్ధతిలోనే జరగాలి. నేను నా భావాలను సరిగ్గా నీకు వ్యక్తం చేసి ఉండక పోవచ్చు. నువ్వే ని ధోరణిలో శక్తివంతంగా రాయి. నేను అసెంబ్లీలలో మాట్లాడిన తీరు, తెచ్చిన తీర్మానాలు ఒక సారి ఆయన దృష్టికి తెచ్చి,ఆయన అనుచరులకు భారత ప్రజలకు ఇచ్చే సందేశం ఏమైనా ఉందా అని అడిగాను. ఆశ్చర్యంగా ఆయన మొండిగా తనమాట మీదనే ఉన్నారు. తాను జైలు

నిర్బందితుడనని,కనుక తాను తప్పక “prisoners’ code of honour scrupulously “పాటించాల్సిందే అన్నారుమహాత్మా. తాను నాగరికంగా చనిపోయినట్లే –‘అన్నారు -’supposed to be civilly dead’’. బయటి విషయాలు తనకు తెలియవనీ,పబ్లిక్ తో తనకేమీ సంబంధం లేదన్నారు. కనుక పబ్లిక్ కు మెసేజ్ అంటే సందేశం ఇవ్వక్కర్లేదన్నారు. ’’నిన్న మహమ్మదాలి మీరు చెప్పినట్లుగా ఒక సందేశం విడుదల ఎలా చేశాడు??అని అడిగాను. నా నోటినుంచి ఆమాటలు రావటం నాకే సిగ్గు అనిపించింది. అనవసరంగా నోరు జారాను అనిపించింది. కానీ మాటలను వెనక్కి తీసుకోలేముకదా.మహాత్ముడుఒక్కమారుగా నిర్ఘాంతపోయి “మహమ్మదాలి నా ?నానుంచి మేసేజా ?’’అనే సమయంలో నన్ను కాపాడటానికా అన్నట్లు నర్సు కొంత సామగ్రితో రావటం నన్ను బయటకు వెళ్ళమని కళ్ళతో సౌజ్ఞ చేయటం జరిగి,నా నెత్తిన పాలుపోసినట్లయింది. కొన్ని నిమిషాలలో గాంధీని ఆపరేషన్ రూం కు మార్చారు. రూం బయట కూర్చుని మహాత్ముని ఉన్నతభావాలు,క్షమాగుణం,ధైర్య సాహసాలు. దయాసానుభూతి ఒక్కసారి మనసంతా ఆక్రమించి నిజంగానే కారణ జన్ముడు,మహాత్ముడు అనుకొన్నాను. సామాన్య ప్రజలపై ఆయనకు ఎంతటి అనుకంప ఉందొ గౌరవం పై ఎంతటి సున్నితభావం ఉన్నదో తెలిసి అబ్బురపడ్డాను. సహాయ నిరాకరణ ఉద్యమానికి ఇలాంటి సకల గుణాభి రాముడే నాయకత్వానికి అర్హుడు అనుకొన్నాను “అని రాశాడు శాస్త్రి.

## సెల్ఫ్ గవర్నమెంట్

పై సంఘటన వలన శాస్త్రి గాంధీ ల మధ్య ఎంతటి సుహృద్భావం ఉన్నదో తెలుస్తోంది. 1924లో సెల్ఫ్ గవర్నమెంట్ ల ఏర్పాటును త్వరితం చేసేందుకు అన్నిపార్టీల సహకారం కోసం ప్రయత్నం జరిగింది. అపెండి సైటిస్ ఆపరేషన్ జరిగి కోలుకున్నాక గాంధీ విడుదలయ్యాడు జైలు నుంచి. సహాయ నిరాకరణ ఉద్యమం లో జరిగిన దారుణ హింసాత్మక సంఘటనలు విని మహాత్ముడు చలించిపోయాడు. తాను పరీక్ష పెట్టుకొని,శుద్ధి పొందటానికి ప్రయత్నించాడు అనుచరులూ అలానే చేశారు. బీద జనోద్ధరణకోసం,దేశాభి వృద్ధికోసం నిర్మాణాత్మక విధానమే సరైనదని నిశ్చయించి ఆ మార్గంలో ప్రజలని నడిపించే ప్రయత్నం చేశాడు. చరఖాతో నూలు తీయటం. ఖద్దరు ధరించటం బోధించాడు. ఇవి పల్లెప్రజల వృత్తులకు,సంక్షేమానికి ప్రోత్సాహకరం అని ఉద్బోధించాడు..కల్లు దుకాణాలు మూసేయ్యాలనీ, అస్పృశ్యత పాటించరాదని ఉద్బోధించాడు.

కాంగ్రెస్ లో ఒక కొత్త పరిణామం ఏర్పడింది. మొదటినుంచి కుడిపక్షంలో ఉంటూ కౌన్సిల్ల ఏర్పాటు ను బాయ్కాట్ చేయాలన్న చిత్తరంజన్ దాస్,మోతీలాల్ తో కలిసి స్వరాజ్య పార్టీ పెట్టాడు. సహాయ నిరాకరణ సమర్ధించిన వారికి మార్పు ఉండరాదు –నో ఛేంజ్ అనే వారికి మధ్య వివాదం ఏర్పడింది. ఇరువైపుల వారూ గాంధీపై పూర్తీ అపేక్షతోనే ఉన్నారు. గాంధీ మాత్రం స్వరాజ్య పార్టీ వాళ్లకు వాళ్ళ దారిలో వారిని వెళ్ళమన్నాడు. సెంట్రల్ అసెంబ్లీకి వీళ్ళు మోతీలాల్ నాయకత్వంలో ఎక్కువ సంఖ్యలో ఎన్నికయ్యారు. విఠల్ భాయ్ పటేల్ ను అ సెంబ్లీ ప్రెసిడెంట్ గా ఎన్ను కొని మొదటి ఘన విజయం సాధించారు. శాసన సభలను కూల్చటానికే ఏర్పాటైన వీరు,ప్రభుత్వం చక్కని చాకచక్యం చూపిస్తే,సహకారులుగా,రాజ్యాంగ బద్ధంగా దేశ పురోభి వృద్ధికి తోడ్పడేవారు.అసెంబ్లీలో కాలుపెట్టిన మొదటి రోజే మోతీలాల్ “ఇప్పటిదాకా చేయలేకపోయిన

దాన్ని ఇప్పుడు చేయవచ్చు అని వచ్చాం. అవకాశమిస్తే మీసహకారం మాకు ఉంటే మీకు సహకరిస్తాం మేమంతా బయట నాన్ కో ఆపరేటర్స్ గా ఉన్న వాళ్ళమే "అన్నాడు.

స్వరాజ్య పార్టీ వారు అధిక సంఖ్యలో అసెంబ్లీకి ఎన్నికవటం శాస్త్రికి చాలా సంతోషం కలిగించింది. మధ్య పరగణాలు బేరార్ లలో అధిక సీట్లు పొందినా,వాళ్ళు అధికారం కోరుకోకపోవటం ఆశ్చర్యం కలిగించింది. మోతీలాల్ మోకాలు అడ్డేప్రయత్నాలకు శాస్త్రి చీదరించుకొన్నాడు. దీనికి బదులు దేశాభి వృద్ధికి,ఐశ్వర్యాభి వృద్ధికి అతడి తెలివి తేటలు ఉపయోగిస్తే బాగుంటుంది అన్నాడు. 1923ఫిబ్రావరిలో అనిబిసెంట్ ఆధ్వర్యంలో జరిగిన జాతీయ సభకు ఒక సందేశం పంపిస్తూ శాస్త్రి –"ప్రభుత్వాన్ని ఒక్క క్షణమైనా బలహీనపరచితే,అడ్డుకొంటే,ప్రభుత్వ యంత్రాంగాన్ని స్వరాజ్యం పొందేదాకా కదలనివ్వకపోతే ఆతర్వాత మనం ఎలుగెత్తి ఏద్వాల్సి రావచ్చు "అంటూ –"జాతీయ విద్యావిధానాన్ని అక్షరాలా సాధిస్తూ,పారిశుధ్యాన్ని అలవర్చుతూ,దేశీయ పరిశ్రమలు స్థాపించి ప్రజలకు ఉపాధి కలుగజేస్తూ కార్యక్రమాలు నిర్వహిస్తే సత్ఫలితాలు వస్తాయి. అప్పుడే అసలైన రాజాకీయ స్వరాజ్యం సిద్ధిస్తుంది అన్నాడు శాస్త్రి.



స్వరాజ్య పార్టీ వారు బ్రిటీష ప్రభుత్వానికి జాతీయ డిమాండ్ ను అందజేయటానికి సిద్ధమౌతుంటే శాస్త్రి ఒప్పుకోని న్యు ఢిల్లీలో 3-2-1924 నఎన్నికైనకేంద్ర,రాష్ట్రాల శాసన సభ్యుల సమావేశానికి శాస్త్రి హాజరయ్యాడు. ఈ సభ రాజకీయ,ఆర్ధిక,విదేశీ,రక్షణ మొదలైన వాటితో సహా పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వం వెంటనే ఏర్పాటు చేయాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది. బ్రిటన్ లో లేబర్ పార్టీ అధికారం లోకి రావటం వారికి మనదేశంపై పూర్తిసానుభూతి ఉందని భావించటం వలన తమ డిమాండ్ తప్పక సఫలమౌతుంది నమ్మారు. లేబర్ ప్రభుత్వానికి మన సహాయ సహకారాలు అందించాలని శాస్త్రి చెప్పాడు. రాజ్యాంగ త్వరిత దశలో ఉన్నాం కనుక ఇప్పుడు డిఫెన్స్ పొలిటికల్ ఫారిన్ అఫైర్స్ విషయాలు డిమాండ్ లో ఉండటం మంచిది కాదన్నాడు. ఆయన మాట ఎవరూ వినలేదు, పట్టించుకో లేదు. దీనితో పాటు ప్రభుత్వం కూడా ఒక పెద్ద తప్పు చేసింది. హోమ్ మెంబర్ అయిన మాల్కం హయిలీ అసెంబ్లి లో ఒక స్టేట్ మెంట్ ఇస్తూ మాంట్ ఫర్డ్ రిఫారమ్స్ ప్రకారం రేస్పాన్సిబిల్ గవర్నమెంట్ అంటే డొమినియన్ స్టేటస్ కాదు "అన్నాడు. శాస్త్రి. ఉన్న సమస్యలే జటిలం అవుతుంటే ఇది మూలిగే నక్కపై తాటిపండు పడినట్లై,జాతీయ సమైక్యతా ప్రయత్నాలు విఫలమయ్యాయని బాధ పడ్డాడు.

## డొమినియన్ హోమ్ రూల్

1924 ఏప్రిల్ లో సబర్మతిలో ఏర్పాటు చేసిన ఆల్ పార్టీ మీటింగ్ కు శ్రీనివాస శాస్త్రి వెళ్ళలేదు. తన భావాలను ఒక స్టేట్మెంట్ రూపంగా సరోజిని నాయుడికి పంపాడు. ఉన్న పరి స్థితులదృష్ట్యా తాను మళ్ళీ కాంగ్రెస్ లో చేరే అవకాశం లేదని,కౌన్సిల్ లో,ఆఫీసు లలో కాంగ్రెస్ చేరే విషయమై,సహాయ నిరాకరణ విషయమై కాంగ్రెస్ కు సరైన దృక్పధం లేదు అన్నాడు. చివరగా –"శాంతిని కోరే నేను కాంగ్రెస్ లో చేరటం కుదరదు. అనవసరంగా నిరవధికంగా కార్యక్రమాలు చేబట్టటం నాకు నచ్చదు "అన్నాడు. గోఖలే లాగా విఫలం తర్వాత విజయం కోసం మళ్ళీ ప్రయత్నించటం శాస్త్రి లక్షణం.రాజకీయ ప్రతినిధిగా బిసెంట్ తోపాటు శాస్త్రి 1924 ఏప్రిల్ లో ఇంగ్లాండ్ వెళ్లాడు. రాజ్యాంగ త్వరితం పై అక్కడ వారితో చర్చించటం ఒప్పించటమే లక్ష్యం.ఒక స్నేహితుడికి ఉత్తరం రాస్తూ శాస్త్రి –"ఇప్పుడు నేను యే ఉత్సాహం లేకుండా వెడుతున్నా.కొద్దిపని మిగిలింది ఎవరికీ తెలుసు మేము లండన్ వెళ్ళే లోపు అక్కడి ప్రభుత్వం కుప్పకూలుతుందేమో ?బలహీనమైన ప్రభుత్వమే అయినా,ఏమీచేయలేక మన కాళ్ళూ చేతులకు అడ్డం పెడుతోంది.

మే 10 నుంచి జులై 31వరకు శాస్త్రి లండన్ లో ఉన్నాడు. ఆరోగ్యం అంతగా సహకరించకపోయినా,తీవ్ర కృషి చేస్తూనే ఉన్నాడు. బిసెంట్ మరియు ఇతర సభ్యులతోకలిసి ఇండియాఆఫీస్ లో ఇండియాకు "డొమినియన్ హోమ్ రూల్ "ఇవ్వాలని డిమాండ్ చేస్తూ మెమొరాండం సమర్పించాడు. మేడం తోకలిసి అనేక చోట్ల వరుస ప్రసంగాలు చేశాడు తమ డిమాండ్ విషయమై. కాని లేబర్ ప్రభుత్వం మార్పు లేని వైఖరి చూసి అశోపహతుడయ్యాడు. 22-5-1924 న ఒక ఉత్తరం రాస్తూ "ఇక్కడి పరిస్థితులను చూస్తె ప్రభుత్వానికి ఇండియాపై గొప్ప ప్రణాళిక ఏమీ ఉన్నట్లు కనిపించాటం లేదు. ఉన్న కష్టాలను ఏదోరకంగా అధిగమించాలని అనుకొంటోంది. "అన్నాడు. మే 28 న బ్రిటీష ఆక్సిలరి ఏర్పాటు చేసిన అతిపెద్ద సమావేశంలో శాస్త్రి ప్రసంగిస్తూ "లీ కమీషన్ "ఐ.ఎ. ఎస్. ఆఫీసర్ లకు జీతాలు విపరీతంగా పెంచి ఆడంబర సౌకర్యాలు కల్పించటానికి సిఫార్స్ చేయటం పై మండి పడుతూ దాన్ని "లీలూట్ "అంటే లీ గారి లూటీ అని తీవ్రంగా ఆక్షేపించాడు. దీనిపై స్పందిస్తూ జాషువా వెడ్జ్ వుడ్ ఈ సారి శాస్త్రి వెళ్ళే ప్రదేశం లో దేశద్రోహ నేరం పై అరెస్ట్ కాబడే" మొదటి ప్రీవీ కౌన్సిల్ మెంబర్ అవుతాడు" అన్నాడు. జూన్ 25 న శాస్త్రి క్వీన్స్ హాల్ లో సమావేశమైన విస్తృత ప్రజలనుద్దేశించి తీవ్రస్వరంతో డొమినియన్ సెల్ఫ్ గవర్న్ మెంట్ గురించి పది నిమిషాలు మాత్రమె మాట్లాడాడు.

తీవ్ర అనారోగ్యంతో శాస్త్రి ఆగస్ట్ చివర్లో ఇండియా తిరిగి వచ్చాడు. దేశంలో పరిస్థితి ఆశాజనకం గా లేదని పించింది. దేశంలోతరచుగా జరుగుతున్న హిందూ –ముస్లిం దాడులకు కలత చెంది మహాత్మా గాంధి 21 రోజుల నిరాహార దీక్ష ఢిల్లీ లో పూనాడు. సామరస్య సంఘ సమావేశం అక్కడే జరిగి నాయకులంతా పరస్పరం అవగాహనతో స్పర్ధలు లేకుండా ఉంటామన్నారు. ఇలాంటి ప్రతిజ్ఞలు హామీలు తాత్కాలికమే కాని నిలిచేవికావు అని శాస్త్రి గట్టి నమ్మకం. తన అభిప్రాయాలను" సర్వెంట్ ఆఫ్ ఇండియా" పత్రికలో శాస్త్రి –"రామ,భీష్మ ప్రతిజ్ఞ లాగా కట్టుబడక ప్రశాంత పరిస్థితి టో ఆలోచించండి. దీక్ష విరమించండి ప్రజలలో సామరస్యం శాంతి నెలకొల్పండి. ఒకజాతీయనాయకుడు తీసుకొన్న కఠోర నిర్ణయం వలన,అనుకొన్న కాలం లో పరిస్థితులు చక్క బడవు. "అన్నాడు 1925లో ఆపత్రికలోనే శాస్త్రి చాలా వ్యాసాలూ రాశాడు. దేశంలోని బ్రిటీష వారు మహోన్నత వ్యక్తిత్వమున్న మహాత్మా గాంధీ శాంతి యుత సహకార జీవన విధానాన్ని అర్ధం చేసుకొని మత సంఘర్షణలు నివారించమని రెచ్చగొట్టవద్దని కోరాడు. రాజకీయ నాయకులను సాంఘిక విషయాలలో తల దూర్చి సమస్యలను జటిలం చేయకండి అని కోరాడు. స్వరాజ్యం ప్రజా సంక్షేమం సాధించటానికి కావలసింది –"కో

ఆపరేషన్ మాత్రమె,నాన్ కో ఆపరేషన్ కాదు "అని తీవ్రంగా చెప్పాడు. "మనం ఇవాళ చాలా నిరాశతో ఉన్నాం. అవిధేయత డైరెక్ట్ యాక్షన్ లపై ఉంది మన దృష్టి అంతా దాని ఫలితమే ఈ నిరాశ. వీటివలన విధానాలు విచ్చినమౌతున్నాయి,గందర గోళం పెరిగిపోయింది,అవమానాల పాలౌతున్నాం. వీటిఫలితమే తుపాకి వెనక్కి తిరిగి పేలినట్లు –రికాయిల్ ఆఫ్ ది గన్ మనం ఏర్పరచుకో బోయే హోమ్ రూల్ పై తీవ్రప్రభావం చూపి ప్రజల కడగళ్ళు విపరీతమౌతాయి. మనం ఏమీ చేయలేని నిస్సహాయ స్థితి లోకి జారిపోతాం అని గుర్తించండి "అని జాతిని హెచ్చరించాడు శాస్త్రి.

## బెంగాల్ ఆర్డినన్సు

సంస్కరణలు అమలు చేయండి అణచి వెతకాదు అని శాస్త్రి అనేక సార్లు ప్రభుత్వానికి మొరపెట్టాడుశాస్త్రి.. బెంగాల్ లో దౌర్జన్యకాండ పెరిగి బెంగాల్ గవర్నర్ లార్డ్ లిట్టన్ సలహాతో గవర్నర్ బెంగాల్ ఆర్డినెనేన్స్ తెస్తే వైస్రాయ్ వెంటనే ఆమోదించె శాడు. ఇది రౌలట్ చట్టానికి కొనసాగింపే. శాస్త్రి దీన్ని రౌలట్ చట్టం కంటే మరీ దారుణం అన్నాడు. బిసెంట్ దీన్ని సమర్ధించ గా ఆమెనుకలవటానికి మనసొప్పక రెండు లెటర్స్ రాశాడు నవంబర్ 1924లో. ఆమె వైఖరిని ఖండించాడు. బెంగాల్ పై ఆమె వైఖరి,ఆమె చేస్తున్న రాజకీయ ఐక్యత కు విఘాతం కలిగిస్తుందని నొక్కి చెప్పాడు. దీనితో శాస్త్రి ఆమె మార్గాన్ని వదిలి బిన్నమార్గం లో ప్రవేశించాల్సి వచ్చింది. దీనికి కాంగ్రెస్ వారి నుంచి గొప్ప ప్రశంసలు పొందాడు. కాంగ్రెస్ నాయకుడు సత్యమూర్తి శాస్త్రికి ఒక ఉత్తరం రాస్తూ-"హృదయపూర్వక అభినందనలు. మనసులో ఉన్నది చక్కగా మొహమాటం లేకుండా చెప్పావు. నువ్వు కాంగ్రెస్ లో చేరితే మేమంతా సంతోషిస్తాం. కారణాలు నేను నీకు చెప్పక్కర లేదు నీకు అన్నీ తెలుసు. నిన్ను కాంగ్రెస్ కోరుతోంది అని మాత్రమె చెప్పగలను. ఒంటి బుజం పై కాడి మోస్తూ నువ్వు న్యాయం విజయం సాధించలేవు "అన్నాడు.




1923లో తన కుమార్తె కమలా ముఖర్జీ ఆకస్మిక మరణం జరిగాక ఆశుతోష్ ముఖర్జీ,కలకత్తా యూని వర్సిటిలో కమలాముఖర్జి స్మారక ఉపన్యాసాలు ఏర్పాటు చేసి శాస్త్రి ప్రసంగించమని కోరాడు ఆరోగ్యం సహకరించక పోయినా శ్రమపడి తయారయ్యాడు. మొదటిప్రసంగం బిసెంట్ కు తర్వాత శాస్త్రికి అవకాశం. కాని శాస్త్రిని ఆహ్వానించటానికి ముందే ఆశుతోష్ కూడా అకస్మాత్తుగా చనిపోయాడు. ఆయన కొడుకులద్వారా మరణ వార్త అందుకొన్న శాస్త్రి ఆయనపై ఉన్న అత్యంత గౌరవంతో డాక్టర్లు వద్దని వారిస్తున్నా వెళ్ళాడు. 23-2-1926నుండి వరుసగా నాలుగు రోజులు శాస్త్రి ప్రసంగించాడు. ఈవిషయం కూతురుకు రాస్తూ శాస్త్రి – "గంటంబావు నేను నిలబడి కమల మీద ఉచ్చైస్వరంతో మాట్లాడగలిగాను నిన్న. ఉపన్యాసం మొదటి పదినిమిషాల్లో చాతీలో నొప్పి ప్రారంభమై పూర్తీ అయ్యేదాకా ఉండి పోయింది. తర్వాత సెనేట్ హౌస్ లోఉన్న పక్క రూం లో విశ్రాంతి తీసుకొన్నాను. తర్వాత నన్ను కుర్చీలో నా కారు దగ్గరకు తీసుకు వెళ్లారు "అని రాశాడు.

నీలరతన్ సర్కార్,దా బిసి రే శాస్త్రిని నిరంతరం వెన్నంటి ఉన్నారు ఆరోగ్యవిషయంలో. శాస్త్రికి ఏదో ప్రమాదం జరిగిందని అందరూ వణికి పోతున్నారు భయంతో. ఏవోకొన్ని కొటేషన్లు,ముఖ్య విషయాలు తప్ప ఆయన ప్రసంగ పాఠం ఏర్పాటు చేసుకోలేదు. ఆయన ఎక్కువ సేపు మాట్లాడటం వలన వచ్చిన బాధ అది. అయన నాలుగు ప్రసంగాలు మరీఅరీ చదివి ఆనందిన్చాల్సినవి మనసులో భద్ర పరచుకోవాల్సిన విలువైన విషయాలవి. ఆయనమాటలలో కొన్ని ఆణిముత్యాలు – ”rights flow from duties.. every citizen to be well instructed in his rights and to be well prepared for defending them. ’’law breakers గురించి మాట్లాడులో “లా బ్రేకర్స్ కంటే లాను పాటించే వారే దేశంలో తక్కువమంది మీకంటే ఉన్నారు అని అనుకొంటే తప్పు. వాళ్ళు “will use your precedent and make the extreme medicine of the constitution its daily bread “అని హెచ్చరించాడు.

## దక్షిణాఫ్రికా

కమలాముఖర్జీ స్మారక ప్రసంగాలపై కలకత్తాలోని గార్డియన్ పత్రిక –”శాస్త్రి ప్రసంగాలను అత్యంత శ్రద్ధతో జనం విన్నారు. కారణం –”Rarely does the opportunity come to most of us to listen to utterance of so mature a mind,,so generous,a lover of youth,so qualified a man of public affairs who looms large whichever the stage,whether academic,or political or social whether Indian or Imperial or International shining –not through any adventitious

Aid or pose,but by the breadth of his knowledge of the world,by the scrupulosity of his fairness to foes and friends,and by matchless poise of his judgement “.కలకత్తా విశ్వవిద్యాలయం చేత గౌరవిమ్పబడి,గవర్నమెంట్ హౌస్ కు ఆహ్వానిమ్పబడి,కార్పోరేషన్ చే సన్మానం పొంది,విధ్యుక్త ధర్మం పై తనకున్న అచ్చ స్వచమైన ఆరాధన చూపాడు. అది మంచి రిపోర్ట్ అయినా,చెడుదైనా తను తన దేశానికి అసలైన నిజాయితీ గల సేవకుడు అని రుజువు చేశాడు “అని రాసింది. ఇవే ప్రసంగాలు మళ్ళీ మద్రాస్ యూని వర్సిటిలో 15-3-1926 నుంచి అత్యంత ఆసక్తి,శ్రద్ధ ఉన్న ప్రేక్షకుల మధ్య చేశాడు శాస్త్రి. మద్రాస్ యూని వర్సిటి పరమానందం పొంది ఆయనకు బంగారు పళ్ళెం బహూకరించింది. యూని వర్సిటి హాల్ లో శాస్త్రి తైల వర్ణ చిత్రాన్ని నెలకొల్పింది గౌరవ సూచకంగా. శ్రీనివాస శాస్త్రి పేరిట లెక్చర్స్ నిర్వహించింది.

దక్షిణాఫ్రికా

గోఖలే,గాంధీలపనిని వారి తరఫున దక్షిణాఫ్రికా లో నిర్వహించాల్సిన బాధ్యత శాస్త్రిపై పడింది. గోఖలే వారసుడుగా ఇండియాలో ప్రజల సాంఘిక, నైతిక,ఆర్ధిక ఆసరా ను సంపాదించిన శాస్త్రికార్యరంగం ఇప్పుడు దక్షిణాఫ్రికా కు మారింది. 1913 డిసెంబర్ లో శాస్త్రి లార్డ్ హార్డిన్జ్ కు ఇచ్చిన మద్రాస్ మహాసభ విన్నపం చదివి,అప్పుడు ఆనాటి వైస్రాయ్ మంచితనంతో

సానుభూతితో ;;సౌతాఫ్రికాలోని మాతోటి వారు అనుభవిస్తున్న బాధలకు సానుకూలంగా స్పందించాడు. 1919లో లార్డ్ చేమ్స్ ఫోర్డ్ శాస్త్రిని సర్ బెంజమిన్ రాబర్ట్ సన్ తో లంజ కమిషన్ ముందు ఇండియన్ కేస్ ఎంతవరకు వచ్చిందో తెలుసు కోవటానికి పంపాలనుకొన్నాడు. ఈ కమిషన్ ను జనరల్ స్మట్స్ నియమించాడు. శాస్త్రి ప్రతినిధి వర్గం రావటానికి స్మట్స్ అనేక అడ్డంకులు కల్పించాడు. సౌతాఫ్రికా గవర్నర్ జనరల్ లార్డ్ బక్స్ స్టన్ తో బెంజమిన్ తో పాటు సమాన స్థాయి శాస్త్రికి కల్పించ వద్దని చెప్పాడు. ఈ విషయాన్ని అతడు చేమ్స్ ఫీల్డ్ కు చెప్పాడు. దీన్ని ఒక వార్నింగ్ గా భావించారు శాస్త్రిపట్ల. కనుక శాస్త్రి అన్నీ ఆలోచించి ఆ డెలిగేషన్ లో తాను పాల్గొనటం వివేకమైన చర్యాకాదనుకొని కారణంగా –"for one who was to plead for the equality of his countrymen with other subjects of His Majesty to begin by admitting his inferiority "అన్నాడు,శాస్త్రి నిర్ణయం ఇండియన్స్ బాగా వ్యతిరేకించగా,దక్షిణాఫ్రికా ఇండియన్లు బాగా నిరుత్సాహ పడ్డారు. ఈ విషయాలన్నీ సీక్రెట్ కేబుల్స్ ద్వారా జరిగినందువలన శాస్త్రి వీటిని బహిర్గతం చేయలేదు.



1923 లో జరిగిన ఇంపీరియల్ కాన్ఫరెన్స్ లో స్మట్స్,తన వైఖరిని మరింత బిగించి,మరికొంచెం ముందుకు వెళ్లి బ్రిటీష సామ్రాజ్యంలో సమాన పౌరసత్వమే ఉండ రాదు అన్నాడు. ఇంతటితో ఆగక జనరల్ హోదాలో శత్రువుల సరిహద్దులపై యుద్ధానికి బయల్దేరుతూ –"శాస్త్రి ఇక్కడికి వచ్చి తన రాతలతో మాటలతో వాతావరణం చెడగొట్టాడు. అతడికిచ్చిన ఏ అవకాశాన్నీ సౌతాఫ్రికాలోని ఇండియన్లకు న్యాయం కల్గిన్చాతానికి వదులుకోడు.చాలా సున్నితంమైన సమస్యను డొమినియన్ లో చిచ్చు రేపాడు. లేనిపోని తగాదాలు సృష్టించాడు ఇక్కడికి వచ్చి. గోటిలో పోయే దానికి గొడ్డలి దాకా తెచ్చాడు. ఈ చిచ్చు స్థానికంగా అన్ని చోట్లా మండుతోంది. దీన్ని నేను ముందే గమనించి శాస్త్రిని దక్షిణాఫ్రికాకు ఆహ్వానించలేదు "అన్నాడు. క్రమక్రమంగా ఇండియా వ్యతిరేకత దక్షిణాఫ్రికాలో పెరుగులోంది. వర్తకం భూముల పైనా ఆంక్షలు ఎక్కువయ్యాయి. 1924లో జాతులమధ్య వైరం తీవ్రం చేసే క్లాస్ ఏరియాస్ అండ్ రిజర్వేషన్ బిల్ ప్రవేశపెట్టబడింది. ఈ బిల్ ప్రవేశ పెట్టటానికి ముందు సౌతాఫ్రికన్ పార్టీ జనరల్ స్మట్స్ నాయకత్వంలోని ప్రభుత్వం రాజీనామా చేయాలి బిల్ పాస్ కావాలంటే. దురదృష్ట వశాత్తు జనరల్ హీర్జాగ్ నేతృత్వంలోని నేషనలిస్ట్ పార్టి ప్రభుత్వం ఆ బిల్లు నే ప్రవేశ పెట్టింది. బిల్లును ప్రవేశపెడుతూ ఇంటీ రియల్ మినిస్టర్ డా.మలాన్ –"ఈ దేశం లో ఇండియన్ జాతి ఈ దేశజనానీకం లో పరాయి జాతి. ఇండియన్ జనాభా బాగా తగ్గిపోయే దాకా ఈ సమస్యకు ఎలాంటి పరిష్కారం అంగీకరించము "అన్నాడు. అంటే ఇండియన్ ల పై పిడుగు పడ్డట్టే. ఆశలు అడియాసలు అయినట్లే.

ఈ సంకట స్థితి లోనుంచి బయట పడటానికి ఇండియా ప్రభుత్వం మళ్ళీ చర్చల విధానం ప్రారంభించి మిస్టర్ పాడిసన్ ఆధ్వర్యంలో ఒక ప్రతినిదివర్గాన్ని దక్షిణాఫ్రికాలో పరిస్థితిపై ఫస్ట్ హాండ్ ఇన్ఫర్మేషన్ పొందటానికి పంపింది. ఇది జరగేలోపే,సౌతాఫ్రికా ఇండియన్ కాంగ్రెస్ ప్రతినిధి వర్గం ఇండియా వచ్చి,ఇక్కడ ప్రభుత్వ,ప్రజల సహాయం కోరింది. పాడిసన్ ప్రతినిధి వర్గం వెళ్ళాక మళ్ళీ సౌతాఫ్రికా పార్లమెంటరి ప్రతినిధి వర్గం ఇండియా వచ్చింది. ఈ బృందాల చర్చోపచర్చల వలన

సౌతాఫ్రికా యూనియన్ ప్రభుత్వం తాము ప్రవేశ పెట్టిన బిల్లుపై ముందుకు వెళ్ళమని,పెండింగ్ లో బిల్లును పెట్టి ఉంచుతామని,ఇండియా ప్రభుత్వంతో,ప్రతినిధులతో సంపూర్ణంగా చర్చిస్తామని తెలియ జేసింది. ఇలా ఆబిల్లు తాత్కాలికంగా అటకెక్కి ఇండియన్లకు కొంత ఊరట కలిగించింది.

## సౌతాఫ్రికాకు ఇండియన్ డెలిగేషన్

ఇలాంటి పరిస్థితులలో సౌతాఫ్రికాకు ఇండియన్ డెలిగేషన్ సర్ మహమ్మద్ అబ్దుల్లా నాయకత్వంలో,ఫిరోజ్ సేత్నా,సర్ డి.ఆర్ సి లిండ్సే,జార్జ్ పాడిసాన్,రైటానరబుల్ శ్రీనివాసశాస్త్రి సభ్యులుగా,జిఎస్ బాజ్ పాయి సెక్రేటరిగా వెళ్ళింది. శాస్త్రి సర్వ సమర్ధతను గుర్తించి ఆయన తప్పక ఉండాలని పంపింది. శాస్త్రి చాల వినయంగా హబిబుల్లాకు ఐ సి ఎస్. కేడర్ బ్రిటిష మెంబర్ ను అపాయింట్ చేయమని కోరగా,కార్బెట్ ను వేసుకొన్నాడు. ఇంతమంది ఉన్నా శాస్త్రి కున్న ప్రాముఖ్యత ఆయనదే.. సౌతాఫ్రికా డెలిగేషన్ లో హెర్ట్ జాగ కమీషన్ లోని వారే ఉన్నారు. ఇంటీరియర్ మినిస్టర్ మలాన్ డెలిగేషన్ ఛైర్మన్. 1927ఫిబ్రవరిలో పరిష్కారానికి నిబంధనలు కేప్ టౌన్ లో జరిగిన రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ లో కుదిరాయి. ఇందులో పాశ్చాత్య జీవన విధానం కొనసాగాలి. సౌతాఫ్రికాలోని ఇండియన్లు పడమర స్టాండర్డ్ లకు ఇష్టపడితే అవలంబించ వచ్చు. ఇండియన్ సెటిలర్స్ ఉన్నతికి కొన్ని ప్రోగ్రాములు అమలు చేయాలి.. వీరు అక్కడ ఏ వర్గం వారికన్నా వెనక బడి ఉండరాదు. ఇమ్మిగ్రేషన్ బిల్ ను ఉపసంహరించాలి. ఏజెంట్ జనరల్ ఆఫ్ ధి ఇండియా గవర్నమెంట్ ను రెండు ప్రభుత్వాల మధ్య సహకారం కోసం నియమించాలి. ఈ కేప్ టౌన్ అగ్రిమెంట్ ఒక చారిత్రాత్మక విజయం రెండు ప్రభుత్వాలకు. దక్షిణాఫ్రికా ఇండియన్ లు చాలా సంతోషిస్తారని శాస్త్రి ముందే ఊహించాడు. వీడ్కోలు సమావేశంలో శాస్త్రి "మేము కేప్ టౌన్ ను ఎంతో సంతోషంతో సంతృప్తి తో వదిలి వెడుతున్నాం. ఇక్కడి ఇండియన్లు చక్కగా దీన్ని అమలు పరిస్తే భవిష్యత్తు పూర్తీ ఆశావహంగా ఉంటుంది "అన్నాడు డర్బాన్ లో –"ఇండియా సౌతాఫ్రికాల మధ్య అనుబంధం పై ఒక నూతన యుగం ఆవిష్కారమౌతోంది. యూనియన్ గవర్నమెంట్ believe in and adhere to the principle that it is the duty of every civilized government to devise ways and means and take all possible steps for the uplifting of every section of their permanent population to the full extent of their opportunity and accept the views that,in provisions of educational and other facilities the considerable number of Indians who will remain part of the permanent population should not be allowed to lag behind other sections of the people " అంటూ ఒక దార్శనికునిలా శాస్త్రి మాట్లాడాడు.



భారత ప్రభుత్వం తరఫున మొదటి ఏజెంట్ జనరల్ ను సౌతాఫ్రికా లో నియమించటానికి శాస్త్రి పేరునే అందరూ ఏకగ్రీవంగా బలపరచారు. సి ఎఫ్ ఆండ్రూస్ చెప్పినట్లు "Saintly man,who more than any other,by his work of healing and reconciliation made the Cape Town agreement possible "జనరల్ హీర్త్ జాగ్, డా మలాన్లు కూడా సర్వ సమర్ధుడు శాస్త్రి ఏ అని

ఆహ్వానించారు. సౌతాఫ్రికా ఇండియన్లు ఆయన రాకకోసం ప్రార్ధనలు చేశారు. వైస్ రాయ్ కూడా శాస్త్రి వైపే మొగ్గాడు. గాంధీ శాస్త్రి మాత్రమే అంతటి బాధ్యత నిర్వహించగలడు అని అభిప్రాయ పడ్డాడు. 1927ఏప్రిల్ ఆరున శాస్త్రికి ఒక లేఖ పంపుతూ గాంధీ –"జబ్బు తో ఉన్న మనిషి రాస్తున్న లేఖ ఇది. నిన్ను బెంగుళూరు లో చూడాలని,నా దావా పై పట్టుపడ తావని ఆశ పడ్డాను. కాని అది జరగలేదుఇప్పటికీ. నువ్వు సౌతాఫ్రికాకు వెళ్ళకపోతే అక్కడి ఇండియన్ల హృదయాలు క్షోభిస్తాయి. వైస్రాయ్ ఇర్విన్ ఉన్నంతవరకు ఆటంకాలు ఉండవు ఆయనకు నువ్వు బాగా తెలుసు. నువ్వు మళ్ళీ ఆలోచించి ఒక్క ఏడాది అక్కడ ఉండాల్సి వచ్చినా తప్పకుండా వెళ్ళు ఇది అందరి అభిమతహం '.నువ్వు మాత్రమె ఆ ఒప్పందాన్ని సర్వ సమర్ధంగా ప్రారంభించి పూర్తీ చేయగలవు. "అని రాశాడు ఈ ఉత్తరం శాస్త్రికి వెయ్యేనుగుల బలం వచ్చినట్లయి వెళ్ళ టానికి అంగీకరించాడు.

## కేప్ టౌన్ అగ్రిమెంట్

అట్టహాసంగా జరిగిన వీడ్కోలు సభల తర్వాత శాస్త్రి బొంబాయి కి 1927జూన్ ఎనిమిది చేరి,దేలగోవా బే 27చేరాడు. మూడు వారాల ప్రయాణంలో తన మిషన్ విషయమై కూలంకషంగా మూలాలకు వెళ్లి ఆలోచించాడు. ఇండియా కు తిరిగి వచ్చాక ఎంపిక చేయబడిన కొందరి సమక్షంలో శాస్త్రి –"సముద్ర ప్రయాణం ఎంతో లోతుగా ఆలోచించటానికి బాగా తోడ్పడటం ఆశ్చర్యంగా ఉంది."అని చెప్పాడు. చర్చల సరళి ఎలా ఉండాలన్న దానిపై చాలా మననం చేశాడు. ప్రేమనిచ్చి ప్రేమ పొందాలనుకొన్నాడు. తన వ్యక్తిత్వం తన మిషన్ కు అడ్డు రాకూడదు అనుకొన్నాడు. భారత రాయబారిగా తన తీరు తెన్నులు ఉంటూ అందరి సహకారం పొందాలి. ఓపిక ప్రశాంతత తోనే కార్యసాధన కావాలి –"do not return an angry word for an angry word,try to see the better side of things and while "అన్నట్లు కార్యసాధకుడుగా తానూ ఉండాలని భావించాడు . భ ర్తృహరి చెప్పినట్లు అవతలివారి తప్పులను మర్చిపోయి,దాన్నిగురించి ఎప్పుడూ మాట్లాడకుండా,తనగురించి వ్యతిరేకంగా చెప్పినా సరే సంయమనం తో వర్తించాలి అనుకొన్నాడు. ఇవన్నీ శాస్త్రిలో ఉన్న సహజ లక్షణాలే. వీటిని మరింతగా ప్రస్ఫుటంగా ప్రదర్శించి భారతీయ పురాతన నాగరకత ను ప్రదర్శించి కార్య సాధకుడవాలి అని నిశ్చయించుకొన్నాడు.

దక్షిణాఫ్రికాలో జాతుల మధ్య పక్షపాతం పాతుకు పోయింది. కేప్ ప్రావిన్స్ ను సేసిల్ రోడ్స్ పాలసి ప్రకారం పాలిమ్పబడుతోంది. భారతీయులకు పెద్దగా ఇబ్బందులు లేవు.ట్రాన్స్ వాల్ లో తెల్లజాతి గర్వం రాజ్యమేలుతోంది,నల్లజాతి పై తీవ్రమైన చులకన భావం ఉండటంతో ఇండియన్లు విపరీతంగా బాధలు అనుభవిస్తున్నారు. ఇక్కడ నల్లజాతి వారు ఫుట్ పాత్ లపై నడిచే హక్కు లేదు,ట్రాములలో ఎక్కరాదు.పోస్టాఫీస్ లలో తెల్లవారికి నల్లవారికి వేర్వేరు కౌంటర్లు ఉంటాయి. గోల్డ్ లా,టౌన్ షిప్ లా అనుసరించి ఇండియన్లకు భూమి హక్కులేదు. గోల్డ్ ఏరియాలో నివసించే హక్కు కూడా లేదు. నటాల్ లో ఇంత దారుణంగా లేదు పరిస్థితి. చిన్నదే అయినా ఆ రాష్ట్రంలో ఇండియన్ జనాభా బాగా ఎక్కువే. 1870లోనే ఇక్కడికి ఇండియన్లు లేబర్ గా పని చేయటానికి ఇండియానుంచి మొట్టమొదటగా వచ్చారు. వారు వచ్చేనాటికి నటాల్ అంతా అడవి. కీకారణ్యం,చిత్తడి నేల మలేరియా ప్రాంతం..ఇక్కడికే బానిసలుగా వచ్చి దీన్ని బృందావనం చేశారు ఇండియన్స్. ఇక్కడిఇండియన్లు భూములు

కొనుక్కున్నారు యజమానులయ్యారు. కొందరు చాల భూమిని కొని హక్కుదారులయ్యారు. కానీ ఇండియన్ లకు ఇక్కడి రైళ్ళలో ట్రాములలో ప్రయాణించే హక్కు లేదు. ఇది చట్టంలో లేకపోయినా ఆచరణలో అమలుగా ఉంది. పిల్లలకు విద్య సంస్థలలో అసమానత ఉంది.




ఇన్ని వైరుధ్యాలున్న సౌతాఫ్రికాలో,కేప్ టౌన్ అగ్రిమెంట్ ఒక్కటే ఆశావహంగా కనిపించింది శ్రీనివాస శాస్త్రికి. కొత్త డిప్లమసితో చాకచక్యంతో సమస్యలకు ఆశావహమైన ఫలితాలు సాధించాలని నిర్ణయించుకొన్నాడు శాస్త్రి. ఆదిలోనే హంసపాదు అన్నట్లు శాస్త్రికి అక్కడ వెళ్ళగానే హోటల్స్ లో వసతి సౌకర్యం లభించలేదు.. కొద్దికాలం లోనే ఆయన ప్రతిభ వ్యక్తిత్వాలవల్ల ఈ ఇబ్బంది తీరిపోయింది. ప్రిటోరియాలో మొదట ప్రసంగిస్తూ శాస్త్రి –"అగ్రిమెంట్ ఒక మంచి రాజీ అని "అది మన రాజకీయ అభివృద్ధికి ఆత్మ లాంటిది" అన్నాడు. భారతీయులను సత్యమార్గంలో నడవమని,విశ్వాసంతో ప్రవర్తించమని కోరాడు. జోహాన్స్ బర్గ్ లో మేయర్ ఇచ్చిన విందు సమావేశంలో దక్షిణాఫ్రికాలోని యూరోపియన్లు తమ సోదర ఇండియన్ లపై ఆత్మ సాక్షిగా,మనస్సాక్షిగా ప్రవర్తిన్చేట్లు మారాలని కోరాడు. ఈ భావం దక్షిణాఫ్రికా డొమినియన్ లో అంతటా వ్యాపించెట్లు చేయటంలో వాళ్ళకున్న ఇబ్బందులు తనకు తెలుసు అన్నాడు. నటాల్ విట్నెస్ పేపర్ లో –"we plead for forbearance and charity,even where we do not command friendship and co operation "అని రాశాడు. డర్బన్ లో విశేష జన సమూహం లో మాట్లాడుతూ తానూ నూటికి నూరుశాతం ఒప్పందానికి కట్టుబడి ఉండటానికే వచ్చాను అని హామీ ఇచ్చాడు. దీనితర్వాత చాలా చోట్ల ప్రసంగించమని ఆయనపై వత్తిడి తెచ్చారు అక్కడి వాళ్ళు. ఎందరో స్నేహితుల్ని సంపాదించుకొన్నాడు. గవర్నర్ జనరల్ ఆఫ్ ఎత్లోన్,ప్రధాని హెర్ట్ జాగ్ హాఫ్మేయర్,మలాన్ లు ఈ స్నేహితులలో ముఖ్యులు. జడ్జీలు బిషప్పులు ఎడిటర్లు రచయితలూ,పౌరులు అందారూ ఆయనకు అత్యంత సన్నిహితులయ్యారు He became a beloved and honoured patriarch ".

సింహ సద్రుశుడు శాస్త్రి ప్రతిరోజా అనెకసమస్యల ను పరిష్కరించాడు. ఎక్కడ మాట్లాడినా "Up lift clause of the Cape Town agreement,'' అనే మాటను హైలైట్ చేసేవాడు. ఆయన ప్రాధమిక దృష్టి అంతా విద్యమీదనే కేంద్రీకరించాడు. నటాల్ లో దారుణంగా ఉన్న విద్యా వ్యవస్థలో లోపాలను గుర్తించి సరి చేయటానికి యూనియన్ ప్రభుత్వం ఒక ఎంక్వైరీ కమిషన్ ను ఏర్పాటు చేసింది. దాన్ని తిరస్కరించింది నటాల్ అడ్మిణి స్ట్రేషన్.. శాస్త్రి డా మలాన్ కలవటానికి వెళ్ళినప్పుడు ఆయన నిస్సహాయత ప్రకటించాడు. శాస్త్రిని ప్రసంగాలతో విషయాలను ప్రజా దృష్టికి తీసుకు వెళ్ళమని,ఇండియన్ వ్యతిరేకుల మనసుమార్చే ప్రయత్నం చేయమని కోరాడు. శాస్త్రి వెంటనే గవర్నర్ జనరల్ ఎరల్ ఆఫ్ ఎత్లోన్ నుకలిసి మాట్లాడగా ఆయన చాలా సహాయకారిగా మాట్లాడాడు. ఒక విందు ఏర్పాటు చేసి నటాల్ అడ్మిని స్ట్రేటర్, జార్జ్ ప్లోమాన్ నుకూడా ఆహ్వానించాడు. విందు అయ్యాక ఈముగ్గురు ఇండియన్ సమస్యపై కూర్చుని మాట్లాడుకొన్నారు.

ప్లోమాన్ సేవలను మెచ్చుకొంటూ గవర్నర్ జనరల్ ఎడ్యుకేషన్ కమిషన్ ఏర్పాటు చెప్పాడు. మిగిలిన పనిని శాస్త్రిని చెయ్యమన్నాడు. ఆశ్చర్యకరంగా అతడు కమిషన్ వేయటానికి సిద్ధపడ్డాడు. మధ్యలో కొన్ని అవాంతరాలు వచ్చినా 22-9-1927 న శాస్త్రి పుట్టిన రోజు కానుకగా ఎడ్యుకేషన్ కమిషన్ ప్రకటించబడింది. కాని అందులో ఉన్న సభ్యులను ప్రకటించగానే నిరాశ పడ్డారు. విద్యా వేత్తలైన డాక్టర్ కిచ్లు,మిస్ గార్డాన్ అందులో మెంబర్స్ గా నియమించినదుకు కొంచెం ఉపశమనం కలిగింది. వీళ్ళిద్దరూ తీవ్ర కృషి చేసి అన్ని విషయాలు సాకల్యంగా తెలుసుకొని ఇండియన్ లకోసం నటాల్ అడ్మినిస్ట్రేషన్ చేసింది శూన్యం అని తేల్చి చెప్పారు. పైగా ఇండియన్ ఎడ్యుకేషన్ కోసం కేటాయించిన సబ్సిడి డబ్బును యూరోపియన్ ఎడ్యుకేషన్ కు మరలించారని ఎత్తి చూపించారు.

## శాస్త్రి కాలేజ్

**ఆ కమిషన్ తుది నిర్ణయం –ఇండియన్లకు విద్యమీద ప్రభుత్వం ఇచ్చేసబ్సిడీ అంతా ఇండియన్లకే ఉపయోగించాలి. దీని అమలు వలన నటాల్ ఇండియన్ల విద్యా వ్యాప్తి అతి వేగంగా జరిగింది. ఇండియన్ల స్వీయ సహాయం బాగా పెరగాలి అని భావించి వారిని 20 వేలపౌన్ల డబ్బును విరాళంగా అందించి ఒక కాలేజి, హాస్టల్ స్థాపించమని కోరాడు. దీనికి విశేష స్పందనలభించింది. కాని స్థల విషయంలో ఇబ్బంది లెదురైనా శాస్త్రి వ్యక్తిత్వ ప్రతిభతోఅదీ అనుకూలించి, మెట్రోపాలిటన్ ఆఫ్ ఇండియా అయిన ఫోస్సి వెస్ట్ కాట్ టూర్ వెళ్ళబోతూ శాస్త్రి పూనుకోన్నది మహత్తరకార్యం అనీ,దానికి మాటలలో అభినందిన్చాటానికి ఇంగ్లీష్ డిక్షనరీలో మాటలు దొరకలేదని,దర్బాన్ రిజిష్ట్రార్ నుకాని గుమాస్తాను కాని శాస్త్రి స్వయంగా కలిసి మాట్లాడితే స్థలం వెంటనే కేటాయింపు జరుగుతుందని సలహా చెప్పాడు,''I have been completely Sastricised "అని మహదానందాన్ని ప్రకటించాడు. 24-8-1928 న నటాల్ అడ్మినిస్ట్రేటర్ సర్ జార్జి ప్లోమాన్ "శాస్త్రి కాలేజ్'కి శంకుస్థాపన చేశాడు. ఈ ఫంక్షన్ కు యూరోపియన్లుకూడా బహుళ సంఖ్యలో హాజరవటం విశేషం. వచ్చిన వారిలో పెద్ద హోదా ఉన్న వారు ఉండటం మరీ విశేషం. కాలేజి నిర్మాణం 1929 లో అనుకొన్నట్లుగా పూర్తీ అయి శాస్త్రి ఇండియాకు వెళ్లినతర్వాత గవర్నర్ జనరల్ ఎరల్ ఆఫ్ ఆల్త్ లోన్ ప్రారంభోత్సవం చేశాడు. ఇది అద్భుత విజయం శాస్త్రికి. ఇండియన్లు కూడా తమ అభివృద్ధికోసం విద్యా వ్యాప్తికోసం కృషి చేయటం శాస్త్రి సాధించిన ప్రగతి.**



**అక్కడ అక్షరాస్యత ఇండియన్ లలో పెరగటానికి,విద్యాభి వృద్ధికి,పారిశుధ్యానికి,స్త్రీల ఉన్నతికి శాస్త్రి అవిరళ కృషి చేశాడు. సోషల్ సర్వీస్ లీగ్,చైల్డ్ వెల్ఫేర్ అసోసియేషన్ లను స్థాపించాడు. అనునిత్యం మరింత పరిశుభ్రతకు జీవన స్థితి మెరుగు దలకు కృషి చేయమని కోరేవాడు. మన దేశంలోని సంపన్నులను అక్కడ స్కూల్స్ హాస్పిటల్స్**

నిర్మాణాలకు,అక్కడి సోదర పేదల సంక్షేమానికి ముందుకు రావాలని ప్రోత్సహించాడు. శాస్త్రి ఎప్పుడూ మన కున్న ఆసక్తులను పరిరక్షించాలని తపన చెందాడు. అక్కడి వారు వాలుగా ఉన్న అగ్నిపర్వతం పై నివసిస్తున్నారనే ఎప్పుడు అది జాతి విద్వేషాన్ని వెలిగ్రక్కుతుందో మనవారి అస్తిత్వాలను కూల్చేస్తుందో తెలియదని,కనుక అనుక్షణం జాగ్రత్తగా ఉండమని కోరాడు వారిని. అసిస్టెడ్ ఇమ్మిగ్రేషన్ స్కీం బాగానే ఉపయోగపడుతున్నా,ఇండియాకు తిరిగి వెళ్ళే వారి సంఖ్య గణనీయంగా ఉన్నా,అక్రమం గా ప్రవేశించిన ఇండియన్ల పై మాఫీ చేయటంలో ఏజెంట్ జనరల్ కు చాలా చిక్కులేర్పడ్డాయి. దీనికి పరిష్కారం ఇమ్మిగ్రేషన్ నిబంధనలను నిర్లక్ష్యం చేయటం మాత్రమె. దీనిపై ఇండియన్ లలో అభిప్రాయ భేదాలేర్పడినా,శాస్త్రి అక్కడ ఉండటం ఆయన స్ఫూర్తి మంతమైన ఆలోచనలతో వారందరికి క్షమా భిక్ష పెట్టటంతో సమస్య తేలికగా పరిష్కారమైంది. అక్రమంగా పూర్వం సౌతాఫ్రికాకు వచ్చిన ఇండియన్స్ అందరికి 28-10-1928 లోపు వారంతా వ్రాతపూర్వకంగా ఒప్పుకొంటే వారందరికి క్షమాభిక్ష –కన్డోనేషన్ ప్రసాదిస్తానని డా.మలాన్ వాగ్దానం చేశాడు.



మరొక సమస్య లిక్కర్ బిల్.దీనిప్రకారం బార్ లలో ఇండియన్లు పని చేయకూడదు. దీన్నిన్యాయ శాఖామంత్రి టేల్మాన్ రూస్ విషపూరిత ఆలోచనతో ప్రవేశ పెట్టాడు. అన్నిరకాల చర్చలు జరిగినా ఫలించక,శాస్త్రి ప్రైం మినిస్టర్ హెర్ట్ జాగ్ ను కలిసి విషయ వివరణ చేస్తూ, వేలాది ఇండియన్ల ఉపాధిపోతుందని వారంతా రోడ్డున పడి పోతారని వాళ్ళ పొట్ట కొట్టద్దు అని వివరించగా ఆయన సంతృప్తి ప్రకటించి బిల్లు లో ఆక్లాజ్ అంటే నిబంధన తొలగించటానికి ఒప్పుకోని అందరికి ఊరట కల్గించాడు. ఇదీ శాస్త్రి ప్రజ్ఞకు మరో నిదర్శనం.

తర్వాత శాస్త్రి దృష్టి భూమిపై హక్కు,వ్యాపార అవకాశాలపై పెట్టాడు. తెల్లవారి అభిమతానికి మరీ విరుద్ధంగా ప్రయత్నిస్తే ఫలితం ఉండదని తెలుసుకొన్నాడు. కనుక తీవ్ర విమర్శలు,దాడి వదిలి కొంచెం ప్రక్కమార్గాలను అనుసరించాడు. తానూ సాధించిన చిన్న చిన్న విజయాలనుఆయన అపహాస్యం చేసుకోలేదు. అలాంటి చిరు విజయాలే భవిష్యత్తులో భారీ విజయాన్ని సాధిస్తుందని నమ్మాడు. ఉన్నంతలో తెల్లవారికి నల్ల వారికి మధ్య మరింత సుహృద్భావం ఏర్పడడేట్లు చేయాలి. వీరిద్దరూ ఎన్నో దశాబ్దాలపాటు ఒకరిపై ఒకరు ఈర్ష్యా ద్వేషాలతో ఉన్నారు అది ఒక్కసారిగా పోయేదికాదు. కనుక చాలా నెమ్మదిగా ఓపికగా సమస్య మూలాల లోకి వెళ్లి పరిష్కరించాలి." హరీబరీ"గా పనులు సాధ్యంకావు. శాస్త్రి అమోఘ ఉపన్యాసాలకు దక్షిణాఫ్రికాలో మంచి గిరాకీ ఉంది అతని వాగ్ధాటి

**ఎవరినైనా మెప్పిస్తుంది. భారతీయ సంస్కృతిపై అక్కడ ఎన్నెన్నో ప్రసంగాలు.”స్పెల్ బౌండ్ ఆడియన్స్” ముందు చేశాడు,భారతీయ వేదాంతాన్ని క్రిస్టియన్ బిషప్పుల ప్రవచనాలను ఏకరువు పెట్టి మాట్లాడే వాడు. ఇవన్నీ నల్ల –తెల్ల జాతులమధ్య పాతుకు పోయిన జాతి విద్వేషాన్ని తొలగించే ప్రయత్నాలే. ఇదేకాక ఇండో-యూరోపియన్ కౌన్సిల్లు ఏర్పాటు చేశాడు. వీటిలో బాగా ప్రభావ శీలురైన యూరోపియన్ జడ్జీలు బిషప్పులు ఎడిటర్స్,పార్లమెంట్ సభ్యులు వగైరాలున్నారు. అభివృద్ధి శీలురైన ఇలాంటి వారితో సమావేశాలు చర్చలు జరిపికొన్ని జటిల సమస్యలకు తేలిక పరిష్కా రాలుసాధించాడు. ఇలా నిరంతర ప్రయత్నాలతో యూరోపియన్ కమ్యూనిటికి బాగా దగ్గరయ్యాడు శాస్త్రి. అక్కడి జు-జంతు ప్రదర్శన శాలకు కు ఒక ఏనుగు పిల్లను మైసూర్ మహారాజ ఇచ్చిన కానుకగా సమర్పించి మనసులను దోచుకొన్నాడు.దీనికి డర్బాన్ ప్రజలు మహా సంతోషం పొందారు. వారి హృదయాలలో పదిలంగా స్థానం సంపాదించాడు శాస్త్రి.**

## కేప్ టౌన్ అగ్రిమెంట్



21-2-1928 న శాస్త్రి కేప్ టౌన్ అగ్రిమెంట్ వార్షికోత్సవసభ కేప్ టౌన్ లోని నెల్సన్ హోటల్ లో జరిపాడు.జనరల్ స్మట్స్ ను ప్రత్యేకంగా ఆహ్వా నించాడు,అతడు అగ్రిమెంట్ లో మార్పులు చేసినందుకు,ఇండియాలో సైమన్ కమిషన్ ను బాయ్ కాట్ చేసినందుకు కోపంతో రాలేదు. కానీ అతని సౌతాఫ్రికన్ పార్టీ వారొచ్చారు. పార్టీలకు అతీతంగా అగ్రిమెంట్ ఉన్నదని అందరూ సంతోషించారు. శాస్త్రి క్లుప్తంగా మాట్లాడి జనరల్ హెర్ట్ జాగ్ ను డా మలాన్ ను అభినందించాడు –”ఈ మొత్తం కీర్తి ఇప్పుడున్న దక్షణాఫ్రికా ప్రభుత్వానికే దక్కుతుంది. నా దేశం నాప్రజలు ఇక్కడి ఇండియన్లు ఎంతో గొప్పగా ఈ అగ్రిమెంట్ ను స్వాగతిస్తున్నారు అభినందనలు తెలియ జేస్తున్నారు. మొదట్లో చాలా వ్యతిరేకతంతో ఉన్న వాటిని చాలా హృదయ పూర్వకంగా విస్తృత ప్రయోజనాల దృష్ట్యా ఇక్కడి వారు మనస్పూర్తిగా అమలు పరచటానికి ముందుకు రావటం ముదావహం. వారందరికి మా కృతజ్ఞతలు.. ”అన్నాడు. తర్వాత ప్రైం మినిస్టర్ –”ఈ అగ్రిమెంట్ నాకూ నా ప్రజలకు గొప్ప గౌరవం తెచ్చి అందరికి మంచి సంతృప్తి కలిగించింది “అన్నాడు డా మిలాన్ “అనేక కోణాల దృష్ట్యా ఇది మహా ప్రయోజనకర అగ్రిమెంట్. దీని సాధనలో శాస్త్రి పడిన

మధనం ఫలించింది. ఆయన ప్రపంచ ప్రఖ్యాత గౌరవ నాయకుడే కాదు,ఆయన దానికి పూర్తిగా అర్హుడుకూడా.. ఈ అగ్రిమెంట్ సాధనలో మాత్రమేకాదు ఆయన వ్యక్తిగతంగానూ అంతటి గౌరవనీయవ్యక్తియే –"He is one of of the most out standing examples in the world of personal self sacrificing devotion to high personal and patriotic ideals. He is a most illustrious representative of Indian nation –is of utmost value to the two nations.. ''శాస్త్రి రాక దక్షిణాఫ్రికా ప్రజల కనువిప్పు కలిగించింది,అసలైన భారతీయత అంటే ఏమిటో నిరూపించింది. స్మట్స్ దీన్ని పార్టీ సమస్యగా భావించి ఉండకుండా ఉంటే బాగుండేది "అన్నాడు పాట్రిక్ డంకన్. శాస్త్రి అద్భుత వక్త మహా విజ్ఞాన వేత్త,దక్షిణాఫ్రికా ప్రజలకు ఆరాధ్య నాయకుడు. అన్నాడుకూడా.

దక్షిణాఫ్రికా పర్యటన ఏడాది గడువు పూర్తీ అవుతూ ఉండటంలో,ఇక్కడి ఇండియన్ కమ్యూనిటి మహాత్మాగాంధీకి శాస్త్రిని మరికొంతకాలం ఇక్కడే ఉండేట్లు చేయమని అర్జెంట్ ఉత్తరాలు చాలా రాశారు. 26-2-1928 న గాంధీ శాస్త్రి కి ఒక జాబు రాస్తూ –"అక్కడి నీ గడువు దగ్గరపడుతోందని అక్కడి మనవాళ్ళు వణికి పోతున్నట్లు నాకు తెలిసింది,నాకూ అంతగానే వణుకు వస్తోంది కాళ్ళకు చెప్పులు లేకపోవటం వలన. అత్యవసరమైన నీ ఆరోగ్యం దృష్ట్యా,ఇప్పుడు అక్కడినుంచి రావాల్సిన అవసరం అర్ధం చేసుకొన్నాను వారికి బాధ,కష్టమూ అయినా నీ ఆరోగ్తం దృష్టిలో అవసరాం కూడా. ''No one else can successfully replace you at the present moment "నువ్వు సాధించిన విషయం అమోఘం ఎవరూ పొందలేనిది. కానీ అంతగా వారి హృదయాలను గెలుచుకొన్న నీకు ప్రస్తుతం అక్కడినుంచి నువ్వురావటం నీకూ అక్కడి వారికీ శ్రేయస్కరం కాదు "అని పొంగిపోయి రాశాడు బోసినవ్వులాయన. గాంధీ కోరిక తీర్చి మరొక ఆరునెలలు అక్కడే ఉన్నాడు శాస్త్రి ఇంతకు పూర్వం కంటే మరింత ఉత్సాహంతో శక్తితో దేశమంతా తిరిగి భారీ సభలు నిర్వహించి ప్రజా హృదయాలను మరింతగా తన వాగ్ధారతో ఆకట్టుకొన్నాడు. South Africa bowed to the magic wand of Sastri "అంటే మంత్ర ముగ్దుల్ని చేశాడు. అంతా సవ్యంగా జరిగినట్లు చెప్పలేముకాని కొన్ని సభలలో ఆసియా వాసులకు వ్యతిరేకులైనవారు సభను భగ్నం చేసే ప్రయత్నాలు చేశారు. కానీ తొణకని బెదరని వ్యక్తిత్వంతో వారి ఆటలు సాగకుండా చేశాడు శాస్త్రి. ఆయన సహిష్ణుత గొప్ప ఫలితమిచ్చింది. ఒక సభలో అంతరాయం చేసిన ఒకడు సభ పూర్తీ అవగానే కన్నీళ్ళతో ఏడుస్తూ శాస్త్రిని క్షమించమని వేడుకొన్నాడు మేయర్ అధ్యక్షత న క్లేర్క్స్ డ్రాప్ సభలో యాంటి ఇండియన్ డిప్యూటి మేయర్,అతని స్నేహితులు లైట్లు ఆర్పేసి దుర్వాసన వెదజల్లే బాంబు –స్టింక్ బాంబు పేల్చారు. కంగారు పడవద్దని హాలులోనుంచి బయటికి రమ్మని కోరి శాస్త్రి ఆరుబయట మీటింగ్ జరిపి నవ్వుతూ-"I was going to speak when we changed our venue (నవ్వు )upon another phase of the agreement "అంటూ నవ్వుల పువ్వులు పూయించి దుర్వాసననను పరిమళ భరితం చేశాడు. డిగ్నిఫైడ్ గా,కలవరం చెందకుండా ఉండటం విశ్వవ్యాప్త ప్రశంసల జల్లు కురిసింది. జరిగిన దానికి మేయర్ క్షమాపణ చెప్పి పట్టణంలోని కొందరు ప్రముఖులే ఈ అలజడికి కారణమన్నాడు. ప్రభుత్వం వెంటనే తీవ్రంగా స్పందించి వాళ్ళను గుర్తిన్చిశాస్త్రికి,భారత ప్రభుత్వానికి క్షమాపణ చెప్పించింది. శాస్త్రి భారత ప్రభుత్వానికి ఒక కేబుల్ పంపుతూ జరిగిన సంఘటనను మర్చిపోయి వాళ్ళను క్షమించమని కోరాడు.

దక్షిణాఫ్రికా రైటానరబుల్ శ్రీనివాస శాస్త్రిని ఒక మహర్షిగా నాయకుడిగా ఒక గురువుగా గౌరవించింది. ప్రొఫెసర్ బెల్ శాస్త్రి ఆధ్యాత్మిక విద్యా ప్రసంగాలు విని తన్మయుడై అభిమానియై ఫిలాసఫీ,మతం,కళ అన్నీ ఆయనకు వాచో విధేయాలు లు – అన్నిటిని రంగరించి గొప్పగా మాట్లాడే నేర్పున్నవాడు. ఒకప్పుడుఇవన్నీ ప్రాచీన గ్రీసు దేశం లో ఉండేవి దురదృష్టవశాత్తు

ఇప్పుడు అవి పశ్చిమ యూరప్ లో కనిపించటమే లేదు"అన్నాడు. బిల్ ప్రశంసను మహాత్మాగాంధీ "యంగ్ ఇండియా "పత్రికలో యధాతధంగా ప్రచురించి –These lectures are perhaps his greatest and most permanent contribution to the Indian cause in South Africa "అని శ్లాఘించాడు. విడ్కోలు పార్టీలలో పత్రికలన్నీ శాస్త్రి బహుముఖీన ప్రతిభను చాలా విశేషంగా ప్రచురించాయి. నటాల్ విట్నెస్ పత్రిక –"It is not too much to say that Sastri is one of the worlds 'few statesmen "అన్నది. కేప్ టౌన్ పత్రిక –Sasrti is among the greatest English speakers in the English tongue,a natural orator with a most effective delivery. Slowly, with a sure choice of words,his speeches drop upon the ear,each sentence verbally perfect " అని అంటే, ది రాండ్ దిలి మెయిల్ "Sastri amongst us has been a great intellectual and moral stimulus to this country and for that as well as for his great personal charm and distinguished statesmanship. He is a veritable store -hous of learning "అని కీర్తించింది.

## రాయబారిగా

ప్రముఖ పత్రికలు రాసినట్లే నటాల్ అడ్వైజర్ పత్రిక –ఇది మిస్టర్ శాస్త్రి గారి రాజ్యపాలన అనిపించింది –రీన్ ఆఫ్ శాస్త్రి. ప్రభుత్వాలు ముఖ్యంగా బ్రిటీష ప్రభుత్వాలు విషయాలను ప్రభావితం చేయలేకపోయాయి. కానీ శాస్త్రి స్వరం ఈ ప్రాంతపు మొదటి ఏజెంట్ గా జీనియస్ గా ఎక్కడ కొట్టాలో అక్కడ కొట్టి మొనగాడనిపించాడు. ఆయన ప్రతిభను పొగడటానికి మాటలు లేవు. ఆయన ఇక్కడ ఉన్నకాలం లో "the great man of South Africa,the ablest orator,the shrewdest diplomat,the most accomplished interpreter of civilization of India that we have ever had in our midst " అని రాస్తే,ది ప్రిటోరియా న్యూస్ –it is a curious thing that the two best English speakers are not English men,one is a Dutch man Hofmayr,and the other is an INDIAN –Right Hounarable Srnivsa Sastri. Hofmeyr has the easier style –he is fast and free.while Mr. Sastri is slow and deliberate but Shastri has the ASQUITHIAN gift of compression which goes along with the choice of the inevitable world. '' అని ఆకాశానికి ఎత్తేసింది.




అదనంగా ఉన్న ఆరునెలల తర్వాత శాస్త్రి ఇండియాకు తిరిగి వెళ్ళే ఆలోచనలో ఉంటే మహమ్మద్ హబిబుల్లా, ఆయనకు అత్యంత ఉచితమనైన సత్కారం చేయాలనుకొని K.C.S.I అందించాలని భావించి చూచాయగా శాస్త్రి చెవిన వేయగా శాస్త్రి మర్యాదగా తిరస్కరించాడు. 30-9-1928 న శాస్త్రి ఆయనకు ఒక ఉత్తరం రాస్తూ –నేనిక్కడ చేసిన సేవకు మీరూ వైస్ రాయ్ చూపిన ఆదరం నాకు గొప్ప మన్నన. మీరు నాకు అందజేయలనుకోన్నది నా అతిసాధారణ జీవితానికి చాలా పెద్దది అతి విలువైనది. నా సేవలతో నేను అజ్ఞాతంగానే ఉండాలనుకొంటాను,కనుక నన్ను అపార్ధం చేసుకోరని పూర్తిగా నమ్ముతున్నాను "అని చెప్పాడు. అక్కడున్న చివరి నెలలలో శాస్త్రి తానూ చేసిన పనులణను ఏకీకృతం-కన్సాలిడేట్ చేశాడు. అది ఇండియన్ లమధ్య అత్యంత ప్రశాంతమైన కాలం,వారికీ,యూరోపియన్లకు మధ్య స్నేహ సంబంధాలు చిగురిస్తున్న తరుణం. అంతటి సుహృద్భావ ప్రశాంత వాతావరణంలో శాస్త్రి 1929 జనవరిలో ఇండియాకు తాను ఒక రాయబారిగా సాధించిన విజయ గౌరవాలను తలచుకొంటూ ఇండియా కు తిరిగి వచ్చాడు.

శాస్త్రి అంబాసడర్షిప్ ను గుర్తుకు తెచ్చుకొంటూ హోఫ్ మేయర్ –ఆయన ఒక కొత్త విధానం ప్రవేశపెట్టి దక్షిణాఫ్రికా ప్రజలందరి మనసులను ఆక్రమించాడు. ఆయన భారత దేశాన్ని ఆవిష్కరించి చూపిన దార్శనికుడైన మహా వక్త. మాకు ఇండియా గురించి అక్కడి ఉత్కృష్టసంస్కృతి గురించి ఆయన చెప్పేదాకా మాకేమీ తెలియదని మేము చెప్పటానికి సిగ్గు పడుతున్నాం.

## మళ్ళీ కెన్యా పోయింది

ఇండియాకు తిరుగి రావటానికి కొన్ని నెలల ముందు శ్రీనివాస శాస్త్రి మహాత్మా గాంధీకి ఒక ఉత్తరం రాస్తూ –"నాకు తిరిగి రావాలనే ఆదుర్దా ఎక్కువైంది. కానీ డోలాందోళనలో ఉన్నాను. అక్కడ ఇండియాకు నావసరం లెదు ఇక్కడ అవసరం ఎక్కువ. నా బాధలు కష్టాలతో మిమ్మల్ని ఇబ్బంది పెట్టలేను. మైనారిటీల మధ్య చాలాకాలం ఉండి పోవటంతో,నన్ను అపార్ధం చేసుకొని దూషిస్తారేమో ? ఇక్కడి పేరుప్రఖ్యాతులు,ప్రజాదరణ వదిలేస్తేనేను నీటిలోంచి బయట పడ్డ చేపలాగా నా పరిస్థితి ఉంటుందేమో అనే భయమెక్కువగా ఉంది.మూలం లోనే ఏదో తేడా కొడుతోన్దనిపిస్తోంది. నా వివేకం జాగరూకత నన్ను హెచ్చరిస్తున్నాయి. "I am impelled to seek betimes the safety of my natural environment(hot water )and be take my self to my usual occupation(ploughing the sands of the sea''.అని బాధపడ్డాడు. శాస్త్రి

ఊహించిన దానికంటే ఎక్కువగా కీడు జరిగింది. సౌతాఫ్రికాలో విజయం సాధిస్తే కెన్యా విషయం లోవెంటనే అపజయం పాలయ్యాడు.

ఇండియాకు తిరిగి రాగానే శాస్త్రి అన్నామలై యూని వర్సిటి వైస్ చాన్సలర్ గా చేరాడు. దీన్ని శాస్త్రి ముఖ్య స్నేహితుడు ఆరాధకుడు రాజా అన్నామలై చెట్టియార్ స్థాపించాడు. కాని చేరిన కొద్దికాలానికే ఇండియా ప్రభుత్వ ప్రతినిధిగా కెన్యా వెళ్ళాల్సి వచ్చింది. అక్కడి కెన్యా ఉగాండా తాంజనీక లమధ్య సామరస్యం సాధించటానికి హిల్టర్ –యంగ్ కమిషన్ టో చర్చలు జరపటానికి పంపబడ్డాడు. ఆకమిషన్ కామన్ రోల్ అండ్ సివిలైజేషన్ వోటు ను యూరోపియన్ జాతి ఒప్పుకొంటేనే అనే కండిషన్ మీద ప్రతిపాదించ బోతోంది. తనకు పూర్తి స్వేచ్చ కావాలని శాస్త్రి కామన్ రోల్ విషయం లో పట్టు బట్టాడు. కాని శామ్యుల్ విల్సన్ కు కాలనీల సెక్రెటరి ఆఫ్ స్టేట్ కల్నల్ ఆమ్రే దానిపై చర్చించవద్దని రహస్యంగా చెవిలో చెప్పాడు . ఈవిషయంపై గాంధీకి ఒక సుదీర్ఘ ఉత్తరం 27-7-1929నరాస్తూ అక్కడి ఇబ్బందులు పూర్తిగా వివరించాడు –సారాంశం-"కిందటి మే లో నేనిక్కడి నుంచి వచ్చేముందు కామన్ రోల్ విషయమై నాకు పూర్తి స్వేచ్చ ఇచ్చారు. ఆమ్రే ముందే చెప్పిఉంటే విల్సన్ దానికి వ్యతిరేకంగా చేసి ఉండే వాడుకాడు. విల్సన్ దీన్ని రహస్యంగా తన యూరోపియన్ జాతికి ఇండియన్ జాతులకంటే ముందే లీక్ చేసి బయట పెట్టాడు. ఇది తెల్లవారికి ఆమోదం సంతోషం కలిగించావచ్చుకాని మన వాళ్ళ ఆశలపై నీళ్ళు చల్లినట్లే. ఈ విషయం ఇండియా ప్రభుత్వానికి తెలిస్తే ఆమ్రే తమల్ని ఎంత మోసం చేశాడో తెలుస్తుంది ".




ఇండియా ప్రభుత్వం దీనిపై ప్రొటెస్ట్ చేసినా, శాస్త్రి పని అంత "వీజీకాదు ".యూరోపియన్లు వాళ్ళ వోటుహక్కు విషయంలో మతపరమైనదిగా ఉండటం లో పట్టనట్లే ఉన్నారు. ఇండియన్లు ఇది తర్వాత సంప్రదింపులకు నాంది అనుకొని వారూ అలానే ఉన్నారు. ఈ సమస్య శాస్త్రికి చాలా కష్టసాధ్యం,అసాధ్యం గా ఉన్నది. ఇక్కడి ఇండియన్లు శాస్త్రి విషయంలో నమ్మకంగా విదేయులుగానే ఉన్నారు. ఈ విషయం గాంధీకి తెలియజేస్తూ శాస్త్రి –"కష్టమైన పనిని అసాధ్యం చేయటంలో ఇండియన్ కమ్యూనిటి నన్ను మొదట్నించి అనుమానిస్తోంది. చాలా సార్లు వాళ్ళ అపోహలు పోగొట్టి విశ్వాసం కలిగించాను. కాని ఫలితం ఎండమావి గానే ఉంది. తనపై అపనమ్మకానికి కారణాలు తానూ రాజకీయాలలో తటస్తుడను,సర్వెంట్ ఆఫ్ ఇండియా వాడిని,బారత ప్రభుత్వ దూత అవటం. ఇవన్నీ నేను వారితో ఇచ్చిపుచ్చుకొనే ధోరణిలో మాట్లాడినప్పుడు,శాసన సభలలో,స్థానిక సంస్థలలో ప్రవేశం అప్పుడు బయట పడ్డాయి. ఏముంది ఇవ్వటానికి అని అడిగారు నన్ను. ఇవ్వాల్సింది అంతా మొత్తం ఊడ్చేసి ఇచ్చేశాం గా. కనుక ఇక రాజీకానీ,రాయితీకానీ లేనేలేదు. కామన్ వోటుహక్కుతోనే వారు ఎన్నికలో నిలబడి గెలిచారు. అప్పటిదాకా వారి పాలిసీ N.C.O అంతే నాన్ కో ఆపరేషన్. కదా. నా ప్రసంగాలలో డిఫెన్స్ నే చూశారు. కానీ చిన్న చిన్న వాటికోసం మీకు ఇబ్బంది కలిగించను.. నైరోబిలో,మోమ్బాసాలో నేను నేను డిఫెన్స్ లో పడ్డాను. అది చాలా అవమానకరం. కానీ నా ఓర్పు,స్వభావం వలన నేను నేరస్తునికాను అని బయట పడ్డాను. ''It was a negative benefit though I have never the confidence or the backing of our country men. ''దీనికి లోలోపల నేను చాలా కుమిలిపోయాను. ఇదంతా నేను

మనస్పూర్తిగా తెలియజేస్తున్నాను. not much have been observed in my behavior. ’’అంటూ బాధా తప్త హృదయంతో మహాత్మునికి తన ఆత్మఘోష నివేదించాడు శాస్త్రి.

తెల్లవారి గర్వంగా భాసించే లార్డ్ డేలామేరే మొదలైన యూరోపియన్ నాయకులతో శాస్త్రి మాట్లాడాడు. వాళ్ళు చాలా మర్యాదగా గౌరవంగా నిర్మొహమాటంగా మాట్లాడారు. కాని ఆమ్రే కొట్టిన చీకటి దెబ్బ అసలైన చర్చలకు దారివ్వలేదు. అనారోగ్యంతో నే శాస్త్రి చాలాచోట్ల అనేక ప్రసంగాలు చేశాడు. యూరోపియన్లను స్నేహహస్తం చాచమని కోరాడు. ఇండియన్లతో గౌరవప్రదమైన రాజీకి రమ్మని అర్ధించాడు. తమ మనస్సులను వెనుకకు మరల్చుకోలేని వారితోనే ఇలా మాట్లాడాడు. మొంబ్బాసాలో ఆయన ప్రసంగం ఉదాహరణ –”మిత్రులారా మా వారి విషయం లో ఉదారంగా ఉండమని మీ గుండె తలుపులు తెరచి మమ్మల్ని ఆహ్వానించి మిత్రత్వం చూపమని కోరుతున్నాను. మేమంతా మోడరేట్ మనుషులం. మాకోరికలు సమంజసమైనవి న్యాయబద్ధమైనవి గౌరవ ప్రదమైనవి. బారత రాజకీయాలలో నేను తటస్తుడనని ఇక్కడి పత్రిక నన్ను ఆక్షేపించింది. ఇక్కడ మీలో మోడరేట్ వారు అందరూ రండి. నాతోపాటు నేరస్తుస్లైన వీరందరి కి నాది ఒక విన్నపం “ మంచికి సాక్షిగా మీ తలలు అవమానంతో వంచండి. మధ్యస్తులు తటస్తులు మోడరేట్ లు అని సిగ్గుపడకండి. ఏదైనా ప్రజాసమస్య వస్తే మోడరేట్ లు పూర్తిగా హృదయపూర్వకంగా సమస్యా పరిష్కారం చేస్తారు. నన్ను నమ్మండి “అని తన తటస్థ స్వభావం ఎలా మేలు చేస్తుందో విస్తృత విషయాలవిషయాలలో వివరించి వారి మనసులు గెలిచాడు శాస్త్రి.

# మొదటి రౌండ్ టేబుల్ సమావేశం

గాంధీ కి రాసిన మరో ఉత్తరం లో శ్రీనివాస శాస్త్రి "కెన్యాలోని మన వారిపై నాకు ద్వేషం లెదు. అవకాశం వచ్చినప్పుడు వారికి సాయం చేయటంలో ఎప్పుడూ సిద్ధంగానే ఉంటాను "అన్నాడు అలాంటి అవకాశం వెంటనే వచ్చేసింది. 1931లో భారతప్రభుత్వం శాస్త్రినిబ్రిటీష పార్లమెంట్ లోని రెండు సభల సంయుక్త సమావేశం లో తూర్పు ఆఫ్రికా పై బ్రిటీష ప్రభుత్వం తెచ్చిన ప్రతిపాదనలపై సాక్ష్యం ఇవ్వటానికి ప్రతినిధిగా పంపింది. శాస్త్రి సాక్ష్యం బహు నిర్దుష్టంగా ధైర్యంగా సవాలుగా,విదేశాలలోని ఇండియన్ల పరిస్థితి రోజురోజుకూ దిగాజార్చేట్లు తెల్లవారికంటే న్యూనతగా ఉండేట్లు ఉందన్నాడు. మళ్ళీ జాయంట్ సెలెక్ట్ కమిటీ రిపోర్ట్ కామన్ రోల్ కు వ్యతిరేకంగా ఇండియన్లకు యూరోపియన్లకు మధ్య ప్రాతినిధ్య సమానతకు వ్యతిరేకంగా ఉన్నది. శాస్త్రి జాతి విభేదం సమసిపోతుందనుకోన్నది మరీ పెచ్చు పెరిగినందుకు విపరీతంగా బాధపడ్డాడు. దీనితో శాస్త్రి ఆరోగ్యం దెబ్బతిన్నది. కానీ మానసికంగా కుంగిపోలేదు. భగవద్గీతలో చెప్పిన సమానత్వ సామరస్యాలను పుంజుకొన్నాడు.



మొదటి రౌండ టేబుల్ కాన్ఫరెన్స్ సమయంలో ఇండియన్ లేబర్ పై రాయల్ కమీషన్ మెంబర్ గా శాస్త్రి అప్పటికే లండన్ లో ఉన్నాడు. దీని నాయకుడు రైటానరబుల్ జే.హెచ్ విట్లీ. అల్ బ్రిటీష సైమన్ కమిషన్ ను ఇండియాలోని రాజకీయ పక్షాలన్నీ లిబరల్స్ టో సహా బాయ్ కాట్ చేశాక,బ్రిటీష ప్రభుత్వానికి రాజ్యాంగ పురోగతి డొమినియన్ హోదా విషయాలలో ముందడుగు వేయటానికి వణికి పోతోంది. కొత్త వైస్రాయ్ ఇర్విన్ మానవత్వమున్నమనిషి, మనిషి బాధలు అర్ధం చేసుకొనే వాడు. కనుక జరిగిన నష్టాన్ని భర్తీ చేయటానికి ఇండియాతో స్నేహ హస్తం చాచాల్సిన అత్యవసర పరిస్థితి వచ్చిందని గ్రహించాడు. ముఖ్యంగా "నాన్ కో ఆపరేటర్ "అయిన గాంధీతో సంప్రదింపులు జరపాలనుకొన్నాడు. బ్రిటీష్ వారి చిత్తశుద్ధిని ప్రదర్శించి ఇండియన్ల హృదయాలను గెలవాలనుకొన్నాడు. లార్డ్ రీడింగ్ కల్పించిన అఘాతం పూడ్చి స్నేహసేతువు నిర్మించటానికి పూనుకొన్నాడు. 1929 లో లండన్ కు సెలవుపై వెళ్ళినప్పుడు కొత్త సెక్రెటరి ఆఫ్ స్టేట్ వెడ్ వుడ్ బెం ముందు తన ప్రపోజల్ పెట్టాడు. దీనికి అయిష్టంగా సరే అంటూ సైమన్ అభిప్రాయాన్ని ముందుగా తెలుసుకోవటం మంచిది అన్నాడు. మొదట్లో డొమినియన్ స్టేటస్ ను ఒప్పుకున్నా సైమన్ తర్వాత వ్యతిరేకించాడు. కాని రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ కు ఒప్పుకున్నాడు. అందువల్ల కమిషన్ రిపోర్ట్ ప్రభుత్వం ముందు ఉంచవచ్చుననే కారణంతో. దీనిపై ప్రధానికి ఆయనకు చాలా కరెస్పాండెన్స్ నడిచింది కూడా.

ఇర్విన్ అభిప్రాయాన్ని లిబరల్స్,కన్జర్వేటివ్ లూ అధిక సంఖ్యలో వ్యతిరేకించారు. బాల్డ్విన్ మాత్రం ఇర్విన్ ను సమర్ధించాడు డొమినియన్ స్టేటస్ విషయంలో. దీనివలన బాల్డ్విన్ చర్చిల్ లమధ్య వ్యతిరేకత ఏర్పడింది. వ్యతిరేకతను తిరస్కరించి మాక్ డోనాల్డ్ 31-10-1931న ఇర్విన్ ఇండియా వెళ్లేముందు గజిట్ లో నోటిఫికేషన్ ఇచ్చాడు. మాంటేగ్ –చేమ్స్ ఫర్డ్ లసంస్కరణలను పేర్కొంటూ వైస్రాయ్ స్టేట్మెంట్ ఇలా సాగింది –"ఇండియా రాజ్యాంగ ప్రోగ్రెస్ ప్రకారం డొమినియన్ స్టేటస్ సాధన ఉన్నది ".



ఈ స్టేట్ మెంట్ ఇవ్వటానికి ముందు ఇర్విన్ చాలా జాగ్రత్తగా ఒక చక్కని భూమికను అన్నిపార్టీలతోనూమహాత్మ గాంధీతోనూ సంప్రదించి కల్పించాడు. ఇర్విన్ ప్రకటన ను ఇండియాలో బాగా సమర్ధించారు. ఇండియన్ పాలసిమీద బ్రిటీష వారు కక్కే విషానికి విరుగుడు కనిపెట్టాడు ఇర్విన్ అని సంతోషించారు. ఇర్విన్ మాటలలో –giving too little and giving it too late ". సరైన సమయంలో ప్రభుత్వం సరైన నిర్ణయం చేసింది. ఇక్కడ మనకు మహా సంతోషం అక్కడ బ్రిటన్ లో రాజకీయ పక్షాలమధ్య తీవ్ర అభిప్రాయ ప్రేలుడు జరిగింది ఇర్విన్ స్టేట్ మెంట్ పై. అక్కడి ప్రముఖులు లాయడ్ జార్జ్,బర్కెన్ హెడ్,ఆస్టిన్ చాంబర్లేన్,చర్చిల్,రీడింగ్ వగైరా కాంగ్రెస్ లోని రైట్ వింగ్ నాయకులలో భారత దేశానికి సంపూర్ణ స్వరాజ్యం ఇవ్వటానికి పూర్తీ మద్దతు కూడా గట్టారు. లాహోర్ కాంగ్రెస్ కోరినట్లు డొమినియన్ స్టేటస్ తోపాటు స్వాతంత్ర్యాన్ని రెండు నెలలోపే ప్రకటించారు. లండన్ లో రౌండ టేబుల్ కాన్ఫరెన్స్ కు కూడా ఆమోదించారు. సహాయ నిరాకరణ ఆతర్వాత ఉప్పు సత్యాగ్రహం గాంధీ అరెస్ట్ వేలాది వాలంటీర్ల అరెస్ట్ జరిగాయి రౌండ టేబుల్ కాన్ఫరెన్స్ లో ఎజెండా ప్రకటించాలని గాంధీ తోపాటు అరెస్ట్ అయిన దేశవ్యాప్త ప్రజలను విడుదల చేయాలని పట్టుబట్టారు. ఆసమయంలో శ్రీనివాస శాస్త్రి ఇంగ్లాండ్ లోనే ఉన్నాడు. గాంధీ –ఇర్విన్ లమధ్య మధ్యవర్తిత్వానికి సప్రూ జయకర్ లు ప్రయత్నించారు. కానీ ఫలించలేదు. కానీ మొదటి రౌండ టేబుల్ కాన్ఫరెన్స్ గాంధీ లేకుండానే జరిగింది.

## ఇండియన్ లేబర్ కమిషన్

ఇండియన్ లేబర్ కమిషన్ ప్రతినిధిగా లండన్ లో1930 ప్రారంభంలో ఉన్న శాస్త్రి సైమన్ కమీషన్ ప్రతిపాదనలను తిరస్కరిస్తూ అక్కడి పబ్లిక్ కు విషయాలు వివరిస్తూ అందిన ప్రతిచోటా ఉపన్యాసాలలో రాతల్లో తెలియబర్చాడు. కాంగ్రెస్ మాటవిని డొమినియన్ స్టేటస్ కు అంగీకరించమని బోధించాడు. ఆకమిషన్ వలన ఇండియాకు డోమినికల్ హోదా రాదని గట్టిగా వాదించి చెప్పాడు. లండన్ లోని ఈస్ట్ ఇండియా అసోసియేషన్ పత్రికలో "డొమినియన్ స్టేటస్ అనేది మాటిమాటికీ మారుతున్నా,దాని అవసరాన్ని అందరూ గుర్తించారు అది ఇండియాకు తప్పని సరి అని అభిప్రాయపడ్డారు. దానివల్లనే కామన్ వెల్త్ బంధాలు దృఢమౌతాయని విశ్వ సించారు.జాతి విద్వేషం నశించాలని అందరూ కోరారు "అన్నాడు. ఇది చాలామందిని కదిలించి,అక్కడి రైట్ పార్టీలు దాన్ని ఒక ఆయుధంగా ప్రతిపక్షాలపై తీవ్రంగా ప్రయోగించాయి. శాస్త్రిని బాగా గౌరవించే రాజు అతని భావాలను అర్ధం చేసుకొని సానుభూతి చూపాడు. ఈ విషయం పై శాస్త్రి తన సోదరుడికి ఉత్తరం రాస్తూ –"నిన్న జరిగిన

గార్డెన్ పార్టీ లో నన్ను అక్కడి రాజ ప్రతినిదులందరికి పరిచయం చేశారు. రాజు గారు నాతొ మాట్లాడుతూ "I have been reading your recent speech''అన్నారు. ఆయన సంతోషించారని అనిపించింది "అని రాశాడు.

లండన్లోని "బిగ్ బిగ్స్" ల అభిప్రాయాన్ని డొమినియన్ స్టేటస్ కు అనుకూలంగా మార్చాడు శాస్త్రి. అందుకే అక్కడి గొప్ప ప్రభావం చూపే "మాంచెస్టర్ గార్డియన్"పత్రిక పూర్తిగా డొమినియన్ స్టేటస్ ను సమర్ధించింది. శాస్త్రి కి ప్రస్తుతం R.T.C. అంటే"గుండ్రబల్ల సమావేశం" పై ఆశ ఎక్కువగా ఉంది. దాన్ని తృణీకరించినా, ముక్కలు చేసినా మన గమ్యం చాలా దూరం పెరిగిపోతుంది. అయినా R.T.C.లో సీట్ కోసం చాలా జాగ్రత్తగానే ఉన్నాడు. అందులో మెంబర్ గా స్థానం పొందగానే తనమిత్రుడు వెంకటరామ శాస్త్రికి జాబురాస్తూ –"ఇప్పుడు మనకు జరుగబోయే అధ్వాన్నం గురించి భయపడాలి. నా ఆయుధాలన్నీ అయిపోయాయి. పేరు ప్రఖ్యాతులు కొంత ఉపయోగ పడవచ్చు. అడదిపోతే తల తిరిగినంత పని అవుతుంది "అన్నాడు.. ఒక వారం తర్వాత మళ్ళీ సోదరుడికి –"ఈ కాన్ఫరెన్స్ ఇండియన్ రాజకీయ దౌత్యానికి పరాకాష్ట. ప్రతినిధుల సహనానికి,శక్తికి పరీక్ష. అత్యధిక అసాధారణ పరిస్థితు లలో చిన్న ఆశమాత్రమే "అని రాశాడు. 15-10-1930 న ఒక మిత్రుడికి "నీలానే నాకూ రౌండ్ టేబుల్ పై ఎక్కువ ఆశలేదు. కాని పూర్తీ విశ్వాసంతో పాల్గోనాలి. అదే మా గురు గోఖలే గారి అంతరార్ధం –ఆయన అంటారూ –We must serve through our failures,more fortune people may serve through their success "అని. ఇండియాకు ముఖ్య శత్రువు బ్రిటీష వారి మొండి పట్టుదల. వాళ్ళకూ ఇండియాలోని మతవాదులకు పెద్ద తేడా లెదు. ''అని రాశాడు.

ఇండియన్ రౌండ టేబుల్ కాన్ఫరెన్స్ లో "సైమన్ శిశువు "ను పూర్తిగా విడిచిపెట్టేశారు.సర్ జాన్ కాన్ఫరెన్స్ లో మెంబర్ కూడా కాదు. అయిదవ జార్జిరాజు ఆ సమావేశం ను 12-11-1930 న జేమ్స్ పాలెస్ లో ప్రారంభించాడు. ఆయన వెళ్ళాక శ్రీనివాస శాస్త్రి ఆశావహమైన ప్రసంగం చేశాడు. కాన్ఫరెన్స్ ముఖ్యోద్దేశ్యాన్ని స్పష్టంగా వివరించాడు. -"చక్రవర్తి ధరించే కిరీటం శక్తికి ఐకమత్యానికి చిహ్నం. మన హృదయాలను ఆకర్షించి సమ్మతిని గౌరవంగా సమర్పించే నివాళి. అంతకంటే విశిష్టమైనది. కామన్ వెల్త్ లోని వివిధ జాతుల ప్రజలమధ్య న్యాయ,స్వేచ్చ సమానత్వత్రివేణీ సంగమం. విధేయత దీనికి అతి ముఖ్యం. అది దెబ్బతింటే ఎక్కడైనా వివిధ జాతులమధ్య అన్యాయం అసమానత అనవసర నిషేధాలు పెరిగిపోతాయి. ఇండియా అంటే ఆసక్తికల అన్ని పార్టీ లసమావేశం ఇది. రాజ్యాంగ బద్ధంగా ఇండియా భవిష్యత్తును తీర్చి దిద్దగలగటానికి ఇది ముఖ్య వేదిక. ధైర్యంగా మనసు విప్పి మాట్లాడుకోవాలి మనం..దానితో పాటు నియంత్రణ అంటే మోడరేషన్,సహనం,విభిన్న బావాలను అర్ధం చేసుకోవటం అవసరం , అన్నిటికంటే ముఖ్యం బారత దేశ స్వప్నం మనమనస్సులో ప్రకాశించాలి. ఇండియా బలం భవిష్యత్తు అభ్యుదయం సంక్షేమం సార్వభౌమిక అధికారం లను మనం మన్నించాలి. ఇప్పటికే అనేక బావాలు వినే ఉన్నారు మీరు మీ అసామాన్య వ్యక్తిత్వం తో, విషయాలను బాగా చర్చించి ఇండియా ఆశలకు సంక్షేమానికి అనుగుణంగా నిర్ణయం తిసుకొని ఈ గుండ్రబల్ల సమావేశం చరిత్ర లో ప్రముఖ స్థానం సంపాదించాలి –What ever its exact physical shape,may be hereafter remembered in history as the table of rounded wisdom and statesman ship "అని ముగించాడు శాస్త్రి నిర్మొహమాటంగా,ఆశావహంగా.

## ఆఫ్ స్టేట్ వేడ్జ్ వుడ్ బెన్



సెక్రెటరి ఆఫ్ స్టేట్ వేడ్జ్ వుడ్ బెన్ సమావేశానికి ఎజెండా తయారు చేయలేదు. కారణం ఇండియన్ లకు ఫ్రీ హాండ్ ఇవ్వాలనే అభిప్రాయంలోనే. బెన్ తో ఒక రోజు ప్రైవేట్ లంచ్ అయ్యాక శాస్త్రి 13-11-1930 న ఒక ఉత్తరం రాస్తూ –"బెన్ కు ఐడియాలున్నట్లు లెదు. విషయాలన్నీ మనకు,కాన్ఫరెన్స్ కే వదిలేయాలని చూస్తున్నాడు. మనకు వ్యవస్తలేదు కనుక ఇదిమనకు ఇబ్బందే కలిగిస్తుంది. కనుక నాకున్న ఐడియాలు చెప్పి సలహాలు ఇవ్వాలనుకొంటున్నాను. దేన్నీదాచుకోకుండా స్వేచ్చగా ఆయనకు చెప్తాను. ఆయన స్నేహ స్ఫూర్తి నాకు ఆశా జనకంగా ఉంది. కానీ అతనికి మాంటేగ్ కున్న సమర్ధత లేకపోవటం విచారకరం "అని చెప్పాడు

బొంబాయి నుంచి రౌండ టేబుల్ కాన్ఫరెన్స్ కు బయల్దేరిన ప్రతినిధి వర్గానికి" సీ చేంజ్" –అంటే గణనీయమైన మార్పు కనిపించింది. ఫెడరల్ సెటప్ అనే బావంతోనే వారు వస్తున్నారు. కన్జర్వేటివ్ డెలిగేట్ సర్ సామ్యుల్ హోర్స్,తర్వాత ఇండియాలో సెక్రెటరి ఆఫ్ స్టేట్ అయ్యాడు. ఇప్పుడు ఈ సమావేశం లో కృషి చేస్తున్నాడు. ఆయన అన్న మాటలు-"డెలిగేట్ల ఇండియానుంచి ఇంగ్లాండ్ ప్రయాణం సమయంలో ఇక్కడ పరిస్థితిలో చాలా మార్పు వచ్చింది. ఎవరో ఒకాయన ఆయన ఎవరో తెలిదుకాని "ఆల్ ఇందడియఫెడరేషన్"అనే సూచన చేసినట్లు తెలుస్తోంది. అది గాలిమాటకాదు.అది భారత రాజ్యాంగం ఆధారంగా అత్యవసరంగా వెంటనే ఏర్పడాలి. లిబరల్స్ రాజులు హిందువులు ముస్లిం లు,సిక్కులు అస్పృశ్యులు అభావ ప్రభావంలో పడి ఊగిపోయారు. వాళ్ళు లండన్ లో కాలుపెట్టేసరికి ప్రావిన్షియల్ అటానమి అనే సైమన్ కమిషన్ సిద్ధాంత రీత్యా మంచిదే అయినా,కేంద్రంలో యేదోరకమైన బాధ్యత లేకపోతె ఆచరణ సాధ్యం కాదు అనిపించింది "అన్నాడు.

లండన్ చేరిన డేలిగేట్లను శ్రీనివాస శాస్త్రి కలిసి ఇద్దరు ముగ్గురు వంతున ఇంటర్వ్యూ చేశాడు. దీనిపై 24-10-1930 న సోదరుడికి ఉత్తరం రాస్తూ –"సప్రూ జయకర్ లు ముస్లిం లతో అప్పటికే మాట్లాడి,పూర్తిగా డిమాండ్ అంతటికి లొంగిపోయి సెటిల్ మెంట్ కోసం ఆశగా ఉన్నారు. యువరాజుకూడా వాళ్ళతో మాట్లాడాడు. హైదరి,మిర్జా,హస్కర్లాంటి వారు ప్రక్కలకు లాగుతున్నా,వారందరికి ఫెడరేషన్,కిరీటంతో సాన్నిహిత్యం కావాలి. ఫెడరేషన్ బావమే జయిస్తుందని నా భయం. నెహ్రు అధ్యక్షత న ఏర్పడిన రాజ్యాంగ సిద్ధాంతాలను తయారు చేసే కమిటి పని ఇప్పుడు ఏమౌతుందో ?ఆ అగ్రిమెంట్ వస్తే దేశంలోని రాజులకు ముసల్మాన్లకు లొంగి పోవటమే అవుతుంది. ఇది డొమినియన్ స్టేటస్ ను మరింత దూరం చేస్తుంది. కానినాకు మాత్రం ఏం జరుగుతుందో అర్ధం కావటం లెదు "అని రాశాడు.

## డొమినియన్ స్టేటస్

శ్రీనివాస శాస్త్రి ఉన్న సమస్యపై లాభ నష్టాలను బేరీజ వేస్తున్నాడు. ఫెడరేషన్ విషయమై సంస్థానాధీశులకు అంతటి మోజు ఎందుకో అని ఆలోచించాడు. మొదట్లో వారిని సందేహాస్పదంగా,అనుమానాస్పదంగా చూశాడు. బాధ్యతగా ఇప్పుడు మనస్ఫూర్తిగా మాట్లాడి పరిష్కారం సాధించాలి. మహారాజులలో చాలా మందితో మాట్లాడాడు ఇంటర్వ్యూ చేశాడు. ఎవరి స్వార్థం వారిదే అయినా వారిలో దేశభక్తి ఇండియాపై ప్రేమ చూడగలిగాడు.ఒకసారి ఫెడరేషన్ లో చేరితే బ్రిటీష సామ్రాజ్యపు కూకటి వ్రేళ్ళను కూల్చవచ్చని లేకపోతె వారి రాజకీయ ఆఫీసర్ల బారి నుండి తప్పించు కోవటం కష్టం అనుకొన్నారు. బికనీర్ మహా రాజా దేశభక్తి అతి విశిష్టమైనదని అర్ధం చేసుకొన్నాడు. ఆయన ధైర్య సాహసాలు,లొంగిపోని శక్తి సామర్ధ్యాలు నిర్వహణ సామర్ధ్యం గొప్పవి. కల్నల్ హస్కర్ నిత్యం మహారాజులతో మాట్లాడుతూ అభిప్రాయ సేకరణ చేస్తున్నందుకు సంతోషించాడు శాస్త్రి. నెమ్మదిగా అయిష్టంగా నే ఫెడరేషన్ వైపు మొగ్గాడు. సర్దార్ కే. ఎం. పనిక్కర్ ఫెడరేషన్ పై పూర్తీ సమాచారం అందించాడు. శాస్త్రి రెస్ట్ కోసం బేకస్ హిల్ వెళ్లాడు. అక్టోబర్ లో లండన్ తిరిగి వస్తాడు. కల్నల్ హక్సర్ ఫణిక్కర్ ను స్టేషన్ కు వెళ్లి తీసుకు వచ్చి సవాయ్ హోటల్ లో లంచ్ కి ఆహ్వానించామని చెప్పాడు. శాస్త్రిని మనస్ఫూర్తిగా ఆహ్వానించాడు హోటల్ లో ఆయనకోసం హక్సర్,మనుభాయ్,సర్ తేజబహదూర్ సప్రులు ఎదురు చూస్తున్నారు. అప్పుడు ప్రచారం ప్రారంభమైంది. ఆయనపై అన్ని వైపులనుంచి ప్రశ్నల బాణాలు విసిరారు. రాష్ట్రాలను బలోపేతంగా చేయాలని హక్సర్ చెప్పాడు. కేంద్రం బాధ్యతపై సప్రూ వివరించాడు. రాష్ట్రాల విభజన ఆలోచన పై సర్ మనూభాయ్ మాట్లాడాడు. శాస్త్రి ఇవన్నీ వింటూ దృష్టిని శూన్యం లో పెట్టాడు. అప్పుడప్పుడు ఒక ప్రశ్న సందిస్తున్నాడు. కొంతసేపు గుసగుస లాడాడు. అంతులేకుండా ఆర్గ్యుమెంట్లు జరుగిపోతున్నాయి. కానీ" బుద్ధుడు లాంటి ఆ బ్రాహ్మణుడి ముఖం లో ఏమార్పు కనిపించలేదు ".వెలుగు,ప్రకాశం ఇప్పుడే బయటికి రావాలి. పొడిపొడి మాటలతో సరిపెట్టాడు. అప్పటికే పావు తక్కువ నాలుగు అయింది. అందరూ వెళ్ళిపోవటానికి లేచారు. అప్పుడు శాస్త్రి "దాన్ని గురించి నేను ఆలోచించాలి. నాకేమీ సంతృప్తి కలుగలేదు ""అన్నాడు అంతే. అందరు యుద్ధం సగం పూర్తీ అయింది అని భావించారు. హక్సర్ శాస్త్రి పొడిమాటలకు –"Mr sastri's historic phrase "I am confess I am converted to the idea of "ALL INDIA FEDERATION "అని అర్ధం లాగాడు.




మరొక విశేషం ఇండియా వాళ్లకు రియాక్షనరిగా కనిపించే పూర్వ వైస్రాయ్ లార్డ్ రీడింగ్ అందర్నీ ఆశ్చర్యపరుస్తూ డొమినియన్ స్టేటస్ కు,కేంద్రప్రభుత్వ బాధ్యతకు గ్రీన్ సిగ్నల్ ఇచ్చినట్లు ప్రకటించాడు. అసందర్భంగా ఆయన మాట్లాడిన మాటలు చాలా ప్రేరణాత్మకంగా ఉన్నాయి. అందరూ హర్షించారు. శాస్త్రి నోటి నుంచి ఫెడరేషన్ మాట రాకముందే ఆప్రకటన వచ్చింది ఫెడరేషన్ డొమినియన్ స్టేటస రెండూ త్వరలోనే శక్తి మంతమౌతాయని శాస్త్రి భావించాడు. 20—11-1930 న శాస్త్రి కాన్ఫరెన్స్ లో మాట్లాడుతూ ఫెడరేషన్ స్టేటస్ ల విషయంలో చాలా జాగ్రత్తగా ఉండాలని హెచ్చరించాడు ఒకదాన్ని మరొకటి బలహీన పరచకూడదు అన్నాడు. ఇవన్నీ కాంగ్రెస్ చేతులలో నిర్వహిమ్పబడాలి. విస్తృత రాజ్యాంగ పురోగతి వెంటనే జరగాలి. ఇప్పటికైనా మనవాళ్ళు బాధ్యతతో ప్రవర్తించాలి. ఇప్పటిదాకా ప్రభుత్వానికి చాలా ఇబ్బందులు కలిగించారు. పాలకులు వారసత్వపు నేరగాళ్ళు అనుకోవద్దు. వారు బ్రిటీష రాజరికానికి రాజ్యాంగ నిబద్ధతకు అన్కితమైనవారే. అపనమ్మకం వదిలేయండి వారు అప్పుడు మన ప్రక్కన మన స్నేహితులుగా నిలబడుతారు. వీరి రాజ్యాంగాన్ని అనుసరించే మన దేశపు రాజ్యాంగ రచన జరగాలి అదీ ఆదర్శంగా అందరికి బాధ్యతా

వహించేదిగా ఉండాలి “అన్నాడు శాస్త్రి.. ఇబ్బందులు ఉన్నా రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ మంచి ముందడుగే వేసింది. 27-11-1930 న శాస్త్రి సోదరుడికి రాసిన ఉత్తరం లో –”ఆశ్చర్యంగా బ్రిటీష వారు డొమినియన్ స్టేటస్ ను ఆమోదించారు. కొన్ని అభ్యంతరాలు ఉన్నా మొత్తం మీద మంచి ఫలితమే లభించింది. మన హిందూ –ముస్లిం విభేదాలు ప్రతి విషయాన్నీ విడదీయటానికి ప్రయత్నిస్తున్నాయి. సిక్కుల్ని ఊరడించటం మహా కష్టం. రాజులు కొంచెం సమంజసంగానే ఉన్నారు. భవిష్యత్తులో చీలికలు వచ్చే సూచనలు ఉన్నా ఇప్పుడు అంతా బాగానే ప్రశాంతంగానే ఉన్నట్లు అనిపిస్తోంది “”అని రాశాడు.

## గాంధి –ఇర్విన్ ఒడంబడిక

పండిత కుంజ్రు కు శాస్త్రి 3-7-1931 రాసిన ఉత్తరం లో –”ఇక్కడ ముఖ్యంగా ఒక ఫండ మెంటల్ స్టాండ్ పాయింట్ పై భేదాభిప్రాయాలున్నాయి. కొందరు పూర్తీ బాధ్య వహించాల్సి వస్తుందని దీన్ని పూర్తిగా తిరస్కరిస్తున్నారు.కాదనలేను సెటిల్ మెంట్ ఇవాళ చాలా అవసరం..దీనికోసం కాన్ఫరెన్స్ తీవ్రంగా కృషి చేస్తోంది. దీనిలో నేను పూర్తిగా పాల్గొని ఒక రూపు తెస్తాను. దీనికి మంచి సపోర్ట్ మాత్రం కావాలి. నన్ను అపార్ధం చేసుకోవద్దు. లోపాలు సరిచేయటానికి ఇంకా మనకు సమయముంది. స్కీం బాగా ఉపయోగ పడేట్లు చేసే అన్ని ప్రయత్నాలు చేస్తాం..మా శ్రమ ధారపోసి ఒకటి తయారు చేసినా అందులో లోతుగా చూస్తె కొన్ని దోషాలు కనిపించవచ్చు. అంతమాత్రాన పుట్టిన శిశువును కాలదన్ని పారిపోయినట్లు మనం ప్రవర్తించ కూడదు. ”అన్నాడు. కాన్ఫరెన్స్ లో చర్చలు జరుగుతూనే ఉన్నాయి. వింటర్ సీజన్ ప్రవేశించే దాకా.. మతం బూచి భయపెడుతూనే ఉంది. ప్రొఫెసర్ హరాల్డ్ లస్కి ఒక లెటర్ లో జస్టిస్ హోమ్స్ కు 10-1-1931న రాస్తూ-”ఇండియా వారి తీరు ప్రస్తుతం ఆశాజనకంగానే ఉంది “అన్నాడు. ఫెడరల్ చట్ర నిర్మాణ కమిటీకి లార్డ్ సంకి సర్వ సమర్ధుడు అని అందరూ భావించారు. ఈ నిర్మాణానికి సప్రూ,శాస్త్రి గొప్ప సహాయం చేశారు తమకున్న ప్రతిభ తో.. చివరి రోజులన్నీ విందులతో ఉపన్యాసాలతో గడిచిపోయాయి. బ్రిటీష ఇండియన్ డెలిగేట లు ఇచ్చిన విందులో కద క్లైమాక్స్ కు చేరింది. ఈ ఫలితం ఎవరూ ఊహించనిది గా అందర్నీ సంభ్రమాశ్చర్యాలకు గురి చేసింది. మహామహులంతా అంటే క్రీం ఆఫ్ ఇంటలిజెన్స్ అంతా అక్కడే ఉంది. మహాప్రవక్తసిసిరో వాగ్ధోరణిలో శాస్త్రి అందర్నీ మెప్పించాడు. Sastri’s name and fame stood higher than ever for wisdom eloquency and conciliation. ఎడ్వర్డ్ డాంప్సన్ఒక జాబును శాస్త్రికి 117-11-1930 న రాస్తూ “మీరు సప్రూ ఇద్దరూ అద్భుత కృషి చేశారు మా వాళ్ళకంటే. మీ కృషి ముందు వాషింగ్టన్ కృషి తక్కువే అనిపిస్తుంది. ”Sastri I could reckon among the noblest men I have ever met “జస్టిస్ హోమ్స్ అన్నాడు.

బొంబాయికి శాస్త్రి సప్రూ బృందం తిరిగివచ్చిన రోజే తిరిగి వచ్చిన సమయంలోనే 6-2-1931పండిత మోతీలాల్ నెహ్రు అలహాబాద్ లో చనిపోయాడు. ఇది ఈ బృందానికి ఆశనిపాతమే అయింది. మహాత్ముడికి ఇర్విన్ కు మధ్యచక్కని ఒడంబడిక కుదర్చగలిగే సామర్ధ్యం మోతీలాల్ కె ఉందని శాస్త్రి భావించాడు. గాంధీ లేని రౌండ టేబుల్ కాన్ఫరెన్స్ “హామ్లెట్ లేని ప్రిన్సాఫ్ డెన్మార్క్” లా ఉంటుందని శాస్త్రి భావించాడు. గాంధీ –ఇర్విన్ ఒడంబడిక కు జయకర్ సప్రులు విశేష కృషి చేశారు.



బొంబాయి నుంచి నేరుగా ఢిల్లీ వెళ్లి శాస్త్రి వైస్ రాయ్ కి లండన్ కాన్ఫరెన్స్ వివరాలన్నీ తెలియజేశాడు. కాంగ్రెస్ సహకారం కావాలంటే గాంధీని ఆహ్వానించాల్సిందే అని నచ్చ చెప్పాడు. ఇర్విన్ కు అనేక అపోహలు అనుమానాలు ఉన్నా శాస్త్రిమాటపై నమ్మకం తో గాంధీకి ఇష్టమైతే తనకూ ఇష్టమే అన్నాడు. శాస్త్రి సరాసరిఅలహాబాద్ వెళ్లి గాంధీతో కాంగ్రెస్ వర్కింగ్ కమిటి తో మాట్లాడాడు. ఆయన చెప్పింది అంతా శ్రద్ధగా విన్నారు అందరు. వెంటనే గాంధి ఇర్విన్ కు ఒక ఉత్తరం రాస్తూ "నేను వైస్రాయి ఇర్విన్ నుకాకుండా ఇర్విన్ వ్యక్తిని కలుసు కోవాలను కొంటున్నాను "అన్నాడు. శాస్త్రి "there is some opening. For,I believe the man is better than the VICEROY "అని ముక్తాయింపు ఇచ్చాడు.

# కమ్యూనల్ అవార్డ్

17-8-1932 న బ్రిటిష ప్రధాని రామ్సే మాక్డోనాల్డ్ ఒక కమ్యూనల్ అవార్డ్ ప్రకటిస్తూ కేంద్ర,రాష్ట్ర సభలలో ముస్లిం లకు,అణగారిన తరగతువారికి కొన్ని వెయిటేజి లను ఇచ్చాడు. ఈ ప్రత్యేక నియోజక వర్గాలనుంచి వారు తమ వోటర్ జాబితాల ఆధారంగా ఎన్నికకావచ్చు. కేంద్ర స్థానాలకు కూడా వారు పోటీ చేయవచ్చు.దీన్ని రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ లో గాంధీ పూర్తిగా వ్యతిరేకించాడు. మార్చి 11న గాంధీ యరవాడ జైలునుంచి శామ్యుల్ హోర్స్ కు ఉత్తరం రాస్తూ హరిజనులకు ప్రత్యేక నియోజక వర్గాలు ఏర్పాటు చేస్తే తాను నిరాహార దీక్ష చేస్తానన్నాడు. అన్నట్లుగానే సెప్టెంబర్ 20న దీక్షమొదలు పెట్టాడు. గాంధీ అనుయాయులు,విమర్శకులు కూడా ఆయన ప్రాణహాని జరుగుతుందేమోనని కలవర పడ్డారు. వీరంతాకలిసి దీనికి పరిష్కారం ఆలోచించారు. త్వరత్వరగా చర్చలు జరిపారు. దీనికే ప్రాధాన్యమిచ్చారు. ప్రభుత్వం కూడా రాజీ చర్చలకు సిద్ధమైంది. ఒక పరిష్కారం కుదిరి ముందు హరిజనులకు ప్రైమరి ఎన్నికలు జరిపి,ఆతర్వాత హిందువులందరికి జనరల్ ఎలెక్షన్స్ జరపాలని నిర్ణయించారు దీన్నే పూనా ఒడంబడిక అంటారు. నిరాహార దీక్ష ప్రారంభించే ముందు గాంధి శ్రీని వాస శాస్త్రికి ఉత్తరం రాశాడు అందులో ఆయన మనోవ్యధ పూర్తిగా అర్ధమైంది. శాస్త్రిపై ఆయనకున్న గౌరవం ప్రేమ అభి వ్యక్తమయ్యాయి. శాస్త్రిని అత్యంత స్నేహితుడిగా సోదరునిగా భావించాడు మహాత్ముడు. -"ఇది మంగళవారం తెల్లవారు జాము. మూడు దాటింది టైం.ఇప్పుడే ఒక చిన్న ఉత్తరం గురుదేవ్ టాగూర్ కు రాశాను. నా మానస కల్లోల సమయాలలో

ఎప్పుడూ నువ్వు నాతోనే ఉంటావు. నీ ఆలోచనలు నాకు బాగా అర్ధమయ్యాయి. నీపై నాకున్న గౌరవంనీకు బాగా తెలుసు. మనం ఉత్తర దక్షిణ ధృవాలుగా ఉన్న, లేక ఉన్నట్లు కనిపించినా,మన హృదయాలు కలిసే ఉన్నాయి. నేను ఎక్కడున్నా నీతో ఏకీభవిస్తా. అది నాకు సంతోషమే. ఇప్పుడు నేను తీసుకొన్న నిర్ణయం నీకు చివరి విలువైన విషయం.ఈగాయానికి నువ్వే మందు కనిపెట్టాలి. నేను విభేదాలకారణంగా మాపెద్దన్నయ్యకు పద్నాలుగేళ్ళు దూరంగా ఉన్నాను. ప్రతి ఏడూ ఆయన నన్ను శపిస్తూ రిజిస్టర్డ్ పోస్ట్ లో ఉత్తరాలు రాసేవాడు. ఆ తిట్లకు ఆనందించే వాడిని నేను. ఆయన తిట్లు శాపనార్ధాలు నాకు ప్రేమతోకూడిన దీవెనలు వరాలు. చివరకు నేనే గెలిచాను. ఆయన మరణానికి ఆరునెలల ముందు నేనే రైట్ అనినిండు మనసుతో ఒప్పుకున్నాడు తనదే తప్పు అన్నాడు. అసలు కారణం అస్పృశ్యత విషయం మాత్రమె మా ఇద్దర్లో తప్పు ఎవరిదో నాకు తెలియదు. కానీ శాస్త్రి !నువ్వు నాకు రక్తబంధువైన సోదరుడివి. ఈ విపత్కర సమయంలో నువ్వు ఊరికే ఉండద్దు నన్ను శపించు తిట్టు. నెలక్రితం నీ ఆరోగ్యం వాకబు చేస్తూ నీకు ఉత్తరం రాశాను. నీ నుంచి నాకు జవాబు రాలేదు. నా ఉత్తరం నీకు చేరిందో లేదో నాకు తెలిదు "అని ఆవేదన తెలియజేశాడు మహాత్మా.

కోయంబత్తూరు మునిసిపాలిటి శాస్త్రి జన్మదినం రోజున గాంధీ దీక్ష మూడవ రోజున చేసిన పౌరసన్మానం లో శాస్త్రి –"ఈ ఆందోళన కాలం లో ప్రైవేట్ గాకానీ పబ్లిక్ గాకాని ఏ రకమైన విషయాలు జరగవు. అందరి హృదయాలు యరవాడ సెంట్రల్ జైలు వైపే ఆదుర్దాగా చూస్తున్నారు ఏమి ప్రళయం జరుగుతుందో అని. మహాత్ముని అనుయాయులందరూ చాలా తీవ్రంగా కలత చెంది ఉన్నారు –Mahatma 's life it would be needless to say,is lived as few lives in history or fable have been lived. It is of supreme consequence to our kind,and he has now risked it in cause dear to all of us. ''పూనా నుంచి వస్తున్న వార్తలు ఆయన ఆరోగ్యం పై ఆశాజనకంగా ఉన్నందుకు సంతోషంగా ఉంది "అన్నాడు

పూనా పాక్ట్ పూర్తవగానే గాంధీ దీక్ష విరమించాడు. సెప్టెంబర్ 25 న గాంధీకి ఇచ్చిన టెలిగ్రాం లో శాస్త్రి –"Million homes rejoice and bless your superb service performed in your superb style. I confess I trembled in doubt,but the result indicates and establishes your indisputably the foremost "untouchable "and "un approachable;;.అని రాసిపంపాడు. 25-9-1932 న మహాదేవ దేశాయ్ తన డైరీలో –"బాపుచాలా సంతోషంగా ఉన్నారు శాస్త్రినుంచి టెలిగ్రాం వచ్చిన తర్వాత. శాస్త్రి టెలిగ్రాం అందిందని బాపు రిప్లై టెలిగ్రాం ఇచ్చారు "

శాస్త్రి మూడవ రౌండ టేబుల్ సమావేశానికి వెళ్ళటానికి వీలుగా ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకొంటున్నాడు –The last piece of service to my mother land "అన్నాడు. లిబరల్ ఫెడరేషన్ శాస్త్రికి ప్రెసిడెంట్ షిప్ ఇవ్వాలని ఆలోచించగా మర్యాదగా తిరస్కరిస్తూ తన శక్తియుక్తులు ఆరోగ్యం అన్నీ రౌండ్ టేబుల్ కు ఖర్చు పెడతానన్నాడు. 1933లో ఆక్స్ ఫర్డ్ లో రోడ్స్ మెమోరియల్ లెక్చర్ ఆహ్వానింపబడ్డాడు. సర్ రాబర్ట్ బౌడెన్,జెనరల్ స్మట్స్ ప్రొఫెసర్ ఐన్ స్టీన్ లు అంతకుముందు ఆరు లేక్చర్సిచ్చారు. అత్యున్నత మైన ఈ ఆహ్వానాన్ని శాస్త్రి సున్నితంగా తిరస్కరించాడు కొంత ఆరోగ్యం కారణంగా కొంత గురువు సిపి రామస్వామి అయ్యర్ చెప్పిన "Sastri's mis –trust "కారణంగా. ఈ ఆహ్వానం మరి రెండు సార్లు రెన్యు చేసి వచ్చినా,మళ్ళీ తిరస్కరించాడు. రైట్ ఆనరబుల్ హెచ్ ఏ ఎల్ ఫిషర్ కూడా శాస్త్రిని తన ఆరోగ్యం "Conserving his energy for the work in connection with the making of a Constitution for India "అందుకే ఆయన ఆరోగ్యం పై కలత చెందినా బ్రిటీష ప్రభుత్వం ఆయన్ను మూడవ రౌండ టేబుల్ కాన్ఫరెన్స్ లో పాల్గొనే ప్రతినిదులజాబితాలో నుంచి

తొలగించింది. దీనికి రెండు వారాలక్రితం లార్డ్ విల్లింగ్టన్ శాస్త్రిని ప్రెసిడెంట్ ఆఫ్ కౌన్సిల్ ఆఫ్ స్టేట్ "గా మాన్క్రిఫ్ స్మిత్ స్థానంలో ప్రకటించాడు. తనకు బ్రిటీష క్రౌన్ కింద ఇలాంటి పని చేయటం ఇష్టం గౌరవప్రదమే అంటూ రాసిన ఉత్తరంలో ఏమి రాశాడో రేపు తెలుసుకొందాం

## ట్రాన్స్ ఫర్ ఆఫ్ ప్రాపర్టి

శాస్త్రి మళ్ళీ ఢిల్లీ వచ్చి వైస్ రాయ్ కి గాంధీకి ఒక టెలిగ్రాం ఇమ్మన్నాడు ఉత్తరం చేరేలోపే. సోదరుడ్కి ఉత్తరం రాస్తూ బహుశా మర్నాడే గాంధీ –ఇర్విన్ లు కలిసి మాట్లాడవచ్చు అన్నాడు. గాంధి ఫిబ్రవరి 17 న ఢిల్లీ చేరాడు. శాస్త్రి వెంకటరామ శాస్త్రికి రాసిన ఉత్తరంలో –శిలువలు లేని ఇద్దరు క్రీస్తులు ఇవాళ మధ్యాహ్నం కలుస్తున్నారు –"This afternoon the two un crucified Christs meet "అని రాశాడు ఆనందంగా. చర్చలు ఆశావహంగా జరుగుతుండగా శాస్త్రి ఫిబ్రవరి 23న గాంధీకి కాంగ్రెస్ వర్కుంగ్ కమిటి పై పూర్తి ఆధిపత్యం ఉందని జవహర్ లాల్ వగైరాలను కట్టడిచేయగలడని,ఇర్విన్ కూడా ప్రతి అంశం మీద చర్చించాలని అనుకున్నాడని,కాంగ్రెస్ వారి బలహీనతలు తెలుసనీ వారికోరికలు సాధ్యమైనంతవరకు తీరుస్తాడని ".కనుక ఆశ ఉంది " "రాశాడు. పదిరోజుకు చర్చలు చక్కగానే సాగాయి ఆతర్వాతే చిక్కులేర్పడ్డాయి. శాస్త్రి గాంధీని శాంతి నెలకొల్పటం అత్యవసరం అని గట్టిగా చెప్పగా ఆయన మెత్త పడ్డాడు. చర్చల సారాంశాన్ని శాస్త్రి ఇలా చెప్పాడు –"27 విషయం చాలా ఉద్రిక్తమైంది. నేను 28 న గాంధీని కలిసి ప్రక్కనున్న అన్సారి ప్రైవేట్ రూం కు తీసుకు వెళ్ళి,ఒక గంట సేపు" తోమాను".అందులో సారాంశం –"మీ అనుచరులలో అరడజను మంది మాత్రమె సిద్ధాంతం ప్రకారం నాన్ వయొలెన్స్ ను నమ్ముతున్నారు. మీకేదైనా జరిగితే ఏమౌతుందో ఆలోచించండి. ఒక బలహీన శరీరం ఇండియా కు అరాచకానికి మధ్య ఉంది. మీకా వయస్సు మీరింది. మీరు తినేది చాలాస్వల్పం. ఉద్యమాన్ని ఆహిమ్సతో పరాకాష్టకు తెచ్చారు మీరు. దేవుడిపై భారం వేయకండి. ఇప్పుడున్న యదార్ధ స్థితి పై ఆలోచించండి. మీరు చేయకలిగింది పూర్తిగా చెయ్యండి. అలా చేయకపోతే ఉద్యమం అలానే కొనసాగుతుంది. అప్పుడు మీ పై బాధ్యతా ఒత్తిడి విపరీతమౌతుంది. అవి భరించరానివైపోతాయి. మీరు ఒకసారి నాతో అన్నారు –" I do not care what happens. I must satisfy my conscience "అన్నది గుర్తు చేసుకోండి. నిజాయితీ ఉన్న మంచి వారు మిమ్మల్ని,మీ పనుల్ని వేరే విధంగా జడ్జి చేస్తారు. మీరు సిద్ధాంతం కోసమే ముందుకు వేడుతున్నారుకానీ యదార్ధ స్థితిని గుర్తించటం లెదు –"you did not act properly and give up the movement at this stage ".అప్పుడు గాంధీ తానూ అన్ని విషయాలు జాగ్రత్తగానే ఆలోచించానని,కానీ మళ్ళీ ఇంకోసారి ఆలోచిస్తానని,అన్నాడు ఆయన విరమణ,శాంతికోసమే ఇప్పుడు ఆలోచిస్తున్నట్లు అనిపించింది. తన శక్తి సామర్ధ్యాలు సంపూర్ణంగా ప్రయోగించి దీన్ని సాధిస్తాడు అని నాకు నమ్మకం కలిగింది. ఆయనటాయన అనుచరులలో ఎక్కువమంది శాంతి కోరుతున్నారని చెప్పాను 'నాతో "రేపు వచ్చి వర్కింగ్ కమిటి మీటింగ్ లో మాట్లాడు "అన్నారు. నేను చెప్పింది గాంధీకి బాగా నచ్చిందని అనిపించింది. మర్నాడు ఫిబ్రవరి 28న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ లో గంటకు పైగా నేను మాట్లాడాను. వాళ్ళను సరైన దారిలో నడవటానికి బాగా "తోమాను ".వాళ్ళ త్యాగాలు బాధలు కష్టాలు వివరించాను. సాధించిన్దేదో సాధించారు. కాని సాధించాల్సిన విషయాలు అనేకం ఉన్నాయని అవి సాధిస్తేనే అసలు విజయం సిద్ధిస్తుందని నచ్చ చెప్పాను. ప్రస్తుతం మన దేశానికి శాంతి ముఖ్యం అని గట్టిగా చెప్పాను. నేను మాట్లాడినట సేపు అత్యంత నిశ్శబ్దం పాటించారు అందరూ. మాలవ్య సరోజినీ నాయుడు అన్సారి మరిద్దరు ముస్లిం లు,చిత్తరంజన్ దాస్ లు శాంతినే కోరుతున్నారని అర్ధమయింది. పాలసి

విచారణ అసాధ్యం అన్నాను. మనముందు ఒక తీవ్రమైన పెద్ద సమస్య ఉన్నప్పుడు ఇటువంటి చిన్నవాటికి ప్రాధాన్యం ఇవ్వకూడదు అన్నాను. కమిటీ అంతా నేను చెప్పినదాన్ని  ఆమోదించినట్లు అనిపించింది. నేను మాట్లాడక నేను అక్కడ ఉండటం భావ్యం కాదని  వారిలో వారు చర్చించి మంచి నిర్ణయం తీసుకోమని చెప్పాను. నేను వెళ్లి వరండాలో కూర్చున్నాను. అప్పటికే నేను అలసిపోయినట్లు అనిపించింది. నాతోపాటు సరోజినీ నాయుడుకూడా బయటికి వచ్చి తన కర్చీ ఫ్ పై" వుడుకులాం" ను చల్లి నాముక్కు దగ్గర ఉంచింది. హిందూ పత్రిక విలేకరి నేను స్పృహ తప్పి పడిపోయానని కద అల్లి ఉడుకులాం తో పోతుందని చెప్పాడని అర్ధమయింది

మార్చి 4 వరకు అన్తాసవ్యంగానె ఉంది. వైస్ రీగల్ లాడ్జిలో ఒక పార్టీ యేర్పాటు చేశారు. వైస రాయ్ నన్ను పక్కకు పిలిచి విషయం పక్కదారి పట్టిందని అంతే విషయం ఏమిటి అని అడిగాను. లోబరచుకొన్న ప్రాపర్టీ అంటా తాసీల్దార్లు కొనుగోలు దార్లు మధ్యజరిగిన లాలూచి కనుక స్టేట్మెంట్ పై సంతకం చేయను అన్నాడు గాంధి అని చెప్పాడు.  గాంధీని ఒక సారి కలవమన్నాడు నేను సప్రూ జాయకర్ లను తీసుకొని మహాత్ముని కలిశాను. ఆయన అప్పుడు వర్కింగ్ కమిటీలో మాట్లాడుతున్నాడు. వారంతా ఆయన సంతకం చేయను అన్నదుకుసంతోషిస్తున్నారు. వైస్ రీగల్ లాడ్జిలో జరిగిన సీను గాంధీ వివరించాడు. తానూ సంతకం చేయటానికి ఇంకు లో పెన్ను ముంచి సిద్ధంగా ఉండగా కలం కదలలేదు –He was intellectually convinced that he had agreed to the agreement. But there was some moral scruple,something in his conscience which said "D0 not sign "మళ్ళీ ఒకటికి రెండు సార్లు  అగ్రిమెంట్ లోని విషయాలు క్షుణ్ణంగా పరిశీలించాడు,కాన్ఫిస్కేటెడ్ ప్రాపర్టీ విషయం చదివి తొట్రుపడ్డాడు. అప్పుడు ఆయనకు దానిపై జ్ఞానోదయం అయినట్లు అనిపించింది. ఇలాంటి ట్రాన్స్ ఫర్ ఆఫ్ ప్రాపర్టీ  లో మోసపూరితమైన కేసులు చాలా ఉంటాయికదా అనిపించింది. ఈస్థితిలో సంతకం పెట్టకుండా ఉండటం భావ్యం కాదని  ప్రపంచం యావత్తు స్టేట్  మెంట్ ను స్వాగతించటానికి సిద్ధంగా ఉందని తెలియజేశాను అన్నాడు వైస్రాయ్ ".గాంధి వెంటనే –"I do not care the world. I can not sign a statement which I knew untrue "అని అక్కడి నుంచి వచ్చేశాడు. పెద్దపెద్ద విషయాలు పరిష్కరించి ఈ చిన్నవిషయంలో ఇలా జరగటం విచారకరం అని ఇలాగే దక్షిణాఫ్రికాలో ఒక సారి జరిగిందని శాస్త్రిితో గాంధీ అన్నాడు. నేను సప్రూ బుర్రలు బద్దలు కొట్టుకున్నాం దీనినుంచి ఎలా బయట పడాలని. అప్పుడు నేనో సప్రూ యి ఒక సూచనచేశాం. స్టేట్ మెంట్ లో గాంధీ కి తెలిసినంతవరకూ ఇందులో కొన్ని లావాదేవీలు చట్ట వ్యతిరేకంగా న్యాయానికి వ్యతిరేకంగా ఉన్నట్లు భావించాడని "అని చేర్చాం గాంధీ ముఖం వెలిగి పోయి "ఇది చాలు "అన్నాడు. రాత్రి తొమ్మిదింటికి వైస్రాయింటికి చేరాం ఆయన ఈ సవరణ ఒప్పుకోలేదు అక్కడే ఉన్న ఎమర్సన్ కూడా ఆయన్నే సమర్ధించాడు. చర్చోపచర్చలు జరిపాం వైస్రాయ్ చాలా భీష్మించు కున్నాడు. ఒకగంటతర్వాట వైస్రాయ్ ఎమర్సన్ ను రైనీకి ఫోన్ చేయమన్నాడు. విషయం తెలుసుకొని అలా మార్చవద్దు అనగా బయటికి వచ్చి అలామారిస్తే స్థానిక ప్రభుత్వాలను అవమాన పరచినట్లవు తుంది అన్నాడు. మావైపు తిరిగి ఇప్పుడు ఏం చేద్దాం అన్నాడు. రైనీని రమ్మని మళ్ళీ ఫోన్ చేయగా ఆయన పైజమాలో ఉన్నానని చెప్పగా ఫరవాలేదు రమ్మనగా,ఆయన ఓవర్ కోట్ తో రాగా,మళ్ళీ అందరంకూర్చుని గంట చర్చించాం. వైస్రాయ్ మెత్తబడలేదు. అప్పుడు సప్రూ జయకర్ లు నావైపు చూడగా నేను ఆయనకు గాంధీ ఇంత చిన్న విషయంలో ఎంతటి మధన పడ్డాడో వివరించా పెద్ద పెద్ద విషయాల లో అంగీకారం కుదిరాక ఆఫ్టరాల్  ఈ చిన్న విషయంపై పట్టు పట్టకండి అన్నాను. వైస్ రాయ్ రైనీ వైపు చూడగా "ఒ యస్ "అన్నాడు "వా యస్ " అన్నాడు ఇర్విన్. ఈ విషయంలో గాంధే నుంచి ఇబ్బంది రాకుండా చూడమని కోరగా ఆబాధ్యత నాది అన్నాను. వెంటనే గాంధీ దగ్గరకు వెళ్ళాం. తలకింద ఒక వేలంత ఎత్తున్న దిండు పెట్టుకొని పడుకొని నిద్రకు

సిద్ధంగా ఉన్నాడు.గాంధీకి అన్నీ వివరించి చెప్పగా ఆయన ఒప్పుకొన్నాడు ఇదంతా అయ్యేసరికి అర్ధరాత్రి ఒంటి గంట అయింది శుభ ప్రదంగా "అని శాస్త్రి మనకు తెలియ జేశాడుపూస గుచ్చినట్లు వివరంగా.

## రెండవ రౌండ టేబుల్ కాన్ఫరెన్స్

గాంధీ –ఇర్విన్ ఒడంబడిక ఆమోదం పొందినందుకు వైస్ రాయ్ ఇర్విన్ చాలా సంతోషిస్తూ –My Dear Sastri –I must write one line of thanks to you for the part you have played in making this agreement with Mr.Gandhi possible. I can guess how great your part has been,and believe me, I am VERY grateful-yours very sincerely –IRWIN.''అన్నాడు మనస్సునిండా కృతజ్ఞతలు వర్షిస్తూ.

రెండవ రౌండ టేబుల్ కాన్ఫరెన్స్

శ్రీనివాస శాస్త్రి 18-4-1931 న మళ్ళీ ఇంగ్లాండ్ బయల్దేరి ఈస్ట్ ఆఫ్రికన్ విషయాలపై పార్లమెంట్ లో బ్రిటీష కమిటి ముందు సాక్ష్యం ఇవ్వటానికి వెళ్లాడు. అంతటే రెండో గుండ్ర బల్ల సమావేశానికి ముందే లండన్ లో ఉన్నాడన్నమాట. అక్కడ అనుకూల వాతావరణాన్ని కల్పిస్తూ మహాత్ముని సమావేశంలో పాల్గొనటం పై ఎంతటి విశిష్టత ఉందో వివరించాడు. గాంధీకున్న నిగూఢ అవగాహన బ్రిటీష ప్రజలకు తేట తెల్లం చేసి చెప్పాడు. బిబి సి. లో ఒక సారి మాట్లాడుతూ "బ్రిటీష ప్రభుత్వంపైనా మాటనిలకడలేని పాలసీలపైనా అపనమ్మకం కలిగింది గాంధీకి. బ్రిటీష్ ప్రభుత్వం పైన ఆయనకు ప్రజలకు ఉన్న గౌరవం తిరుగు లేనిది. మధ్యే మార్గం పై ఆయనకున్న నమ్మకం అపారం.ఆయన విజన్ అర్ధం చేసుకోవటం మహా కష్టం. మొదటి సమావేశం ఆయన లేకుండానే జరిగింది ఈ రెండవ దానికి ఆయన ప్రత్యేక ఆకర్షణగా నిలుస్తారు. ఆయన వ్యక్తిత్వం ఏమిటో మాటలద్వారా ఆలోచనలద్వారా క్రియలద్వారా ఇప్పుడు మీరు ప్రత్యక్షంగా చూస్తారు. You will see the tenderness and chivalry of his nature can be touched and how privations (ముఖ్యావసరాలు )of the flesh and wounds of the soul have left his reason without a cloud "అని బోధించాడు రేడియో ద్వారా.




ఈలోపు ఇండియా నుంచి గాంధి ఈ సమావేశానికి రావటం లేదని వార్త వచ్చి అందరూ కలవరం చెందారు. ఏప్రిల్ లో ఇర్విన్ పదవీ విరమణ చేయగా ఆస్థానం లో లార్డ్ విల్లింగ్టన్ వచ్చాడు. గాంధి ఇర్విన్ ఒడంబడిక లో విషయాలపై వివరణలో భేదాలు కలిగాయి. అందుకని గాంధి రాను అన్నాడు,గాంధీని రమ్మని ఒక కేబుల్ పంపాడు శాస్త్రి. దీనికి సమాధానంగా గాంధి –"నీ కేబుల్ నా హృదయాన్ని చలిమ్పజేసింది. నిన్ను ఓదారుస్తూ ఒక ఉత్తరం

రాశాను. కాన్ఫరెన్స్ కు రావటానికి నేను తప్పించుకోవటం లెదు. స్థానిక ప్రభుత్వాలు సెటిల్ మెంట్ ను కాళ్ళతో తోక్కేస్తున్నాయి. అణచి వేత ఉచ్చ స్థితి లో ఉంది. యంగ్ ఇండియా పత్రిక చదివితే నామనసు నీకు బాగా అర్ధం అవుతుంది. జరిగిన దానిలో పదో వంతు మాత్రమె అందులో రాశాను. ఇన్ని ఇబ్బందులమధ్య నేను ఇండియా విడిచి రావాలా ?అనేది ప్రశ్న సిమ్లా విషయం లో ఆందోళనగా ఉన్నాను "అని రాశాడు.

గాంధీ రావటానికి మార్గం సుగమం చేయటానికి అన్ని విధాల ప్రయత్నాలు చేశాడు శాస్త్రి ఎట్టకేలకు గాంధి 29-8-1931 న లండన్ బయల్దేరాడు. సెప్టెంబర్ ఏడున జరిగే రెండవ రౌండ టేబుల్ సమావేశానికి గాంధీ ముందే లండన్ చేరాడు. సమావేశం ప్రారంభానికి రెండు వారాలముందే మాక్ డోనాల్డ్ తన తనలేబర్ పార్టీ మంత్రి వర్గ రాజినామా ను రాజుకు సమర్పించాడు. అనేక ఆర్ధిక విషయాలు అతని రాజినామాకు దారి తీశాయి. వెంటనే ఆయనను జాతీయ ప్రభుత్వం ఏర్పరచమని రాజు ఆదేశించాడు. అదృష్టవశాత్తు లార్డ్ సంకి అదే పదవిలో ఉండి పోయాడు. శామ్యూల్ హోర్స్ బదులు కన్సర్వేటివ్ పార్టీకి చెందిన వేడ్జ్ వుడ్ బెన్ ఇండియాకు సెక్రెటరి ఆఫ్ స్టేట్ గా వచ్చాడు. ప్రతిపక్ష టోరీలు ఆయనకు చాలా అడ్డంకులు కల్పించారు ముఖ్యంగా చర్చిల్. ఇండియన్ రౌండ్ టేబులర్స్ అతడిని అనుమానంగా జాగ్రత్తగా గమనిస్తున్నారు ఒక కన్ను వేసే ఉంచారు. లండన్ రాగానే గాంధి శాస్త్రితో కలిసి మాక్ డోనాల్డ్ ను కలిసి మాట్లాడాడు. ఇద్దరి ప్రవర్తన విషయం లో హస్తి మశకాంతర భేదం ఉంది. అతడు చిక్కడు దొరకడు టైప్. గాంధి దృఢ సంకల్పం,నిష్కపటం ఉన్నవాడు. హోర్స్ నుకూడా శాస్త్రిలో కలిపి కలిశాడు శాస్త్రి. పైకి గట్టిగా లొంగని వాడిగా కనిపించినా అతడు సూటిగా నిర్మొహమాటంగా ఉంటాడు. అతనిలో గాంధీ "ఆనేస్ట్ ఇంగ్లిష్ మాన్"ను చూశాడు మహాత్ముడు. అతడితో గౌరవ సంభాషణ చేశాడు.

సమావేశం మొదటి రోజు నుంచి మత విషయం అన్నిటిని మించి ముందుకొచ్చింది. గాంధీ పాల్గొనటం ఆయనకు కానీ కాన్ఫరెన్స్ కుకానీ ఉల్లాసంగా అనిపించలేదు. ముస్లిం లకు లాగానే అణగారిన వర్గాలు కూడా ప్రత్యేక నియోజక వర్గాలను కోరటం గాంధీ కి భౌతిక గాయాన్ని కలిగించినట్లయింది. గాంధీ మనసు కూడా బాగాగాయమై, ఏ క్షణం లోనైనా సమావేశం నుంచి వెళ్లి పోతాడని శాస్త్రి భావించాడు. సర్వ శక్తులు ఒడ్డి ఆయన్ను సమావేశం నుండి వెళ్ళిపోకుండా ఉంచేందుకు అన్నివైపులనుంచి ప్రయత్నం చేశాడు తీవ్రగా. 2-10-1931వెంకటరామ శాస్త్రికి ఉత్తరం రాస్తూ శాస్త్రి –"శకునాలు బాగాలేవు. గాంధీని వేధించారు ఆయన మహోన్నత వ్యక్తిత్వాన్ని కించ పరచారు. ప్రత్యేకతలను కాదనలేదు రాజీని ఒప్పుకోనూ లెడుతన మనసులో ఉన్నది అల్టి మేటం –కడపటి తీర్పుగా చెప్పేసి వెళ్లి పోవాలని గాంధీ అనుకొంటున్నాడు "అన్నాడు.. సుహృద్భావ చర్చలకు శాస్త్రి ఎంతగానో ప్రయత్నించాడు. గాంధీ మాటలను పదే పడదే వివరించాడు కానీ ప్రయోజనం శూన్యం. గాంధి మూడు ముఖ్యమైన విషయాలు నొక్కి చెప్పగా వాటిని సవాలు చేశారు అక్కడ ప్రతినిధులు. ఆయన చెప్పినవాటిలో మొదటిది-కాంగ్రెస్ ఒక్కటే ఇండియాకు ప్రతినిధి. దీన్ని శాస్త్రి ఒప్పుకున్నా డిప్రేస్డ్ క్లాస్ ముస్లిమ్స్ ఒప్పుకోలేదు. రెండు –అణగారిన వారికి ప్రత్యేక నియోజక వర్గాలు ఏర్పరిస్తే హిందువు లలో విభజన వచ్చి ఒకరిపై ఒకరికి భేదభావన ఏర్పడి బలహీనమౌతారు. మూడు మహమ్మదీయులకు ప్రత్యేక నియోజక వర్గాలను రద్దు చేస్తే హిందూ ముస్లిం సఖ్యత పెరి జాతీయ ఐక్యతసాధ్యమౌతుంది. గాంధీ చెప్పినవాటికి మైనార్టీలకు నచ్చక మరింత వాటాలకోసం బేరసారాలు సాగించారు.

అనుకోకుండా అకస్మాత్తుగా ప్రధాని మధ్యవర్తిత్వం లో మైనారిటి కాన్ఫరెన్స్ జరిగింది. అందులో మాక్ డోనాల్డ్ అడిగాడు –”మీలో ప్రతిఒక్కరు కమిటీలోని ప్రతి మెంబర్ కూడా నన్ను మైనారిటి సమస్య పరిష్కరించమని కాగితాలు రాసిసంతకాలు చేసిఇస్తారా ?నా నిర్ణయాన్ని శిరసవహిస్తారా ?ఇది మంచి పద్ధతిఅనుకుంటాను అన్నాడు. హిందువుల పక్షాన శాస్త్రి ఒప్పుకున్నాడు. మాక్ డోనాల్డ్ వెంటనే –నాకు ఒక వర్గం ఒక వ్యక్తికాదు ఈ కమిటి సభ్యులంతా ఆ డిక్లరేషన్ పై సంతకాలు చేయాలి “అన్నాడు కాని ఈప్రయత్నం సఫలం కాలేదు. ఇండియాకు డొమినియన్ ప్రతిపత్తికి మాత్రం అడ్డం గా మారింది ఈ విషయం.

## గుండ్రబల్ల చిరస్మరణీయ ప్రసంగం

మహాత్మునితో సహా చాలా మంది డెలిగేట్లు మాండేట్ అంటే విధి లేక ఆదేశాలతో హాజరయ్యారని శాస్త్రి చెప్పాడు. అది కాన్ఫరెన్స్ పై తీవ్ర ప్రభావం చూపింది. అందుకే కాన్ఫరెన్స్ జాతీయత మూల జీవితంలోకి బ్రిటీష్మూల సిద్ధాన్తాలలోకి వెళ్ళింది. రాజీ కావాలంటే అందరూ కలిసి ఆలోచించాలి. ఈరకమైన రాజీ మన ముఖ్య నాయకులలో మనస్ఫూర్తిగా లేనందుకు శాస్త్రి బాధ పడ్డాడు. ఇందులో గాంధీ పాత్రను చెబుతూ “మైనారిటీలమీద, రిజర్వేషన్లమీద గాంధీకి నిజమైన దృక్పధం ఉంటే అలా ప్రవర్తిన్చేవాడుకాడు. ఊహ సంతోషం కలిగించదు,He preferred to be Congress mandatory. సిద్ధాంతాలు ఆదర్శం కోసం పోరాటాలు,ప్రాపగాండా ఇవన్నీ చెప్పటానికి బాగానే ఉంటాయి. ఒక సారి ఆందోళన ప్రారంభమైతే ఎక్కడిదాకాపోతుందో తెలిదు. ప్రజల బాధలు కష్టనిష్టూ రాలు మనం తీర్చలేక పోవచ్చు.. కాన్ఫరెన్స్లో శాస్త్రిచాలా చలాకి పాత్రనే నిర్వహించాడు. ఆయన భావ స్పష్టత దాన్ని వ్యక్తపరచే విధానానికి అందరూ ఫిదా అయ్యారు. ఫెడరేషన్ స్ట్రక్చర్ కమిటీ మీటింగ్ లో,ఇంగ్లిష్ లో మాస్టరీ వక్తనిపించుకొన్న చైర్మన్ లార్డ్ సంకి ని అప్రతిభుడిని చేశాడు శాస్త్రి. అతడు అందరి మంచికోసం నేను నా భావాలను వదులుకోలేను. నాప్రాణాలిక మార్చుకొంటాకాని భావ త్యాగం చేయలేను అన్నాడు. శామ్యుల్ హోర్స్ –” వాళ్ళు అందరి క్షేమం కోసం వ్యక్తిగత కోరికలను నష్టపోతారనుకోవాటం మీ ఉద్దేశ్యమా ?’’అని అడిగితె శాస్త్రి –అవును అన్నాడు. చైర్మన్ –శాస్త్రి చెప్పింది రైట్. ఆయన అప్పుడప్పుడు నాకు మంచి ఇంగ్లిష్ ఎలా మాట్లాడాలో చెబుతూ ఉంటాడు. ”అన్నాడు. అంటేశాస్త్రికి ఇంగ్లీష్ భాషా నుడికారం ఉచ్చారణ పై ఎంత లోతైనన అవగాహన ఉందొ మనకు అర్ధమౌతోంది.



1-12-1931 మధ్యాహ్నం రెండు గంటలకు శ్రీనివాస శాస్త్రి చిరస్మరణీయ ప్రసంగం చేశాడు గుండ్రబల్ల సమావేశంలో.. అందులో మొదటిబాగం ప్రధాని రామ్సే మాక్ డోనాల్డ్ గురించి,తర్వాత బాగం మహాత్మా గాంధీ గురించి చెప్పి ఇరువైపులా సమాన స్నేహాన్ని ప్రకటించాడు. ప్రధానిని “చిల్లర దేవుళ్ళ” సలహాలు వినద్దని,ఫెడరేషన్ పై”మనమందరం పూర్తీ హృదయాలు పెట్టి “ ఇప్పటిదాకాసాధించిన దాన్ని వెనక్కి మరల్చే ప్రయత్నం చేయద్దని కోరాడు. తర్వాత ఇండియాలో తిరుగుబాటు మూల కారణం వివరించాడు. మేముకోరేది భౌతిక కీర్తి ప్రతిష్టలుకాదు. ఈ సామ్రాజ్యం మాదికూడా అనే భావనతోనే.కనుక ప్రదానిగారూ –” The time has come for you to take one long step from

which there shall be no returning "అన్నాడు. పరిరక్షణలు కొన్ని ప్రస్తుతం అవసరమే కానీ ముందు మేము మా రాజ్యంగం పై నిలబడాలి అంతకంటే సేఫ్ గార్డ్ కాని రిజర్వేషన్ కాని లేదు. దాన్ని మీరు ఏ పేరు తో పిలిచినా మాకు అభ్యంతరం లెదు. అది మాత్రం పూర్తిగా ఇండియాకు ఆసక్తికరంగా ఉండాల్సిందే. పరిరక్షణలన్నీ మారాజ్యం లో పొందుపరచి ఎవరికీ ఇబ్బంది లేకుండా చేస్తాం. నేను రెండు సూచనలు చేస్తున్నాను మీకు –మొదటిది –మీరు విధించే పరిమితులన్నీ రాజ్యాంగంలో చాప్టర్ గా చేర్చండి. మేము వాటిపై మా చట్ట సభలలో చర్చించి మంచి నిర్ణయం చేస్తాం. దీనికోసం మేము ఇంపీరియల్ పార్లమెంట్ మెట్లు ఎక్కాల్సిన పని ఉండదు. మేమే రివిజన్, మాడిఫికేషణ్ చేస్తాం. రాజ్యాంగ అడ్వాన్స్ మెంట్ కోసం మళ్ళీ మేము ఇక్కడికి రాకుండా చూడండి. రెండవ సూచన-ఇన్స్ట్రుమెంట్ ఆఫ్ ఇన్స్ట్రక్షన్ లో ఒక క్లాజు చేర్చండి. మీరు నియమించిన వైస్రాయ్ లు ఇండియా రాజ్యాంగం కేబినేట్ నిర్ణయం ప్రకారమే నడవాలి.పరిరక్షణలకు అడ్డం చెప్పరాదు. అవన్నీ ఇండియా ఇంటరెస్ట్ లోనే జరగాలి. ప్రధానిని ఉద్దేశించి ప్రత్యేకమైన Exhortaion "-ప్రభోధం అనే అర్థం వచ్చే మాటఅనే ను ఉపయోగించి,తర్వాత జరిగే కాన్ఫరెన్స్ లు "Un enthusiastic,dry as dust bureacracy "కి మాత్రం అప్పగించవద్దు. దానికి కారణం –In the long corridors and haunts of the India office and of the great secretariat that we have built in New Delhi there are many dark places where these beautiful and moving ideals are apt to be strangled,or at least they will be delayed until they have no further significance to those they have been deeply interested in them "అని కుండ బద్దలుకొట్టి నిజపరిస్థితి విడమర్చి చెప్పాడు శాస్త్రి. ఘనత వహించిన ప్రదానిగారూ మరో ముఖ్యవిషయం –ఇలాంటి కమిషన్లు ముఖ్యమైన కమిటీలు వేసి వారికి ముఖ్య బాధ్యతలు అప్పగించే టప్పుడు,ఈ సంవత్సరం చేసినట్లే నియమించండి మహాత్మాగాంధీని ఆయన అనుయాయులను ఆహ్వానించండి. ఆయనకు నిస్పృహకల్గించి మళ్ళీ నాన్ కోఆపరేషన్ ఉద్యమం చేబట్టే పరిస్థితి రాకుండా చూడండి "అని మైడెన్ స్పీచ్ ని ఎండేన్ గా ఇచ్చాడు. గాంధీకి శాస్త్రి ఏం విన్నవించాడో రేపు తెలుసుకొందాం.

## రెండవ కేప్ టౌన్ సమావేశం

బ్రిటిష్ ప్రధానిని వాయిన్చాకశ్రీనివాస శాస్త్రి మహాత్మా గాంధీని –"నిజమే మహాత్మా. ఇప్పుడు మీరు ఒక క్షణం నేను చెప్పింది ఆలకించండి మీకు అనంతమైన కీర్తి ప్రతిష్టలున్నాయి. మీ ప్రభావం అపారం. ప్రజలపై మీకున్న పట్టువారిని మీమాట వినేట్లు చేసే నేర్పు జగద్విదితం. ఈ అపూర్వ విశేషాలు నిర్మాణాత్మక పనులకు అడ్డమౌతాయా ?మిమ్మల్ని నమ్మి అవమానాల పాలౌతున్న ఆ అమాయక ప్రజలను నడిపించే హృదయం ఇంకా మీకు ఉందను కొంటున్నారా ?అది అవసరం కాకపోతే ఇక ఇప్పుడు అసలు అవసరం లేదని నేను గట్టిగా చెప్పదలచుకొన్నాను. ఈ బల్ల సాక్షిగా మేమంతా ఎంతో ఆలోచించి ముందుకు వెళ్ళే కొన్ని నిర్ణయాలు చేశాం. అవి మీరనుకొన్నట్లు మీకు సంతృప్త ఇవ్వక పోవచ్చు.. కానీ మీరు నేను,ఇక్కడ వారందరూ రాజ్యాంగాన్ని నిర్మిద్దాం. మనకు కావాల్సినవి అందులో చేరుద్దాం. భవిష్యత్తుపై ఆశతో ఈపని అందరం కలిసి చేసి సాధిద్దాం. పిల్గ్రిం ప్రోగ్రెస్ లో బన్యన్ –extreme suffering "అన్నట్లు దాన్ని తొలగిద్దాం.దాన్ని పెర్ఫెక్ట్ గా సమీప భవిష్యత్తులో మారుద్దాం. బ్రిటీష ప్రజలు సాధారనంగాతప్పులు చేస్తారు. ఒక్కోసారి తెలివి తక్కువ నిర్ణయాలు చేస్తారు అన్నమాట నిజమే. ఈ సుదీర్ఘకాలం లో వారంతా దారికొచ్చారు. మోడరేషన్,జస్టిస్ లకు ఆమోదానికి వచ్చారు. నా అనుభవం దృష్ట్యా ఇది మనకు

బంగారుకాలం వారు అభినంద నీయ భావనతో,మనసుతో ఉన్నా రిప్పుడు. ఇది వారిలో వచ్చిన గణనీయ మార్పు.. Take them now victory is ours. ’’అన్నాడు. శాస్త్రి.

రెండవ రౌండ టేబుల్ సమావేశం అవగానే శాస్త్రి లండన్ నుంచి కేప్ టౌన్ కు బయల్దేరి ఇండియన్ ప్రతినిధి బృందంతోకలిసి భారతప్రభుత్వం –సౌతాఫ్రికా ప్రభుత్వ రెండవ కేప్ టౌన్ సమావేశానికి జూన్ 1931వెళ్ళాడు.. గుండప్పకు ఈ విషయం రాస్తూ శాస్త్రి –”గుండ్రబల్ల అవగానే కొండలరావు తో కలిసి డిసెంబర్ లో దక్షిణాఫ్రికాకు వెళ్ళాలి. కేప్ టౌన్ అగ్రిమెంట్ నురెన్యు – కొనసాగించేట్లు చేయాలి. దానికి ఇండియన్ ప్రతినిధి వర్గం నన్ను చేర్చింది. ఈ ఒక్క పనిలో మాత్రం నన్ను ఎవరూ తప్పించలేక పోతున్నారు. అది నాకు మరో గౌరవం కాదా ?’’అని చెప్పాడు. నెలలు గడిచినా మత రాజీ పై ఆశలు సన్నగిలిపోతున్నాయి. ఈ స్థితిలోఅక్కడికి వెళ్ళటానికి శాస్త్రి కి ఎందుకో ఉత్సాహం లెదు. అక్టోబర్ రెండు న వెంకటరామ శాస్త్రికి రాసిన ఉత్తరంలో –బల్ల సమావేశంలో నా ఆశలు ఆవిరైపోగా,కేప్ టౌన్ సమావేశం కు నా మనసు పెట్టలేక పోతున్నాను. నేను వెళ్లనని తిరస్కరిస్తే ?మరికొన్ని రోజుల్లో నిర్ణయం తీసుకొంటాను “అన్నాడు. చివరికి వెళ్లాలనే నిర్ణయించు కొన్నాడు అతని అవసరం అలాంటిది అయింది.



ఇండియా ప్రతినిధి ఇక్కడికి రావటంలో రెండు విషయాలున్నాయి. మొదటిది 1927అగ్రిమెంట్ ను రెన్యు చేయటం. రెండవది ట్రాన్స్ వాల్ లో ఇండియన్ వ్యాపారస్తులపై ఉన్న తీవ్ర బెదిరింపులు. రెండవ దాని విషయంలో పబ్లిక్ ఒపినియన్,చట్టాలు ఇండియన్లకే కాక అన్ని రంగుల జాతులకు వ్యతిరేకంగా ఉన్నాయి. ఇక్కడి వీరికి ఆస్తులు సంపాదించటం నేరం. దీన్నే వాళ్ళు “రాండ్ “అనీ గోల్డ్ బెరింగ్ ఏరియా అనీ పిలుస్తారు. ఇక్కడ ప్రజాభిప్రాయం సాధించటం చాలా కష్టం. ఇన్ని ఉన్నా కొందరు భారతీయులు గణనీయంగా భూములు కొని సంపన్నులయ్యారు. రాండ్ లోని స్టాండ్ లను ఆక్రమించుకొని లాభసాటి వ్యాపారాలు చేస్తున్నారు. వీరి విజయాలను చూసి ముఖ్యంగా యూదులు అసూయ పడుతున్నారు. వీరేమన వాళ్లకు వ్యాపారం లో పోటీ దారులు. కనుక తరచుగా మనవాళ్ళు వాళ్ళ స్థానం ఆక్రమిస్తూ తమ వ్యాపారాన్ని దెబ్బ తీస్తున్నారని వాళ్ళ ఎకానమిని దెబ్బ తీస్తున్నారని ఆందోళన చేస్తుంటారు. మన వాళ్ళను అక్కడ తొలగిస్తే తప్ప తమ బ్రతుకు,వ్యాపారం ఆర్ధికం సాగదని గగ్గోలు పెడుతూ ఉంటారు. 1929లోనే శాస్త్రికి, సర్ కెవి రెడ్డికి తెలిశాయి ఇవి. శాస్త్రి సౌతాఫ్రికా అప్పుడు వదిలాక రెడ్డి “ఏజెంట్ జెనరల్ “అయ్యాడు. తర్వాత కాలం లో తెల్లవారు మరీ బరితెగించి ఇండియన్లు వాళ్ళ సంపద అంతా వదిలేసి వెళ్లిపోవాలని ఒత్తిడి ఎక్కువగా చేశారు. ప్రభుత్వం వారిపక్షమే కనుక విభజించి పాలించటం చేతనవునుకనుక “ట్రాన్స్ వాల్ ఏషియాటిక్ లాండ్ టేన్యూర్ ఏన్డేంట్ బిల్ “తెచ్చి వాళ్ళను జోకొట్టి మనకు మంట పెట్టింది. దీన్ని బట్టి నిషేధించిన ప్రదేశాలలో ఉన్న ఇండియన్లు అన్నీ వదిలి “స్పెషల్ లోకేషన్స్ “వెళ్లి స్థిరపడాలి. దీన్ని న్యాయబద్ధంగా ఇండియన్లు తిరస్కరించారు. ఇది పూర్తిగా కేప్ టౌన్ అగ్రిమెంట్ కు పూర్తీ విరుద్ధమ అన్యాయం అని గగ్గోలు పెట్టారు మనవాళ్ళు. ఇక్కడప్రభుతంమన బ్రిటిష ప్రభుత్వం అనేక సంప్రదింపులు జరిపాక ఆ బిల్లును ఇండియానుంచి వచ్చే ప్రతినిధి వర్గంతో చర్చించేదాకా బిల్లు వాయిదా వేస్తున్నట్లు దక్షిణాఫ్రికా ప్రభుత్వం చెప్పి కొంత ఊరట కలిగించింది. ప్రతి అయిదేళ్లకు ఆ అగ్రిమెంట్ రెన్యు చేయాలి,రౌండ టేబుల్ కాన్ఫరెన్స్ జరపాలి. ఇందులో ట్రాన్స్ వాల్ సమస్యకూడాచర్చకు రావాలి.

# అప్ లిఫ్ట్ క్లాజ్

రెండవ కేప్ టౌన్ కాన్ఫరెన్స్ కు ఇండియన్ డెలిగేషన్ కు గవర్నమెంట్ ఆఫ్ ఇండియా కు ఓవర్ సీస్ ఇన్ చార్జిసర్ ఫాజిల్ ఇ హుస్సేన్,జాఫ్రికార్బేట్,సర్ డార్సి లిండ్సే,సరోజిని నాయుడు కెవి రెడ్డి,శ్రీనివాస శాస్త్రి సభ్యులు. బి ఎస్ బాజ్ పాయ్ సెక్రెటరి.వీరి పని అత్యంత కష్టసాధ్యమైనది సౌతాఫ్రికాలోని కొందరు ఇండియన్లు మహాత్మాగాంధీ సమయంలో సహాయ నిరాకరణ లో పాల్గొన్న వారున్నారు. వీరుఅక్కడ ఇండియన్ లకు వ్యతిరేకమైనచట్టాలన్నీ రద్దు చేయాలని ఇంప్లీడ్ చేసినవారే. ఈపని సాధించలేక పోతే డెలిగేషన్ ను ఇండియాకు తిరిగి వెళ్ళిపొమ్మన్నారు. అక్కడి ప్రభుత్వమేమో వీళ్ళని ఉన్న చోట్లు ఖాళీచేసి స్పెషల్ లొకేషన్స్ కు వెళ్ళమని ఒత్తిడి చేస్తోంది. అక్కడి న్యాయమంత్రి'' పె''రు ఇండియన్ లకు పూర్తీ వ్యతిరేకంగా,శత్రువులా ఉన్నాడు. అసలు సమస్యపై పట్టుదలతో దుర్మార్గంగా వ్యవహరిస్తున్నాడు. ప్రభావం బాగా చూపుతున్నాడు. అదృష్టవశాత్తు ప్రధాని హెర్ట్ రోజ్,ఇంటీరియల్ మంత్రి, మన శస్త్రి ప్రభావం ఇరువైపులవారిపై అధికంగా ఉంది. పీతకష్టాలు పీతలవిలా అక్కడ ఎవరి కష్టాలు వారివి. శాస్త్రికి అక్కడి ఇండియన్ల కష్టాలు మనసుకుచాలా బాధ కలిగించి అత్యంత సానుభూతితో ఉన్నాడు. ఇండియన్ల ఆస్తి యాజమాన్యం వ్యాపారం ముఖ్యంగా పరిష్కరించి మనవారికి ఊరట కలిగించాలి. ఇండియన్లకు అనుకూలంగా ఏదైనా చట్టం తెస్తే పార్లమెంట్ ఆమోదిస్తుందనే గ్యారంటి లేదని ఇండియన్ డెలిగేషన్ వారు చెప్పారు,కనుక రెడ్రేస్ అంటే విరుగుడు పాలనా విధానంలో ఆలోచించాలి,సాధించాలి. అనుకోకుండా ఒకప్రోసీజర్ దొరికింది. మైనింగ్ కమీషనర్ ఇండియన్ లకు అనుకూలంగా,ప్రస్తుతం వారు ఉంటున్న స్థలాలో ఉండ వచ్చునని,భావిష్యత్తులోకూడా వారికి అనుకూలంగా ఆర్డర్లు ఇవ్వవచ్చునని అనుకొన్నారు. అక్కడి మన వాళ్లకు ఇది ఇష్టం కాకపోవచ్చుఎందుకంటే కమీషనర్ దయా దాక్షిణ్యాల పై ఇదంతా ఆధార పడి ఉంటుంది. ప్రస్తుత పరిస్థితులలో ఇంతకంటే మంచి పరిష్కారం సాధ్యం అయ్యేట్లు లేదుకనుక దీన్ని మన డెలిగేషన్ ఆమోదించింది.




అలాగే కేప్ టౌన్ అగ్రిమెంట్ రెన్యు విషయంలో కూడా చిక్కులున్నాయి..భారతీయ బృందం "అప్ లిఫ్ట్ క్లాజ్ " కు అధిక విలువనిచ్చింది. దీనిప్రకారం ప్రభుత్వం ఇండియన్ లను తమ వారితో సమానంగా గౌరవిస్తూ,విద్య మొదలైన విషయాలలో వారి అభ్యున్నతికి అన్నివిధాల చర్యలు తప్పక తీసుకోవాలి. ఇందులో తెల్లవారికి స్వదేశానికి అపంపటం అనే –రిపాట్రి ఏషన్ ఉన్నది.దీనిప్రకారం ఇక్కడ సాయమొందుతున్న ఇండియన్లు స్వదేశానికి వెళ్లిపోవాలి వారి పట్టుదల దీనిమీదనే పెట్టారు. మొదటి మూడేళ్ళు ఈ స్కీం బాగానే పని చేసింది. చివరి రెండేళ్లలో ఇండియాకు వెళ్ళే వారి సంఖ్య బాగా తగ్గిపోయింది. మొదటి దశలో ఇండియాలో పుట్టిన వారుకానీ,లేక ఇండియాతో ఎక్కువ సంబంధాలున్నవారుకానీ చాలా తక్కువమంది మాత్రమె వెళ్ళిపోయారు. ఇక్కడికి వచ్చిన వారు ఇక్కడ పరిస్థితులు ఆశాజనకంగా ఉన్నాయని ఎవరూ రిపోర్ట్ ఇవ్వలేదు. కనుక ఇక్కడి వారిని త్వరగా ఇండియా పంపిస్తే తప్ప అగ్రిమెంట్ రెన్యువల్ సాధ్యం కాదని తెల్లవారు పట్టు బట్టారు. దీని నుంచి బయట పడటానికి ఈ డెలిగేషన్ ఒక

పరిష్కారం ఆలోచించింది. వాళ్ళను ఇండియా నే కాకుండా బ్రెజిల్ బ్రిటీష్ గయానా టాంగ్జన్యికా మొదలైన ఇతర దేశాలకు పంపించటం అనే క్లాజ్ పెట్టింది.ఇండియన్లు ఆమోదించటానికి వీలుగా "కాలని జేషన్"అనే పదం చేర్చింది. ఇందరి ఇన్ని ప్రయత్నాలవలన రెన్యువల్ జరిగింది,ఒనర్షిప్ హక్కు లభించి ఒకరకంగా అందరికి సంతృప్తినిచ్చింది.

## మూడవ రౌ.టే. కా.మరియు శ్వేత పత్రం

బ్రతికి ఉన్నంతకాలం శ్రీనివాస శాస్త్రి దక్షిణాఫ్రికాలోని ఇండియన్ల గురించి,వారికి చేజారిపోతున్న అవకాశాలగురించితరచుగా జరిగే జాతులమధ్య తీవ్ర పోరాటాల గురించి ఆలోచిస్తూనే ఉన్నాడు. 1943లో దక్షిణాఫ్రికా ప్రభుత్వం ఫీల్డ్ మార్షల్ స్మట్స్ తెచ్చిన విపరీతమైన బిల్లు వల్ల ట్రాన్స్ వాల్ నుంచి డర్బన్ నటాల్ వరకు ఉన్న ఇండియన్ల ఒనర్శిప్ లలో ఎదుర్కొన్న పరిస్థితి దారుణం.శాస్త్రి,పూర్వపు ఏజెంట్ జనరల్స్ మహారాజా సింగ్,రాజా ఆలి లు స్మట్స్ కు ఒక అపీల్ పంపారు –"ప్రస్తుత ప్రపంచ సంఘర్షణ లో మిమ్మల్ని ఇండియా సీనియర్ మోస్ట్ బ్రిటిష స్టేట్స్ మన్ గా బావిస్తోంది. కనుక పెండింగ్ లో ఉన్న ఆబిల్లు ను ఉపసంహరించండి. నటాల్ ఇండియన్ల సమస్య ట్రాన్స్ వాల్ వాళ్ళ సమస్యకంటే భిన్నమైనది. 1939 మధ్యంతర చట్టం నటాల్ దాకా వర్తించదు. మీకున్న కష్టాలు మాకు తెలిసినా ఆ బిల్లు ఆమోదం పొందితే బ్రిటిష కామన్ వెల్త్ లో ఉన్న ఇండియా,ఇక్కడి ఇండియన్ల ఆశలు ఆవిరి అయిపోతాయి వారి భవిష్యత్తు చెల్లా చెదరై పోతుంది. సౌతాఫ్రికా మిత్రులముగా యుద్ధం తర్వాత ఒక సమావేశం ఏర్పాటు చేయండి "కా నీ అక్కడి ఇండియన్ల దురదృష్టం వెన్నాడుతూనే ఉంది. రంగు వ్యతిరేకత మానవ హక్కుల మూలస్వభావానికే విరుద్ధం అన్నాడు శాస్త్రి. కనుక ఈ జాతి వ్యతిరేకతను నానాజాతి సమితి దృష్టికి తీసుకు వెళ్ళాలి. 1946లో ఈ సమస్య ఐక్యరాజ్యసమితిలో చర్చకు వస్తే స్మట్స్ దక్షిణాఫ్రికాను సమర్ధించాడు. అప్పుడు దాదాపు జీవిత చరమాంకంలో ఉన్న శాస్త్రి హృదయాలను కదిలించే ఒక ప్రకటన చేశాడు. -"స్మట్స్ బహు విధ వేషాలు క్రూర నియంత్రణ ను అందరూ ఎండగట్టాలి అతడి ఒంటెద్దు పోకడ బహిర్గతం చేయాలి –"not only by the in habitants of British Isles but by all that progressive and up-ward looking in the world "అంటూ ఆవేదన చెందాడు.



1932 ఫిబ్రవరి చివరలో శ్రీనివాస శాస్త్రి ఇండియాకు తిరిగి వచ్చాడు. మహాత్ముడు యరవాడ జైలు లో ఉన్నాడు. ఆయన్నుకలిసి విషయాలు చెబుదామనుకొంటే కుదరలేదు అందుకని. ఏప్రిల్ లో మద్రాస్ కార్పోరేషన్ శాస్త్రిికి కెవి రెడ్డికి సన్మానం చేసినప్పుడు శాస్త్రి –"కొన్ని పనులు చక్కబెట్టి దక్షిణాఫ్రికా నుంచి వచ్చాను. రెండు సార్లు నా సహచరులు ఇండియా రాగానే మహాత్మాను కలిసి అక్కడి విషయాలు

చెప్పమని ఉద్బోధ చేశారు. ఆయన ఒప్పుకుంటే మేము ధన్యులం. ఆయన  నాకు మహా ఆరాధనీయుడు. ఆయనకు చెప్పకుండా నేను అక్కడి విషయాలు పబ్లిక్ కాని ప్రభుత్వానికి కాని చెప్పాలనుకోవటం లేదు. ఆయన సౌతాఫ్రికాలో చేసినాద్భుతాలు అందరికి తెలుసు. ఆయన్ను చూడ లేకపోతున్నందుకు నేను ఎంత తపించి పోతున్నానో నాకు తెలుసు "అన్నాడు

సహాయ నిరాకరణ మళ్ళీ మొదలు పెట్టటం శాస్త్రి వ్యతిరేకించాడు. గాంధీని ఎన్నో విధాలుగా ఉద్యమం మళ్ళీ మొదలు పెట్ట వద్దని నచ్చ చెప్పే ప్రయత్నం చేశాడు. చివరగా –"not to go back to the "arid(శుష్క ) fields of non – cooperation''అన్నాడు. ప్రభుత్వం పాటిస్తున్న కాఠిన్యాన్ని క్రూరత్వాన్నీ ఎండగట్టాడుకూడా. ప్రైం మినిస్టర్ రామ్సే మాక్ డోనాల్డ్ కు రెండు ఉత్తరాలు రాశాడు శాస్త్రి. అందులో పోలీసుల అనుష చర్యలను ఖండిస్తూ ఫెడరేషన్ విషయం వాయిదా వేయటం ఇండియా బంగారు భవిష్యత్తుకు విఘాతం అన్నాడు –"speed up speed up. The slowest machinery in the world is the Government of India reforming itself. Ordinances and lathis can only have a short day. during that short day the new order must be brought into being'' అని ఘాటుగా మసాలా దట్టించి రాశాడు

1932 ప్రారంభం లో బ్రతిష్ ప్రభుత్వం ఇండియాకు మూడు స్పెషల్ ఎంక్వైరీ కమిటీలు పంపింది. అందులో ఒకటి స్వాతంత్రం కోసం,రెండవది ఫెడరల్ నిర్మాణం ఫెడరల్ యూనిట్లమమధ్య  ఆర్ధికవిదానాలు.మూడవది. ఫెడరేషన్ లో రాజ సంస్థానాల ఆర్ధిక విషయాలు. 1932  జూన్ 27న హౌస్ ఆఫ్ కామన్స్ లో శామ్యుల్ హోర్స్ ఒక ప్రకటన చేస్తూ రౌండ టేబుల్ పద్ధతిని పూర్తిగా మార్చేస్తూ కొత్తప్లాన్ గా సలహా సంఘాలను నియమిస్తున్నామని,తర్వాత చర్చలు లండన్ లో జరగటానికి ఒక కమిటిని ఏర్పాటు చేయబోతున్నామని "చెప్పాడు. ఈ కొత్త ప్లాన్ పై ఇండియాలో తీవ్ర వ్యతిరేకత వచ్చేసింది. ఆ కమిటీలో సభ్యులైన సప్రూ జయకర్ లు నిరసనగా రాజీనామా చేసి వైస్రాయ్ కి పంపారు. ఇండియాకు తీవ్రని ఆఘాతం జరిగిందని శాస్త్రి బాధ పడ్డాడు. కోదండ రావు కు జాబురాస్తూ –" అంతా అయిపొయింది. డొమినియన్ స్టేటస్ కు దారి మూసుకుపోయింది "అన్నాడు అభివృద్ధి కోరేవారంతా సప్రూ జయకర్ లను అనుసరించాలన్నాడు. లిబరల్ నాన్ కో ఆపరేషన్ ను మాత్రం సమర్ధించాడు. కొత్తప్లాన్ ను తిరస్కరిస్తూ మొదటి సంతకం పెట్టి ఇలా రాశాడు శాస్త్రి –"ప్రస్తుత పరిస్తితులలో తర్వాత చర్చలకు మన అందరి సహకారం కావాలి ".ఆయన చెప్పిన లిబరల్ కో ఆపరేషన్ సత్ఫలితమిచ్చి రౌండ్ టేబుల్ ను ప్రభుత్వం పునరుద్ధరించింది.

## ప్రోవిన్షియల్ అటానమి

శాస్త్రిరాసిన ఒక ఉత్తరం లో –'ఈ  ఆఫీసులో ముఖ్యమైన ఆకర్షణ,సామాన్య ప్రజల దృష్టిలో తేలిక,సుఖవంతమైన గౌరవం. నవంబర్ లోవిల్లింగ్టన్ శాస్త్రికి  రాసిన  జాబులో –"మా మేనేజింగ్ కమిటీ అందులోని మెంబర్ ను చేర్చటానికి తీసెయ్యతానికి అధికారం పూర్తిగా ఉంది. వచ్చే సమావేశంలో మీ భావాలేమితో స్పష్టంగా చెప్పమని నిర్మోహమాటంగా

అడుగుతున్నాను,నేనూ మీ ఆరోగ్య విషయం లో ఆందోళనగా ఉన్నాం. అదీకాక ఇంకాప్రభావ శీలురను చేర్చుకొని వారిద్వారా సలహాలు పొందాలని అనుకొంటున్నాం. ఆ సమావేశానికి రెండు వారాలముందే మీరు,రామస్వామి గారు ఇక్కడికి వచ్చి మీ సలహాలివ్వండి. మీరు ఉంటే నాకు దండి. మీ అభిప్రాయం ఏమిటో తెలియజేయండి "విల్లీ తనకు కావాల్సిందే నేర్పుగా చేసేశాడు. దీనికి శాస్త్రి సూటిగా –"నాకు తెలిసిన సమాచారం ప్రకారం మెంబర్ల ఫైనల్ లిస్టు తయారైపోయింది. సభ్యుల సంఖ్య గణనీయంగా తగ్గించటానికి మీరు నిర్ణయించారుకనుక నాకు స్థానం కల్పించటం మీకు అసాధ్యమౌతుంది. నేను నిరాశపడిన మాట వాస్తవమే.న దేశానికి సేవ చేయాలనే నేను అనుకొంటున్నాను. నా ఆరోగ్యమూ బలహీనంగానే ఉంది. ఇంగ్లీష్ వాతావరణలో కొంత కుదుట పడవచ్చు. భగవంతుడు ఎవరి చేత ఎలాంటి సేవ చేయిస్తాడో ఎవరమూ ఊహించలేము "అన్నాడు. వైస్రాయ్ కి రాస్తూఆయన కోరితే సహాయ పడటానికి సిద్ధమే,ఈసంక్లిష్ట సున్నితమైన విషయంపై కొన్ని నియమాలకు కట్టుబడి ఉన్న గాంధీతో ఒకపరిష్కారానికి ప్రయత్నం చేసి ఒప్పిస్తాను. ''అన్నాడు

టోరి ప్రభుత్వం శాస్త్రి చింతామణి సేతల్వాడ్ బికనీర్ భోపాల్ మహారాజు మొదలైన వారిని వారు మొండిఘటాలని తమమాట వినరని కావాలనే లిస్టు లో తప్పించింది.చిక్కడు దొరకడు అయిన జిన్నాను తప్పించింది, ఇంగ్లాండ్ లోని ప్రోగ్రెసివ్ వ్యక్తులకు శాస్త్రిని తప్పించటం నచ్చక నిరాశ చెందారు. 14-10-1931మాంచెస్టర్ గార్డియన్ పత్రిక దీనిపై స్పందించి –"ఇది ఇంగ్లండ్లోని అనేకులకు లిబరల్స్ కు చాలా కలవరపరచే విషయం. 'His wisdom and suavity (సునిశిత్వం )not to speak of his unsurpassed eloquence have been so great a part of previous Round Table Conferences "అని శాస్త్రి రాక ఎంత అవసరమో చెప్పింది. సెలెక్ట్ కమిటి ఆఫ్ పార్లమెంట్ ముందు శాస్త్రి సాక్ష్యంచెప్పటానికి లండన్ కు ఆహ్వానించ కపోవటం పై దిస్పెక్టేటర్ పత్రిక 28-4-1933 న –"శాస్త్రిని ఎందుకు ఇండియన్ లిస్టు లోనుంచి తప్పించారో కారణం చెప్పాలి. పద్నాలుగు ఏళ్ళ క్రితం మాంటేగ్ ను ప్రపోజల్స్ పై డ్రాఫ్ట్ తయారు చేస్తుంటే నేను అడిగాను –"What Indian public man he regarded as the ablest and most effective co-operator with this country ?''Sastri "he said without a moment's hesitation. There is no man in all India whose counsel and cooperation the select committee would seek with greater advantage. Mr.Sastri had been assiduously and successfully husbanding his strength to enable him to discharge what might have been the crowning task of his long career of public service. It is both foolish and unjust thus to disregard him "అని ప్తభుత్వానికి గడ్డిపెట్టింది




మూడవ గుండ్ర బల్ల సమావేశ వాతావరణం ఆశను హత్య చేసి కఠినంగా కన్జర్వేటివ్ గా మారిపోయింది. కన్జర్వేటివ్ ప్రభుత్వం వెంటనే ఇచ్చే ప్రోవిన్షియల్ అటానమి ని దూరం పెట్టి ఫెడరేషన్ ను వాయిదా

వేసే ఆలోచనలో ఉంది. ఇండియా మహారాజులు ఫెడరేషన్ ను సమర్ధిస్తున్నారు. తేజ బహదూర్ సప్రూ ఇలాంటి ప్రగతి వ్యతిరేకులపై విరుచుకు పడ్డాడు. అత్యవసరంగా ఫెడరేషన్ ఏర్పాటు చేసి రాజులకు ప్రత్యేక రాజ్యాంగ కల్పించామన్నాడు. 1933 లో శాస్త్రి గాంధీ తో నిత్యం సంబంధం తో ఉన్నాడు. సహాయనిరాకరణ ఆపమని కోరుతూనే ఉన్నాడు. గాంధి పూనాలోని యరవాడ జైలులో ఉన్నాడు పూనా సర్వెంట్స్ ఆఫ్ ఇండియాకు కేంద్రస్థానం కనుక మహాత్ముని కలవటం తేలిక. 22-6-1933 శాస్త్రి వెంకటరామ శాస్త్రికి జాబురాస్తూ –"ఇవాళమహాత్ముడు చాలా సేపునాతో మాట్లాడారు. మహాదేవ దేశాయ్ అతని మేనల్లుడు కూడా ఉన్నారు. రెండు వారాలలో విల్లింగ్టన్ కు తానూ లెటర్ రాస్తానని,హోర్స్,ఇర్విన్ లను అతనికి సరైనా సలహా ఇవ్వమని  చెప్పమని నాకు చెప్పారు. విల్లింగ్టన్ పూర్తిగా తిరస్కరించక పోవచ్చు. ఈ విషయం రహస్యంగా ఉంచు మహాత్ముడు క్రమంగా కోలుకొంటున్నారు "అని తెలియజేశాడు శాస్త్రి. అదే రోజు శాస్త్రి శామ్యుల్ హోర్స్ కు జాబురాశాడు  -"మహాత్ముడు కోలుకొంటున్నారు ఆరోగ్యం కుదుట బడ్డాక  వైశ్రాయికతో ఇంటర్వ్యూ కోసం  ఉత్తరం రాస్తారు.సమాధానం బహుశానిరాశ కలిగిస్తుందేమో నని భయంగా ఉంది. అలా జరిగితే దురదృష్టమే. ఇంటర్వ్యూ జరిగితుందరికి మంచి జరుగుతుందని నమ్ముతున్నాం. ఇప్పుడున్న ప్రత్యేక క్లిష్ట అస్పష్ట పరిస్థితులలో గాంధీ –వైస్రాయ్ ల సమావేశం పూర్తీ స్వేచ్చావాతావరాణంన్ తో జరిగితే తర్వాత ఆమోదయోగ్యమైన సెటిల్ మెంట్ జరిగే వీలుంటుంది. ''అనిరాశాడు

## శామ్యుల్ హోర్స్

శామ్యుల్ హోర్స్ కున్న కష్టాలు పెద్దవే ముఖ్యంగా చర్చిల్ టో  కరడుకట్టిన కన్జర్వేటివ్ లతో. రౌండ్ టేబుల్ విషయాలు శాస్త్రికి తెలియజేస్తూ,ఇన్ని అవాంతర పరిస్థితుల్లో కూడా హోర్స్ ఎంత బాగా సహకరించాడో తెలియజేశారు. చివరికి హోర్స్ బాగా మెత్తపడ్డాడు.. అయిదు వారాల సమావేశంలో ఈ సభ పూర్తయింది. 1933జనవరిలో సభ్యులు ఇండియా తిరిగి వచ్చి ఆశావహంగా ఉన్నారు. మార్చిలో ఇండియా ప్రభుత్వం ఆ విషయాలను భారత రాజ్యాంగ సంస్కరణ లలో  చేర్చించి వైట్ పేపర్ గా  పార్లమెంట్ లో ప్రవేశపెట్టింది. శాస్త్రి అందులోని ప్రతివిషయాన్నీ దుర్భిణీ వేసి చూసి నట్లు చదివి చూశాడు. అందులోని లోపాలు చెప్పి సవరణలను తెలియజేశాడు. కోదండ రావు కు రాసిన ఉత్తరం లో –"శ్వేతపత్రం కొద్దిగా ఆశ కల్పించింది. మొత్తం మీద ప్రజాస్వామ్య విరుద్ధంగా,ఇండియాను బలహీన పరచేదిగా,అనైక్యంగా,పని చేయటానికి వీలు లేకుండా తోలు  బొమ్మలాటగా త్రాళ్ళు అన్నీ బ్రిటిష్ వారి చేతుల్లో ఉన్నట్లుగా ఉంది. ఇది భవిష్యత్తులో మార్పు చెందదు అని అనలేను. తప్పనిసరిగా మారాల్సిందే. అందులో సిద్ధాన్తాలబట్టి కాదు. సంస్కరణ శక్తి బయటి నుంచే రావాలి. ఈ స్కీం ను ఆపగలిగితే ?తప్పక ఆపగలను. నేను గాంధి నెహ్రు కాంగ్రెస్ అందరం కలిసి పని చేస్తేనే అది ఆగుతుంది "అని రాశాడు.

హోర్స్ ప్రవేశపెట్టిన తంతుపై శాస్త్రి బయటనుంచే గమనిస్తున్నాడు. ఎంతటి అవగాహనతో అతడు ఉన్నాడో ఎలాంటి చిక్కుప్రశ్నలకినా ఎలా తడుముకోకుండా సమాధానాలు చెబుతున్నాడో  భారతీయులబాదాలు కష్టాలపై ఎంతటి సానుభూతి ఉందొ అర్ధమైంది. ఒకరకంగా చర్చిల్ టో అతడు ద్వంద్వ యుద్ధమే చేశాడు అనిపించింది. అందులో సేఫ్ గార్డ్స్ చాలా

ఉన్నా,అందులో చాలా ఇండియాకు వ్యతిరేకమైనా,అతడి పోరాటపతతిమ మెచ్చదగింది అనిపించింది. ఆర్ధిక రక్షణ విషయాలలో ఇండియల్ కంట్రోల్ చాలా తక్కువ. గవర్నర్ జనరల్కు గవర్నర్ లకు విస్తృత విశేష అధికారాలిచ్చారు. రాజుల సమాఖ్య ఇచ్చే సూచనను బట్టి,వాళ్ళ అధికారాలు ఇవ్వ బడుతాయి. అన్నిటికంటే "డొమినియన్ స్టేటస్ పై చెప్పటానికి సిగ్గు ముంచుకొచ్చింది అనిపించింది. అతని అభిప్రాయంలో –"There is no standing still,if places are not filled,by the right men,they will be filled by wrong men ".శాస్త్రి గాంధీతో కాంగ్రెస్ ను ఒక కొత్త సిద్ధాంతం ఆలోచించమని చెప్పాడు-"Aiming at constructive national good in legislation,finance and administration''.సెప్టెంబర్ నాలుగున మహాత్మునికి రాసిన లేఖలో –""'Victory or nothing''అనేది యుద్ధ నినాదంఆ రోజు పోతే దానికి అర్ధమే ఉండదు. చట్ట సభలు ఉన్న చోట మనకు కావాల్సిన చట్టాలు తెచ్చుకోవచ్చు. సరైన బలమైన ప్రతిపక్షం ఉంటే అన్యాయం జరగకుండా చూసుకో వచ్చు –"It is first rate to the government. Bacon said we must have our hands constantly in affairs,and he is the man of the world ".ఆఉత్తరం లోనే. కాంగ్రెస్,లిబరల్స్ అందరూ కలిసి బృహత్ పార్టీ గా మారి భవిష్యత్ జాతి సంక్షేమం ప్రగతి ఆలోచించాలి. ఇది ఇప్పటికిప్పుడు జరిగే పనికాకపోతే ఆ పార్టీలు అన్నీ తమ అస్తిత్వాలను కాపాడుకొంటూ సహాయ సహకారాలు అందించుకొంటూ దేశాన్ని పూర్తిగా పట్టించుకోవాలి "అన్నాడు.

1934 జనవరిలో శాస్త్రి'' వైట్ పేపర్ కాన్సి ట్యూషన్ "పై రెండు ప్రసంగాలుమైలాపూర్లోని రానడే హాల్ లో చేశాడు. దాని దోషాలు కడిగేస్తూనే కాంగ్రెస్ ను,ఇతర ప్రగతి శీలక పార్టీలను శాసన సభలను ఆక్రమించి రాజ్యాంగం కోసం పనిచేయమన్నాడు. రాజ్యాంగం నిర్దుష్టంగా లేకపోతే,ప్రజల బాధ్యతా చాలా పెరుగుతుంది. నా విధి నాకు తెలిస్తే కళ్ళు మూసుకొని కూర్చోలేను. నా చేతులు ముడుచుకోనప్పుడు,నా బుద్ధిని మూసుకోమన్నప్పుడు,పని చేయించనప్పుడు నాకు ఉన్నవాటిలో మంచేదో,ఏది క్రియాశీలకమో,,ఏది అత్యంత సామర్ధ్యం కలదో దాన్ని ఎంచుకొంటాను ".దేశంలోని వివేక వంతుల్ని ప్రత్యక్ష రాజకీయాలకు పరిపాలనా విధానానికి దూరంగా ఉండవద్దు అని హెచ్చరించాడు.పబ్లిక్ అఫైర్స్ ను ఒక విషయగా అధ్యయనం చేయాలి. సమర్ధులు దూరంగా ఉంటే సమర్ధమైన పాలన ప్రజలకు అందదు. వారి కష్టాలు బాధలు పెరిగిపోయి దేశ ప్రగతిఆగిపోతుంది "అనిహితవు చెప్పాడు.

1934జూన్ లో శ్రీనివాస శాస్త్రి భార్య లక్ష్మి మరణించి ఒంటరి వాడిని చేసి వెళ్ళిపోయింది. ఈ విషయం తన ముఖ్యుడైన కృష్ణస్వామి అయ్యర్ కు తెలియజేస్తూ శాస్త్రి –"ఇవాల్టికి ఆరు రోజు లైంది ఆమె లేకుండా కాలం గడపుతూ. ఆమె పేరును నా జీవితంలో ఒక్క సారి మాత్రమె పలికానేమో. ఇప్పుడు రోజుకు పది వేల సార్లు పిలవాల్సి వస్తోంది "అన్నాడు. ఆమె అనురాగం త్యాగం అవగాహన చాలా ఉత్కృష్టం అన్నాడు. ఆమెకు నాపై పగలేదు నాకు హాని చేయనేలేదు. మా దాంపత్యం అన్యోన్యం గానే గడిచింది. మా బంధువులు స్నేహితులు ఆమెను చాలా గౌరవిస్తారు. ఆమె సలహాలు ఆలోచనలు నాకు స్పూర్తి నిచ్చేవి. ఆమె నిర్ణయాలు బహు గొప్పవి.. ఆమె కుమార్తె మనుమలు మనవరాళ్ళు ఆమెను అత్యధికంగా ప్రేమిస్తారు. నన్ను దైవంగా భావిస్తుంది. ఒక్కోసారి నన్ను న్యాయంగా,క్షమతో ఉండమని హితవు చెబుతుంది. నాకు నా పేరుకు ఎలాంటి విఘాతం కలగకుండా ప్రవర్తించి నన్ను ముందు నిలబెడుతుంది. ఆమె చాలామంచిది ఉదాత్తమైనది. ఇక ఇప్పుడు ఆమె స్మృతులు నన్ను సరైన దారిలో నడిపించాలని కోరుకొంటున్నాను "అన్నాడు.

# అన్నామలై యూనివర్సిటి వైస్ చాన్సలర్-

రైటానరబుల్ శ్రీనివాస శాస్త్రి

భార్య చనిపోవటం వయసు పెరగటం ఆరోగ్యం తగ్గటం శ్రీని వాస శాస్త్రిని తను బాగా ఇష్టపడేబెంగులూరు లో స్థిర పడేట్లు చేశాయి. అక్కడి వాతావరం ముఖ్య స్నేహితుడు గుండప్ప సహకారం ఆయనకు బాగా తోడ్పడ్డాయి. మైసూర్ యూని వర్సిటి ఎక్స్టేన్షన్ లెక్చర్స్ గోఖలే పై ఇవ్వటానికి సిద్ధపడ్డాడు. 1935 జనవరిలో రెండు బెంగుళూర్ లో ఒకటి మైసూర్ లో ఇచ్చాడు. కమల లెక్చర్స్ లాగానే ఇవి కూడా మంచి విజయాన్నిచ్చాయి. వీటిపై శాస్త్రి ఒక స్నేహితుడికి జాబు రాసి –"ఇక్కడ గోఖలే పై ట్రయాలజి ఉపన్యాసాలు ఇవాళే పూర్తీ చేశాను. ఒక్కోటి గంటన్నర ఉపన్యాసం. ప్రేక్షకులు మూడు వేలనుంచి అయిదు వేలవరకు ఉన్నారు. వారి దృష్టిని బాగా ఆకర్షించగలిగాను. బాగా మెచ్చుకొన్నారు గర్వంగా ఉన్దినాకు,చేతిలో కాగితం ముక్కకూడా లెదు. వైస్ చాన్సలర్ నిశ్చేష్టుడయ్యాడు. నాగురించి మూడు నిమిషాలు రాసుకొచ్చింది చదివి మెచ్చాడు. నా ప్రసంగాలు" Tour de force 'అంటే అత్యద్భుతం అన్నాడు. నాకు బాధ కాని అలసట కాని రాకపోవటం నాకే ఆశ్చర్యమేసింది. నేను నా పితృ కార్యాన్ని పరమ పవిత్రంగా చేస్తున్నట్లు అందుకే ఎలాంటి జబ్బు లేక రోగనిరోధకం గా ఉందనిపించింది "అని రాశాడు. గోఖలే ఆత్మ శాస్త్రిలో ప్రవేశించి ప్రభావితం చేసి ఉందేమో తాదాత్మ్యంతో అంకితభావంతో గౌరవంతో పరవశంతో మాట్లాడిన మాటలవి. అందుకే అంత శక్తివంతాలయ్యాయి. హాయిగా ప్రశాంతంగా జీవితం గడపాలని అనుకొన్నాడు బెంగుళూరులో.

శాస్త్రి స్నేహితుడు అభిమాని ఆరాధకుడు రాజా అన్నామలై చెట్టియార్ శాస్త్రిని అన్నామలై యూని వర్సిటి వైస్ చాన్సలర్ పదవి స్వీకరించమని బాగా బలవంతం చేశాడు. 1929లోనే శాస్త్రిని మొట్టమొదటి వైస్ చాన్సలర్ గా నియమించాడు అన్నామలై. అప్పుడు కెన్యాకు డిప్యుటేషన్ పై వెళ్ళాల్సి వచ్చి చేరలేక పోయాడు,ఇప్పుడు మళ్ళీ 1935 ఆహ్వానించాడు రాజా అన్నామలై. ఏమీఆలోచించ కుండా ఒప్పుకున్నాడు. గౌరవ వేతనమే తీసుకొన్నాడు. స్కేలు ఆర్భాటం ఒప్పుకోలేదు. పొంగిపోయాడు అన్నామలై. వైస్ చాన్సలర్ గా నిర్వహణ బాధ్యతమాత్రమే కాకతనకు అత్యంత ప్రియమైన ఇష్టమైన బోధన కూడా చేశాడు శాస్త్రి. ప్రపంచంలో చలాదేశాలలో తిరిగి సంపాదించిన జ్ఞాన విజ్ఞానాలు తన విద్యార్ధులకు అందజేయలన్నదే ఆయన తపన. ప్రోచాన్సలర్ అయిన రాజా అన్నామలై శాస్త్రిపై అత్యంత విశ్వాసం చూపాడు ఆయన నిబద్ధతకు ఫిదా అయిపోయాడు. మొదటి మూడేళ్లలో మొదటిఏదాది పూర్తవగానే శాస్త్రి అన్నామలైకు కృతజ్ఞతను అత్యంత గౌరవంగా ఇలా తెలియజేశాడు –"మీరు నాపై పూర్తీ విశ్వాసం ఉంచారు. నా నిర్ణయాలను గౌరవించారు నా రికమండేషన్లు ఏమాత్రం తాత్సారం లేకుండా ఆమోదించారు. మనమధ్య కాంప్లెక్స్ అనేది లెదు. సౌతాఫ్రికాలో లార్డ్ ఇర్విన్,సర్ మహమ్మద్ హబిబుల్లాల మధ్య నేను సౌతాఫ్రికా ఏజెంట్ గా పని చేసిన ఆనందం పొందానుఇక్కడ. "You are one of the few people who can,when they choose,treat their agent as though he were not a receiver,but a conferrer,of favour ".వీటన్నిటికంటే మీ వ్యక్తిత్వం,ప్రవర్తన సరికొత్త విధానంగా ఉంది నాకు. మీ గ్రహణ శీలత గొప్పది. ఇవన్నీ నన్ను మాట్లాడనీయకుండా,మరింత కృతజ్ఞునిగా అనుమాన రహితుని చేశాయి. అత్యంత గౌరవం నాకిక్కడ మీసమక్షంలో లభించి

గొప్ప సంతృప్తి నిచ్చింది. వైస్ చాన్సలర్ అంటే ఈ బిల్డింగులు ఈ సౌకర్యాలు స్టాఫ్ స్టూడెంట్స్ మాత్రమేకాదు అంతకన్నా పరమ పవిత్రమైంది. దీన్ని వదిలేసి నేను వెడితే ఎంతటి ఒంటరి వాడిగా మిగిలిపోతానో ఆలోచిస్తే భయమేస్తోంది "అని రాశాడు. శాస్త్రిని రాజా మరొక టరం కొనసాగించమని కోరాడు శాస్త్రి ఆనందంగా ఒప్పుకొని పని చేశాడు.

1936లో శాస్త్రి ప్రభుత్వ ఏకైక డెలిగేట్ గా మలయాకు అక్కడి ఇండియన్ లేబర్ పరిస్థితులు విచారించటానికి వెళ్లాల్సి వచ్చి,అనామలై యూనివర్శిటికి దూరం ఉండాల్సి వచ్చింది. సర్వెంట్స్ ఆఫ్ ఇండియాకు అనుమతికోసం ఉత్తరం రాస్తూ శాస్త్రి –"నేను వెళ్ళే పని కష్టమైనదో తతేలికవ్యవహారమో నాకు తెలియదు. నా గౌరవానికి సరిపోయేదో లేక కించ పరచేదో కూడా తెలియదు. ఏమైనా దేశ ప్రజల మంచికోసం వెడుతున్నా నాతోపాటు నా కుమారుడిని సహాయంగా సెక్రెటరి హోదాలో పంపమని కోరుతున్నాను. చర్చలులేకుండా నేను వెళ్ళటానికే నిశ్చయించుకొన్నాను. అది నాకు అగౌరవం కాదు,నా స్వార్ధానికి కాదు మతపరైనది జాతివ్యతిరేకమైనదీ కాదు. It is the service of our people. My personal rank or dignity is irrelevant ".అని చెప్పాడు.

1936 జనవరి మొదట్లో రంగూన్ చేరాడు శాస్త్రి. ఒక ప్రైవేట్ లెటర్ లో 'నాశక్తి నాకు ఆశ్చర్యం కలిగిస్తోంది. బాధ,ఉత్సాహాలతో నాపని నేను చేసుకుపోతున్నాను. దైవేచ్చ ఎలా ఉందొ ?"'.30రబ్బర్ ఎస్టేట్ లను చూసి,అక్కడి లేబర్ పరిస్థితి సంతృప్తిగానే గానే ఉందని మలేషి యాకు ఇండియన్ లేబర్ ను జీతాలుపెంచుతూ ఎక్కువ సౌకర్యాలు కలిపిస్తూ పంపించమని రికమెండ్ చేశాడు. ఈ రిపోర్ట్ ను ఇండియాలో బాగానే మెచ్చారు. కానీ మలేషియాలోని ఇండియన్ ప్రెస్ ఆక్షేపించింది. అక్కడి లేబర్ మాత్రం ఇండియానుంచి ఇంకా లేబర్ ను పంపవద్దనిఅక్కడివారు సురక్షితంగా సంపన్నం గా ఉండటానికి ఇబ్బంది అవుతుందని అభిప్రాయపడ్డారు. తన భావాలను వైస్రాయ్ కౌన్సిల్ మెంబర్ గిరిజా శంకర్ బాజ్పాయికి తెలియ జేస్తూ శాస్త్రి –"మలేషియాలో ఇండియన్లు స్వర్గం లో ఉన్నారని నేను బావించనని నా క్రిటిక్స్ అంటున్నారు. నా ఉద్దేశాయం అదికాదు. వేలాది మనవాళ్ళకు ఇక్కడ ఉపాధి ఉందని చెప్పటమే. ఇక్కడికి వలస రావటం హై గ్రేడ్ సిటిజెన్ షిప్ అవుతుంది. అతి ప్రాచీన కాలంలోనే మనం షిప్ నిర్మాణం చేశామని చరిత్ర చెబుతోంది. సముద్ర ప్రయాణం చేసి కాలనీలు స్థాపించి చాలా శతాబ్దాలనుంచి మనవారు ఉంటున్నారు "అని స్పష్టం చేశాడు శాస్త్రి.

## విద్యార్ధుల సమ్మె

శ్రీనివాస శాస్త్రి రెండవ సారి వైస్ చాన్సలర్ అయినప్పుడు విద్యార్ధుల సమ్మె వలన ఆటంకం కలిగింది. ఇద్దరు విద్యార్ధుల మధ్య స్పర్ధ చిలికి చిలికి గాలి వానై,మధ్యలో అసాంఘిక శక్తులు ప్రవేశించటంతో తీవ్రమైంది. ఈపుస్తకరచయిత అప్పడు అక్కడ లెక్చరర్. అవిశ్వాసం దావానలమై ప్రాకిపోయింది,శాస్త్రి బహు చాకచక్యంతో సమర్ధతత తో సానుకూల్యం చేసినా మధ్యమధ్య గొడవలు జరుగుతూనే ఉన్నాయి. మర్యాదగా ఉండదని పోలిసులు జోక్యం కల్పించుకోలేదు. తీవ్రమైన చర్య తీసుకోనందుకు అందరు శాస్త్రిని నిందించారు. అప్పటి మద్రాస్ ముఖ్యమంత్రి రాజాజీ తిరుగుబాటు విద్యార్ధులన్దర్నీ క్షమించమని సలహా ఇచ్చాడు –"The the risk of being deceived "అన్నాడు కూడా. పిల్లలపై నమ్మకం సానుభూతి ఉన్నా శాస్త్రి యూని వర్సిటి ప్రశాంతతకు తరచుగా విఘాతం కలిగిస్తూ దోషులని గుర్తింపు పొందిన విద్యార్ధులను

ఉదాసీనంగా వదిలి పెట్టాలని లెదు. రాజగోపాలా చారికి ఉత్తరం రాస్తూ –"అధిక సంఖ్యాక విద్యార్ధులు ఎంతో సహనంగా ఉంటే వారి తలిదండ్రులు ప్రశాంతతకు సహకరిస్తుంటే,దోషుల్ని సస్పెండ్ చేస్తే నేను,అలాంటి అసలైన దోషులకు మళ్ళీ అడ్మిషన్ ఇస్తే,వారి జులాయి తనం పెరిగి ప్రమాదకరంగా మారిపోతారు. యూనివర్సిటి పాలన విషయం ప్రజలు అర్ధం చేసుకోలేరు,ఇప్పటికే దెబ్బ తిన్న విద్యశాల గౌరవం పూర్తిగా ముక్కలు చెక్కలౌతుంది –"The policy of un reserved generosity would be proper if my personal interests were alone at stake. I am responsible for a large institution which is not my private property.. ఆ విద్యార్ధులను నమ్ముతాను అంటున్నారుమీరు,నేను నమ్మను నమ్మలేను. వాళ్ళ సంగతి నాకు పూర్తిగా తెలుసు. మీకు బొత్తిగా తెలియదు. వాళ్ళ అవిధేయత వలన నేను చాలా ఇబ్బంది పడ్డాను. మీరు పడలేదు. యూని వర్సిటి విషయంలో వారి భవిష్యత్ దృక్పధం నాకు తెలుసు. మీకు అస్సలు తెలియదు. "ఈ సారి తప్పు క్షమించి మళ్ళీ చేస్తే తీవ్ర చర్య తీసుకోండి 'అన్నారుమీరు. అలాగే చేశానను కొండి పబ్లిక్ కి యేమని సమాధానం చెప్పగలను ?నా నిర్ణయం కంటే న్యాయం కంటే ఇతరులను మెప్పించటానికి నేను లేనిక్కడ. సంక్లిష్ట సమయంలో నేను చేసిన జడ్జిమెంట్ ను వదిలేసి లొంగిపోతే పబ్లిక్ నన్ను ఎంత నీచంగా చూస్తారో అర్ధం చేసుకోండి. నైతికత కోల్పోయి చదువుల తల్లి ఆలయమైన ఈ విశ్వ విద్యాలయం లో విద్యా వ్యవస్థ కుంటుపడితే బాధ్యత అంతా నాదే అవుతుంది "అని నిర్మొహమాటంగా నిష్కర్షగా రాశాడు శాస్త్రి ముఖ్యమంత్రి రాజాజికి.

శాస్త్రి స్నేహితులు హితైషులు ఈ వ్యవహారాన్ని మహాత్మునికి తెలియజేయమని ఒత్తిడి చేసినా దీన్ని అంత హై సర్కిల్స్ వద్దకు తీసుకు వెళ్లటం వివేకం కాదన్నాడు శాస్త్రి. స్ట్రైక్ జరగటం శాస్త్రి శారీరకంగా మానసికంగా కుంగి పోవటం గాంధీకి తెలిసి వెంటనే సమ్మె మాని –"Show obedience to Sastri "అని టెలిగ్రాం ఇచ్చాడు విద్యార్ధులకు. మరో టెలిగ్రాం లో శాస్త్రికి "My heart goes out to you. I pity the students who have been un worthy of your great stewardship "అన్నాడు దీనికి సమాధానంగా శాస్త్రి వెంటనే కృతజ్ఞతతో స్పందిస్తూ "Magnanimity is the name of Gandhi "అన్నాడు. కాని గాంధిగారి మాటలు విద్యార్ధుల చెవికి ఎక్కలేదు. చివరికి రాజాజి యే ఆ రెబెల్ స్టూడెంట్స్ కు స్ట్రైక్ మానేయమని సలహా ఇవ్వటంతో సమ్మె ఆగిపోయింది. తక్కువ మందిపై అతి తక్కువ పనిష్ మెంట్ తో సమ్మె పూర్తయినందుకు శాస్త్రి చాలా సంతోషించాడు.

## చివరి రోజులు

అన్నామలై లో తిరుగు బాటు దార్లులైన విద్యార్ధులలో ఒకతను శాస్త్రి ముఖ్య స్నేహితుని కొడుకే. సౌతాఫ్రికాకు చెందిన శ్రీమతి నాయుడు,శాస్త్రి ఇక్కడ విసి అని ఆకుర్రాడిని ఇక్కడ చేర్చింది. ఇది కొంత అడ్వాంటేజ్ గా తీసుకొని ఆకుర్రాడు గోపాలన్ చెడు సావాలకు చేరువై ఇబ్బంది కలిగించాడు. నాయుడు దంపతులు దక్షిణాఫ్రికాలో గాంధీ సహాయ నిరాకరణలో పాల్గొన్నారు అందుకని ఆమె తనకొడుక్కి ఫేవర్ చేయమని గాంధీని కోరింది. రాజకుమారి అమృత కౌర్ కూడా ఆమెకొడుకు పట్ల కాస్త దయగా ఉండమని శాస్త్రికి రాసింది. నాయుడు దంపతుల కోరిక తీర్చటం అసాధ్యమని శాస్త్రి వెంటనే ఉత్తరం రాస్తూ –"శ్రీమతినాయుడు నాకు మరో లెటర్ కు బదులుగా గోపాలన్ చివరి తెగతెంపులు విషయం రాశాను. అతడు చెప్పే,

బయటికి ప్రవర్తించే తీరుకు పూర్తీ విరుద్ధం. ఈఎపిసోడ్ చివరిదాకా ఆ రెబెల్స్ తమ తలి దండ్రులతో నేను మాట్లాడటానికి వ్యతిరేకించారు. అనేక భయాలు ఊహలతో తమదే రైట్ అని పేరెంట్స్ కు కాకమ్మ కబుర్లు చెప్పి నమ్మించారు. మేముకూడా ఈప్రాపగాండ కు కౌంటర్ ప్రాపగాండా చేయాల్సి వచ్చింది. మేమంతా పేరెంట్స్ మంచి తనం పైనే వ్యవహరించాం. కాని వాళ్ళు వాళ్ళ పిల్లలు చెప్పిందే పూర్తిగా నమ్మారు.. కొందరు కాంగ్రెస్ శాసన సభ్యులు కూడా మత పరమైన అసూయతో స్టూడెంట్స్ కొమ్ముకాసి మాకు వ్యతిరేకంయ్యారు. మహాత్ముని మధ్య వర్తిత్వం వారిలో భయం కలిగించింది. కానీ దాని ప్రభావం తాత్కాలికమే అయింది. తప్పుడు అపవాదాలే ప్రాముఖ్యత వహించాయి. -I am ashamed to say and I was by no means exempt.. ''రాజాజీ మావెంట కొండంత ధైర్యంతో నిలబడ్డాడు. ''He thought and thinks I might have been thorough in my generosity,and not excluded any one from clemency. With no desire I say it after rigorous self examination to be vindictive,I could not go so far "అన్నాడు

గోపాలన్ సిలోన్ నుంచి శాస్త్రికి జాబు రాస్తూ అక్కడ మళ్ళీ చదువుపై దృష్టిపెట్టానని తెలియజేస్తే దానికి సమాధానంగా శాస్త్రి అత్యంత హుందాగా జవాబిచ్చాడు –"నువ్వు మీ అమ్మగారి సమక్షంలో అప్పుడు ఇక్కడ జరిగిన విషయాలన్నీ జ్ఞాపకం తెచ్చుకొంటే,నీ జీవితవిదానమే గణనీయంగా మారిపోయి ఆనాడు నీ వెంట ఉన్నవారి ప్రవర్తన ఎంత తేడాగా ఉందో అర్ధమౌతుంది. మార్పు వలన కొందరిలో లాభం కొందరిలో నష్టం జరగవచ్చు "Circumstances make sport of us and none is fully master of thoughts and deeds. We the best,no less than the worst need mercy and charity ".మీ అమ్మగారికి శుభా కాంక్షలు తెలియజేయి. నేను ఆమెకోరినట్లు నీపట్ల ఉదారంగా వ్యవహరించక ఆమె బాధలను పెంచినందుకు,తప్పని సరి పరిస్తితుల్లోఅలా చేసిందుకు అర్ధం చేసుకోమని చెప్పు. భవిష్యత్తు మీ ఉభయులకూ శుభం చేకూర్చుగాక "అని తనపవిత్ర హృదయాన్ని ఆవిష్కరించాడు శాస్త్రి.

వయసు వలన ఏర్పడిన శారీరక బలహీనలతల వలన శక్తిచాలక రైటానరబుల్ శ్రీనివాస శాస్త్రి అన్నామలై యూని వర్సిటి వైస్ చాన్సలర్ పదవికి1940మార్చిలో రెండవ టరమ్ పూర్తికాగానే రాజీనామా చేశాడు. విద్యార్థుల సమ్మె తాలూకు బాధ దిగులు లేకుండా ప్రశాంతంగా ఆ యూని వర్సిటి వదిలి వచ్చాడు.

# లెజిస్లేటివ్ కౌన్సిల్ లో శాస్త్రి

1935ఆగస్ట్ లో బ్రిటీష పార్లమెంట్ భారత రాజ్యాంగంలో పొందుపరచిన సేఫ్ గార్డ్స్ విషయాలను పాస్ చేసినందుకు నచ్చక నిరాశ చెందాడు. రాజ్యాంగానికి దోహద పడేట్లుగా ఎన్నికలలో నిలబడి పదవులు పొందటానికి,అవసరమైన సంస్కరణలు రూపొందించటానికి కాంగ్రెస్ ఒప్పుకోనందుకూ వ్యధ చెందాడు. For, Sastri had always the firm belief that it was a suicidal policy for the best men and women of a nation to stand aside from the government and to refuse to practice administration which is the one of the greatest arts. కాంగ్రెస్ చాలాకాలం కీకారణ్యంలో చిక్కుకు పోయిందని బాధ పడ్డాడు. ఎన్నికలలో నిలబడి దేశ భవితవ్యాన్ని తమ చేతులతో నిర్మించుకొనే గొప్ప సదవకాశాన్ని కాంగ్రెస్ చేజేతులా నాశనం చేసుకొన్నది ఆలస్యం ప్రమాదకరం అని గుర్తించ లేదు పార్టి. బిల్లు పాస్ చేసినా బాధ్యతాయుతం కేంద్ర ప్రభుత్వాన్ని ఇవ్వలేకపోయారు. మహారాజుల ఆల్ ఇండియా ఫెడరేషన్ చల్లబడి పోయింది. కాంగ్రెస్ కూడా కొత్త రిఫారం తిరస్కరించి భారత రాజ్యంగ నిర్మాణం కోసం రాజ్యాంగ అసెంబ్లీని ఏర్పాటు చేయమని కోరింది.

బ్రిటిష్ ఇండియాలో లో ఎన్నికలు 1937లో జరిగాక వివిధ రాష్ట్రాల శాసన సభలతో కొత్త అధ్యాయం ప్రారంభమైంది. కాంగ్రెస్ చాలా రాష్ట్రాలలో ఎక్కువ స్థానాలు గెలిచింది.కానీ గవర్నర్లు మంత్రివర్గం మాటను తప్పక పాటించాలని,పాలనలో అనవసర జోక్యం కల్పించుకోరు అని వైస్రాయ్ అభయం ఇవ్వక పోతే తాము పదవులు స్వీకరించం అన్నారు. కాంగ్రెస్ వారు మంత్రివర్గాలు ఏర్పాటు చేయని రాష్ట్రాలలో మిగిలిన పార్టీలు ఏర్పాటు చేశాయి. మద్రాస్ లో శ్రీనివాస శాస్త్రిని మధ్యంతర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయమనికోరితే తిరస్కరించాడు. కాని పరిస్థితులు మారి కాంగ్రెస్ ఆరు రాష్ట్రాల్లో మంత్రివర్గాలు ఏర్పాటు చేసింది. తర్వాత వైస్రాయి ప్రభుత్వాల పనిలో గవర్నర్లు నిత్యం జోక్యం కలిగించుకోరు అని మంత్రివర్గం మాటను విశ్వాసంలోకి తీసుకొంటారని అస్యూరెన్స్ ఇచ్చాడు. శాస్త్రి కాంగ్రెస్ మంత్రివర్గాలను హృదయపూర్వకంగా అభినదిస్తే లిబరల్స్ ఆశ్చర్యపోయారు,మద్రాస్ సి ఏమ్.రాజాజి మంత్రులకు మోడెస్ట్ అంటే నిరాడంబర జీతాలను ప్రకటించగా శాస్త్రి వారి త్యాగాలను శ్లాఘించి రాజాజిని “As a timid and humble fresh man from the University of self denial as compared with the Congress ministers who had taken the Doctorate degree “అన్నాడు వ్యంగ్యంగా.

లెజిస్లేటివ్ కౌన్సిల్ ఉన్నత సభకు రైటానరబుల్ శ్రీనివాస శాస్త్రి నామినేట్ అయ్యాడు. సహజంగా ప్రతిపక్ష నాయకుడు అవటంతో ప్రభుత్వాన్ని వీలైనప్పుడల్లాతప్పులు చూపి కడిగి పారేసే వాడు. భారత దేశం లో ప్రజాస్వామ్య వ్యవస్థకు కాంగ్రెస్ మూల స్థానం కావా;లని శాస్త్రి ఆశయం. కాంగ్రెస్ హైకమాండ్ కాంగ్రెస్ రాష్ట్ర ప్రభుత్వాల రోజ వారీ కార్యక్రమాలో వేలు పెడుతూ ఉండటం నచ్చక విమర్శించాడు. ఇంకా శైశవ దశలో ఉన్న కాంగ్రెస్ ప్రభుత్వాలను నిర్దాక్షిణ్యం గానే విమర్శించేవాడు. శాసన సభలో బయట వేదికాలపైనా ప్రజలను తమ స్వేచ్చ ననుసరించి,ఆలోచించి వోటు వినియోగించమని పదేపడదే చెప్పేవాడు.ప్రతిపక్షాల మాట వినాలని చెప్పి, వాటిపై తక్షణ చార్యాలు ప్రభుత్వాలు తీసుకోవాలని హెచ్చరించాడు. ఒక సారి మహమ్మద్ ఉస్మాన్ ఖాన్ భారీ శరీరాన్ని చూసి అయినా ఆయనకు ఎక్కువ అవకాశం ఇవ్వాలి అన్నప్పుడు సభ అంతా చప్పట్లతో నవ్వులతో మారుమోగిపోయింది. మద్య నిషేధం పై రాజాజీ కున్న పట్టుదలపై శాస్త్రి సానుభూతి చూపాడు. మొదట్లో కొన్ని ఎంపిక చేసిన చోట్ల నిషేధం అమలు జరిపి చూడటం మంచిది అన్నాడు. నిషేధ్ధం పై రెండో అభిప్రాయం లేనేలేదని గట్టిగా సమర్ధించాడు. బేసిక్ ఎడ్యుకేషన్,హిందీ విషయాలను జాగ్రత్తగా ఆలోచించి ప్రవేశ పెట్టాలి అన్నాడు. మదురై దేవాలయంలో ముందుగా హరిజనులకు ప్రవేశం కల్పించి తర్వాత సభలో ఆనాటినుంచే వర్తించేట్లు చట్టాన్ని ఆమోదించటాన్ని తప్పుపట్టాడు శాస్త్రి. వయసు మీద పడిపోతున్నా శాస్త్రి లెజిస్లేటివ్ కౌన్సిల్ చర్చలలో చాలాచురుకైన పాత్ర పోషించి తనకున్న విశేష అనుభవాన్ని ప్రదర్శించి మన్ననలు పొందాడు –sastri added the Council the distinction of his illustrious personality,rich experience and wise counsel “.

యూరప్ పై యుద్ధమేఘాలు 1938లో కమ్మేశాయి. బ్రిటన్ ఫ్రాన్స్ లు జర్మనితో సంఘర్షణ వద్దని విశ్వ ప్రయత్నం చేశాయి. హిట్లర్ గొంతెమ్మ కోరికలు తీర్చాయి. చాంబర్లేన్,హాలి ఫాక్స్ లు నాజీలను బుజ్జగించారు. హిట్లర్ జెకోస్లో వేకియా ముట్టడితో,స్వతంత్ర దేశం లో ధైర్యవంతులు దాదాపుగా అంతరించిపోయే పరిస్థితి వచ్చింది. శాస్త్రి ఆవేదన అంతులేని అయింది. కాని చేమ్బర్లేన్ ద్వయం తీసుకొన్న నిర్ణయాలలో న్యాయం,తెలివి ఉన్నాయి అనుకొన్నాడు. 4-10-1938 రాసిన ఉత్తరంలో శాస్త్రి –”ప్రపంచం పిచ్చిదైపోయింది. ఇవాళ ఉన్నంతగా నేను ఎన్నడూ కలవర పడలేదు. నాకు శాంతికావాలా ?యుద్ధం కావాలా ?ఎందుకు నేను సంతృప్తి చెందలేకపోతున్నాను ?కారణం జెకోస్లోవేకియా అంతరించి పోయింది. హిట్లర్

భూతం ఆవహించిన ప్రపంచంలో అధర్మం లేని శాంతి సాధ్యమా ?అలాచేస్తే నేను ఫూల్ అవుతాను. హలిఫాల్స్ “Peace is at this juncture greater to the world than justice “అన్న మాటను ఇష్టపడను. శాంతి చాలా ప్రత్యక్షమైనది. కనీసం దాని నెగటివ్ విషయం లోనైనా న్యాయం కంటే ఎక్కువైనది,గుర్తిమ్పదగినదికూడా. ”Who would sacrifice a clear tangible end for a mere abstraction which means different things to different nations and different individuals ?ఇలాంటి శాంతి ఎక్కువకాలం నిలవదు. కొందరు అడగవచ్చు “ఎప్పుడో పోరాటం చేయటం కంటే,ఇప్పుడే ఎందుకు చేయకూడదు?”It may be better now than tomorrow “దీనికి సమాధానం చనిపోతున్న పేషెంట్ కు డాక్టర్ కు చెప్పినట్లు ఉంటుంది. 'ఎలాగో నాలుగు రోజుల్లో పోతావుగా ఇప్పుడే ఎందుకు పోవు ?”అన్నట్లు ఉంది.దీవుని చర్యలు అంతు చిక్కనివి. ఏదీ ఖచ్చితంగా చెప్పలేం. మనకు సమయం దొరుకుతున్దేమొఎవరికి తెల్సు ?మానవ జాతి తన పద్ధతిమార్చు కొంటుందేమో ?The nations may learn the wisdom of peace,and all quarrels will yield to reason “అంటూ తన మనో వ్యధను వ్యక్తం చేశాడుశాస్త్రి.

హిట్లర్ పోలాండ్ పై దాడి జరపగానే బ్రిటన్ యుద్ధాన్ని ప్రకటించింది. శాసనసభను సంప్రదించకుండా బ్రిటీష ఇండియా ప్రభుత్వం యుద్ధంలో పాల్గొనగా సహజంగా కాంగ్రెస్ దానితోపాటు అన్ని ప్రోగ్రెసివ్ పార్టీలు దాన్ని తిరస్కరించాయి. కాని గాంధీ మాత్రం బ్రిటీష్ ప్రభుత్వం పై ఎల్లలు లేని సానుభూతి,ఔదార్యం ఒలకబోశాడు. ముందుగా. వైశ్రాయితో మాట్లాడి లండన్ కు,పార్లమెంట్ హౌస్ కు, వెస్ట్ మినిస్టర్ అబ్బే కు జరిగే అపార నష్టాన్ని తాను అంచనా వేయలేను అన్నాడు. చైనాలో ఉన్న నెహ్రు హడావిడిగా వాలిపోయి ఇండియా అన్ని విధాల బ్రిటీష ప్రభుత్వానికి సహాయ సహకారాలను ఈ యుద్ధం లో అందించాలి అన్నాడు. 15-8-1939 న సమావేశామైన కాంగ్రెస్ వర్కింగ్ కమిటిమాత్రంగాంది వెంట లెదు.గాంధీ స్థితి కష్టంగా ఉంది..సందేహపు ముళ్ళకమ్మపై ఆయన ఉన్నాడు. వెలుగుకోసం సత్యంకోసం వెతుకు తున్నాడు. గాంధీకి ఉన్నా అహింసా సిద్ధాంతంపై శాస్త్రికి విపరీతమైన నమ్మకం ఉంది.వర్కింగ్ కమిటి మీటింగ్ లో ఆయన పాత్ర ఆశ్చర్యం కలిగించింది.బాధించింది కూడా. కొన్ని రోజులతర్వాత మద్రాస్ లో మహాదేవ దేశాయితో శాస్త్రి ఈవిషయం మాట్లాడాడు. ఆయనేదో సర్ది చెప్పే ప్రయత్నం చేస్తే ఓపిక నశించి ఆయన వాడిన “Affectionate vehemence “ప్రభావ వంతమైన వేగం –అనే మాటనచ్చక “మీ గాంధి నా గాందికంటే తక్కువ. అలాంటి గాంది నాకు పనికి రాడు.ఆయన తనకున్న ఉన్నత ఆదర్శాలతో ఉండలేకపోతే ఆయన గొంతు ఆయన్నే కోసుకోమను “అన్నాడు ఉద్రేకంగా. తర్వాత గాంధీకి తాపీగా క్షమాపణ చెప్పాడు. వర్కింగ్ కమిటికి కూడా ఒక లెటర్ రాశాడు. అందులో ఏముందో రేపు తెరిచి చూద్దాం.

## కాంగ్రెస్ వర్కింగ్ కమిటికి ఒక లేఖ

కాంగ్రెస్ వర్కింగ్ కమిటికి ఒక లేఖ పంపుతూ శాస్త్రి –”విషయం చాలా లోతుకు పోయింది. అది అక్కడే చిక్కుకుపోయింది. వర్కిగ్ కమిటీ తొ గాంధీకి ఉన్న విభేదమమిటి ?అది నాన్ వయోలెన్స్ కు భ్రస్తత్వం అనుకోన్నారా ?బ్రిటన్ తొ లాభ సాటి బేరాలు ఆడకుండా సహకరించాకూడ దనా ?వర్కింగ్ కమిటి మీటింగ్ కు రాకముందే ఆయన ప్రభుత్వానికి సహకిస్తామన్నారనా ?”To plead that his cooperation with violence was to be non violent in is a poor defence ? non violent violence beats me. Nehru and working committee would not be content with this aneamic simulacrum of support if Britain complied with their demand and promised India her

freedom ". ఆ ఉత్తరం లోనే –యుద్ధం అనే నాటక శాలలో ఇండియా ప్రజలను గాంధీ రొమ్ములు సాచి,శత్రువుల ఖడ్గ ప్రహారాలను రుచి చూడమని ఉపదేశం ఇస్తాడా ?కొద్ది క్షణాలకిందే నేను ఆయన అలానే అంటాడని ప్రతిజ్ఞ చేశా. నాకు ఇక యే నమ్మకమూ లెదు "అన్నాడు.

1939 సెప్టెంబర్ 30 హరిజన్ పత్రికలో గాంధీ,శాస్త్రి ఉత్తరాన్ని దేశాయ్ కి రిఫర్ చేశాడు. ''నాకు ఆయనకు ఏరకమైన బౌద్ధిక షరతులు లేవు. ఆయన కోపంతోకాక ఆవేదనతో రాసి ఉంటాడు అలాగ. నేను మళ్ళీ అదే సమాధానం చెబుతా. చెక్ లకు అబిసీనియన్లకూ అలాగే చెప్పాను. నా అహింస దృఢమైన పదార్ధంతో ఉంటుంది. శాస్త్రవేత్తలు కనిపెట్టిన అతి గట్టి లోహం కంటే అది మరింత దృఢమైనది. ''Yes alas,I am painfully conscious of the fact that it has still not attained its native firmness "అన్నాడు.

1940లో గాంధీ మళ్ళీ అహింస కల్తీ లేని అతి స్వచ్ఛమైనది అని ప్రవచిస్తే శాస్త్రి చాలా సంతోషించి ఒక జాబురాస్తూ – ''నైతిక విలువలు అన్ని విలువలకన్నా ఉత్తమమైనవి అనేవారు మిమ్మల్ని చూసి గొప్ప సంతృప్తి చెందుతారు. అది చాలా ప్రశాంతంగా ఆలోచిస్తే మానవ మట్టిలోనుంచి పవిత్ర దేవతా విగ్రహం తాయారు చేయటం వంటిది. అందులో తప్పినా కూడా ఉన్నతకీర్తే లభిస్తుంది. లెక్కల్లో సున్నా అంటే సున్నాయే. మానవ విషయాలలో మాత్రం దీనికి వ్యతిరేకం. అత్యన్తభారీ లావాదీఎలు సున్నతో అంతమవుతాయి,కానీ వ్యర్ధప్రయత్నాలు కావు. అనుభవం తెలివి రుజువు కాబడిన శక్తి విపరీతమైన లాభాలే ఆ క్షణం లో మనం కొండనుంచి జారిపడే రాయి సిసిఫాస్ గా ఉంటాం. దాన్ని మళ్ళీ అట్టడుగునుంచి పైకేత్తే ప్రయత్నం చేయాలి.-Go on brave soul,your faith is inextinguishable. It is not of this earth. అంటే మీది దైవ చిత్తం "అన్నాడు శాస్త్రి రెండు చేతులు జోడిస్తూ. ''గాంధీని అసలైన రాజకీయ వేత్త అన్నాడు. ఆయనలో ఒక రుషిని దర్శిస్తున్నాననీ,అందులో ధైర్యం సత్యంతో ప్రయోగం చూస్తున్నాడనీ. అ సత్యం అత్యద్భుత విజాయాలుసాదించిదని. అందుకే ఆయన నాన్ కొ ఆపరేషన్ సిద్ధాంతంలో కల్తీలేని స్వచ్ఛత దర్శించానని పొంగిపోయాడు. ''I place you alongside the philosophers and ethicists of fame. మాలాంటి వారికి వారసత్వంగా కొన్ని మంచి లక్షణాలు అబ్బి ఉంటాయి "T0 see you descend on occasions from the heights,I feel bereft (నశించిన ) of my natural garment,disrobed of my national pride "అని అత్యత వినయంగా,ఉత్కృష్టంగా మహాత్ముని గొప్పతనాన్ని శాస్త్రి ఆవిష్కరించాడు.

## మహాత్ముని అహింసా వ్రతం

పారమార్ధిక స్థాయినుంచి వ్యావహారిక స్థాయికి దూకిన లాఘవంతో శాస్త్రి గాంధీతో రాజకీయ పరిస్థితి చర్చిస్తూ ఉత్తరం రాస్తూ ఇలా అన్నాడు –''గట్టి బలం విశ్వాసాలున్న పార్టీ ఇప్పుడే అధికారం పొంది ప్రజలబాగుకోసం,రక్షణ కోసం కృషికి ఉపక్రమించాలి. స్వతంత్రంతో పాటు అన్ని ఉద్యమాలను వెంటనే ఆపెయ్యాలి. నా అభిప్రాయాలను మీకు రాసే స్వేచ్ఛతీసుకొని తెలియజేసినందుకు క్షంతవ్యుడని. ఒక టీచర్ లాప్రవర్తించి అలా రాశానేమో. బాధ్యతారాహిత్య విమర్శకుడిగా ఒక్కో సారి హద్దులు దాటుతూ ఉంటాను. ''Like an irresponsible critic I have alternately found fault and exhorted. Like an anxious son of India I have painted a lurid picture and alarmed you un

necessarily. Put down these lapses partly to ignorance and partly over wrought nerves ".అని పశ్చాత్తాపం ప్రకటించాడు.

మహాత్ముని అహింసా వ్రతం పై ఆరాధన,పట్టుదల చూసి శాస్త్రి మద్రాస్ వార్ కమిటి సభ్యుడిగా చేరి వంద రూపాయలు యుద్ధ నిధికి విరాళం చెల్లించాడు. ప్రారంభోత్సవసభకు వెళ్లాడు కానీ అక్కడ గాంధి,కాంగ్రెస్ వ్యతిరేక ఉపన్యాసాలు విని నచ్చక బాధపడి మధ్యలోనే వచ్చాడు. యుద్ధనిధికి శాస్త్రి డబ్బు ఇవ్వటం ఆయన అభిమానులుఆశ్చర్యపోయారు. దానికి శాస్త్రి "నేను మహాత్మునిలా అహింసా ప్రవక్తనుకాను కానీ నేను శాంతి ప్రేమికుడిని "అన్నాడు యుద్ధం లో బ్రిటన్ జయం పొందకపోతే ప్రజాస్వామ్యానికి పెద్ద ప్రమాదం అని బావించాడు శాస్త్రి.సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటి వార్ కమిటీలో చేరలేదు అందుకని శాస్త్రి నియమోల్లంఘన చేశాడని బావించారు. ఆయనకున్న సీనియారిటి ని బట్టి చూసి చూడనట్లున్నారు. అయినా ఆయన సహచారులుమాత్రం అత్యంత గౌరవాభిమానాలతో చూసేవారు.

అలాగే రెండో సారి శాస్త్రి మెజారిటి మార్గాన్ని కాదన్నాడు. SIS అంతటే సర్వెంట్సాఫ్ ఇండియా కమిటి అధ్యక్షుడు కుంజ్రు ఇతర సభ్యులు పాకిస్తాన్ విషయం పై విబేదించాడు వాళ్ళు పాకిస్తాన్ అభిప్రాయానికి లొంగితే త్వరగా ఇండియాకు స్వతంత్రం వస్తుంది అన్నారు. భారత విభజన శాస్త్రికి నచ్చలేదు. బాల్య యౌవన దశలనుంచి నమ్మినడానికి వ్యతిరేకంగా జరగటం ఆయనకు ఇష్టం లెదు. బలహీనమైన ఆరోగ్యం తోనే. మరణశయ్యపై ఉన్న శాస్త్రి చివరి ఉత్తరం మహాత్మా గాంధీకి ఇండియా నుంచి పాకిస్తాన్ ను విడకోట్టవద్దని రాశాడు –"పంజాబ్ బెంగాల్ లు నాశనమౌతాయి. భారత స్వాతంత్ర్యం కోసం దేశంలో యే భాగాన్నీ త్యాగం చేయద్దు "It is bound to be a lasting enemy and a blistering sore to India. "అని ఆనాడే బాగా ఊహించి చెప్పిన క్రాంతదర్శి శాస్త్రి. ఇండియా విభజన శాస్త్రి చూడలేదు.

## ఇండియన్ యూనియన్ ఏర్పాటు

వైస్రాయ్ కాంగ్రెస్ లో యుద్ధానికి తోడ్పడమని జరుపుతున్న చర్చలు అన్నీ శాస్త్రి ఆసక్తిగా గమనిస్తూనే ఉన్నాడు. 1940 లోవైస్రాయ్ ఇచ్చిన "ఆగస్ట్ ఆఫర్ "ను కాంగ్రెస్,గాంధీ తిరస్కరించారు. గాంధీ కొద్దిమందితో వ్యక్తిగత సత్యాగ్రహం చేయాలనుకొన్నాడు. 1942మార్చిలో సర్ స్టాఫర్డ్ క్రిప్స్ ను రాయబారిగా బ్రిటీష ప్రభుత్వం ఇండియాకు పంపి అందులోయుద్ధం ముగియగానే ఇండియన్ యూనియన్ ఏర్పాటు చేసి పూర్తి డొమినియన్ స్టేటస్ కల్పిస్తామని,ఈలోపు జాతీయప్రభుత్వం ఏర్పాటు చేసి అది శాసనసభకు కాక వైస్రాయ్ కి బాధ్యత వహిస్తుందని చెప్పారు. భారతీయుల చిరకాల కోరికలు పూర్తిగా తెలిసిన క్రిప్స్ ఇలా చేయటాన్ని శాస్త్రి బాధపడ్డాడు. దీన్ని వ్యతిరేకిస్తూ కాంగ్రెస్ "క్విట్ ఇండియా "ఉద్యమం లేవదీయగా గాంధి నెహ్రు మొదలైన ముఖ్య జాతీయ నాయకులను అరెస్ట్ అయ్యారు. జాతీయ ప్రభుత్వం ఏర్పడి శాంతి సమావేశంలో మహాత్ముని శాంతి అహింస సిద్ధాంతాలు మహాత్ముడు వినిపిస్తాడని సంతోషించాడు శాస్త్రి. ఒకమహోన్నత రాజకీయ వేత్త చేయరాని పని శాస్త్రి చేస్తూ లార్డ్ వేవెల్ కు,సెక్రెటరి ఆఫ్ స్టేట్ మిస్టర్ అమెరి కి వైస్రాయ్, గాంధీలకు ఒక ఉత్తరాలు రాసి ప్రెస్ కు రిలీజ్ చేశాడు. ఇవి 24-10-1943న ప్రచురింపబడ్డాయి. అందులో ఒక మహా దేశభక్తునిగా,అసామాన్య దేశ పౌరునిగా తన ఆవేదన అంతా వెళ్ళబోశాడు శాస్త్రి –" Demand not of our revered leaders that they stand with tears in their eyes at the gates of the Viceroy's palace and strike penitential palms of aching cheeks. Play the act of magnanimous victor and the healing statesmen. Do not I adjure you,sow

dragons' teeth on the ancient and swallowed soil to this country "అని ప్రాధేయపడ్డాడు దేశంకోసం ప్రజాస్వామ్యం కోసం దేశ ప్రజల అభివృద్ధికోసం.

వైస్రాయ్ కి రాసిన దానిలో –"సెక్షన్ 93రద్దు చేసి శాసన సభలను పునరుద్ధరించి పని చేసేట్లు చేయండి. యుద్ధం పూర్తయిన్దికనుక దోమికకల్ హుడ్ ను సత్వరం ఏర్పాటు చేసి మా ప్రతినిధులు ఇంపీరియల్ కాన్ఫరెన్ల్సో ప్రపంచ శాంతి సమావేశంలో గ్రేట్ బ్రిటన్ కెనడా ఆష్ట్రేలియా సౌతాఫ్రికా లతోపాటు తలఎత్తు కొని నిలబడేట్లు చేయండి. ఇది గోప్పపనిగా చరిత్రలో నిలిచిపోతుంది. ఇది మీరు తలచుకొంటే రేపే సాధ్యమౌతుంది. ''For the sun of armistice may suddenly burst through the cloud of war,brightening the plane and calling upon the nations to tackle the hundred problems of peace "అని హితవు చెప్పాడు. మహాత్ముని రాసిన లెటర్ లో –"ప్రియ సోదరా !మంచి అవకాశం వచ్చింది. ఇలాంటిది శతాబ్దాలకొకటి వస్తుందేమో. త్వరలో జరిగేశాంతి సమావేశంలో గాయం బాధపడ్డ దేశాలు న్యాయం,సౌభ్రాతృత్వం లను జాతి,రంగు మతాలకు అతీతంగా కోరతాయి. మీరు అక్కడికి తప్పక వెళ్ళి పాల్గొనాలి. మీరు కాకపోతటే ఎవరు వెళ్ళి న్యాయం చేయగలరు మహాత్మా. యుద్ధం ఇక శాశ్వతంగా బహిష్కరింప బడాలిమానవ సంక్షేమం కోసం. ఆనాటి సదవకాశాన్ని జారవిడుచుకొంటారా మీరు. లేదు లేదు వెయ్యి సార్లు లేదు లేదు మీరు తప్పక పాల్గొంటారు ప్రపంచశాంతి పరిరక్షిస్తారు. శాంతివాదం అహింస ఎక్కడైనా ఎప్పుడైనా పలకబడినప్పుడు గాంధీ మాత్రమె గుర్తుకు వస్తారు అన్ని దేశాలలో అందరి ప్రజల మనసులలో. ''What should keep you from bearing irrefragable witness to the truth that you have ever cherished in your heart,the truth must resound through the ages when your body has perished ?''అనేక అవమానాలు ఇబ్బందులు బాధలు అనుభవించిన మీకు "The hour of exaltation approaches you. I see you Great Soul in a vision of glory go up the Mount of Expectancy of a weary,waiting world raise high the right hand of blessing and solemnly utter the word which is in all hearts and which comes full of hope and full of meaning from your inspired lips ".'' అంటూ నిండు హృదయంతో పరమాత్మను స్తోత్రం చేసినట్లు రైటానరబుల్ శ్రీని వాస శాస్త్రి భారతీయ ఆధ్యాత్మిక అమృత బిందువులను ఒలకబోస్తూ మహాత్మాగాంధీ మహాత్మ్యాన్ని చాటాడు.

## ఆగస్ట్ ఆఫర్

వైస్రాయ్ కాంగ్రెస్ లో యుద్ధానికి తోడ్పడమని జరుపుతున్న చర్చలు అన్నీ శాస్త్రి ఆసక్తిగా గమనిస్తూనే ఉన్నాడు. 1940 లోవైస్రాయ్ ఇచ్చిన "ఆగస్ట్ ఆఫర్ "ను కాంగ్రెస్,గాంధీ తిరస్కరించారు. గాంధీ కొద్దిమందితో వ్యక్తిగత సత్యాగ్రహం చేయాలనుకొన్నాడు. 1942మార్చిలో సర్ స్టాఫర్డ్ క్రిప్స్ ను రాయబారిగా బ్రిటీష ప్రభుత్వం ఇండియాకు పంపి అందులోయుద్ధం ముగియగానే ఇండియన్ యూనియన్ ఏర్పాటు చేసి పూర్తి డొమినియన్ స్టేటస్ కల్పిస్తామని,ఈలోపు జాతీయప్రభుత్వం ఏర్పాటు చేసి అది శాసనసభకు కాక వైస్రాయ్ కి బాధ్యత వహిస్తుందని చెప్పారు. భారతీయుల చిరకాల కోరికలు పూర్తిగా తెలిసిన క్రిప్స్ ఇలా చేయటాన్ని శాస్త్రి బాధపడ్డాడు. దీన్ని వ్యతిరేకిస్తూ కాంగ్రెస్ "క్విట్ ఇండియా "ఉద్యమం లేవదీయగా గాంధి నెహ్రు మొదలైన ముఖ్య జాతీయ నాయకులను అరెస్ట్ అయ్యారు. జాతీయ ప్రభుత్వం ఏర్పడి శాంతి సమావేశంలో మహాత్ముని శాంతి అహింస సిద్ధాంతాలు మహాత్ముడు వినిపిస్తాడని సంతోషించాడు శాస్త్రి. ఒకమహోన్నత

రాజకీయ వేత్త చేయరాని పని శాస్త్రి చేస్తూ లార్డ్ వేవెల్ కు,సెక్రెటరి ఆఫ్ స్టేట్ మిస్టర్ అమెరి కి వైస్రాయ్, గాంధీలకు ఒక ఉత్తరాలు రాసి ప్రెస్ కు రిలీజ్ చేశాడు. ఇవి 24-10-1943న ప్రచురింపబడ్డాయి. అందులో ఒక మహా దీశభక్తునిగా,అసామాన్య దేశ పౌరునిగా తన ఆవేదన అంతా వెళ్ళబోశాడు శాస్త్రి –" Demand not of our revered leaders that they stand with tears in their eyes at the gates of the Viceroy's palace and strike penitential palms of aching cheeks. Play the act of magnanimous victor and the healing statesmen. Do not I adjure you,sow dragons' teeth on the ancient and swallowed soil to this country "అని ప్రాధేయపడ్డాడు దేశంకోసం ప్రజాస్వామ్యం కోసం దేశ ప్రజల అభివృద్ధికోసం.

వైస్రాయ్ కి రాసిన దానిలో –"సెక్షన్ 93రద్దు చేసి శాసన సభలను పునరుద్ధరించి పని చేసేట్లు చేయండి. యుద్ధం పూర్తయిన్దికనుక దోమికకల్ హుడ్ ను సత్వరం ఏర్పాటు చేసి మా ప్రతినిధులు ఇంపీరియల్ కాన్ఫరెన్స్లో ప్రపంచ శాంతి సమావేశంలో గ్రేట్ బ్రిటన్ కెనడా ఆస్ట్రేలియా సౌతాఫ్రికా లతోపాటు తలఎత్తు కొని నిలబడేట్లు చేయండి. ఇది గోప్పపనిగా చరిత్రలో నిలిచిపోతుంది. ఇది మీరు తలచుకొంటే రేపే సాధ్యమౌతుంది. "For the sun of armistice may suddenly burst through the cloud of war,brightening the plane and calling upon the nations to tackle the hundred problems of peace "అని హితవు చెప్పాడు. మహాత్ముని రాసిన లెటర్ లో –"ప్రియ సోదరా !మంచి అవకాశం వచ్చింది. ఇలాంటిది శతాబ్దాలకొకటి వస్తుందేమో. త్వరలో జరిగేశాంతి సమావేశంలో గాయం బాధపడ్డ దేశాలు న్యాయం,సౌభ్రాతృత్వం లను జాతి,రంగు మతాలకు అతీతంగా కోరతాయి. మీరు అక్కడికి తప్పక వెళ్ళి పాల్గొనాలి. మీరు కాకపోతటే ఎవరు వెళ్ళి న్యాయం చేయగలరు మహాత్మా. యుద్ధం ఇక శాశ్వతంగా బహిష్కరింప బడాలిమానవ సంక్షేమం కోసం. ఆనాటి సదవకాశాన్ని జారవిడుచుకొంటారా మీరు. లేదు లేదు వెయ్యి సార్లు లేదు లేదు మీరు తప్పక పాల్గొంటారు ప్రపంచశాంతి పరిరక్షిస్తారు. శాంతివాదం అహింస ఎక్కడైనా ఎప్పుడైనా పలకబడినప్పుడు గాంధీ మాత్రమె గుర్తుకు వస్తారు అన్ని దేశాలలో అందరి ప్రజల మనసులలో. "What should keep you from bearing irrefragable witness to the truth that you have ever cherished in your heart,the truth must resound through the ages when your body has perished ?"అనేక అవమానాలు ఇబ్బందులు బాధలు అనుభవించిన మీకు "The hour of exaltation approaches you. I see you Great Soul in a vision of glory go up the Mount of Expectancy of a weary,waiting world raise high the right hand of blessing and solemnly utter the word which is in all hearts and which comes full of hope and full of meaning from your inspired lips "." అంటూ నిండు హృదయంతో పరమాత్మను స్తోత్రం చేసినట్లు రైటానరబుల్ శ్రీని వాస శాస్త్రి భారతీయ ఆధ్యాత్మిక అమృత బిందువులను ఒలకబోస్తూ మహాత్మాగాంధీ మహాత్మ్యాన్ని చాటాడు.

## శాస్త్రి జీవితం సమాప్తి

మహాత్ముని 1944 లో జైలు నుంచి విడుదల చేశారు. పాకిస్తాన్ విషయం వదిలేయమని శాస్త్రి చాలా ఉత్తరాలు గాంధీకి రాశాడు. శాంతి సమావేశానికి హాజరవమని విజ్ఞప్తి చేశాడు. 2-4-1944న గాంధీకి రాసిన ఉత్తరం లో శాస్త్రి –"మీ జీవితంలో ఒక అద్భుత అవకాశం ప్రపంచ శాంతి సమావేశం జరుగబోతోంది. మీరు తప్పక వెళ్ళండి. వాళ్ళు మిమ్మల్ని భారత ప్రతినిధిగా

ఆహ్వానించక పోయినా మీరు వెళ్ళాలి. శాంతి సమావేశం లో మీ పేరే మారుమోగాలి. భారత ప్రభుత్వ ప్రతినిధిగా శక్తియుక్తులున్న పోరాట యోధులుగా మీరు హాజరవ్వాలి. ప్రతినిధి బృందానికి మిమ్మల్ని నాయకుడిని చేయకపోయినా వెళ్ళమని వేడుతున్నాను. మీరు వెడితే మీరే లీడర్ అక్కడ. ఇంకెవరూ మీ సమానులు కారు. ''అన్నాడు.

గాంధీ వెళ్లటం ఎంత అవసరమో జిడి బిర్లాకు తెలియజేసి ఆయన వెళ్ళటానికి ఏర్పాటు చేయమని కోరాడు పిచ్చి పంతులు శాస్త్రి. గాంధీని ఉత్తరాలతో వాయిస్తూనే ఉన్నాడు –''The peace conference is of the greatest significance for India and your special mission in life ''అన్నాడు. కానీ అతడి ఉత్తరాలు గాంధీ హృదయాన్ని తీవ్రంగా ఆకర్షించినా శాస్త్రి వినతులేవీ గాంధీ పట్టించుకునే మూడ్ లో లేడు.. జీవితం చివరి రోజులలో శాస్త్రి పాకిస్తాన్ ను విడదీయటం అనే బాధ తట్టుకోలేక పోయాడు. భారత దేశపు అత్యున్నత మహానాయకులైన దాదాభాయ్ నౌరోజీ,రానడే,ఫిరోజ్ షా మెహతా,దిన్షా వాచా,అనిబిసెంట్,వి.కృష్ణస్వామి అయ్యర్,వంటి అతిరధ మహారదులతో తనకున్న సాన్నిహిత్యాన్ని తలుచుకొంటూ గడిపాడు. తమిళ స్వదేశ మిత్ర పత్రికకు తన జ్ఞాపకాలు ధారావాహికంగా రాశాడు. వాటినన్నిటిని ఈ రచయిత సేకరించి మద్రాస్ లోని రోచ్ హౌస్ అండ్ సన్స్ కు పుస్తక ప్రచురణ నిమిత్తం పంపాడు. తనజ్ఞాపకాలు కూడా తమిళం లో రాసి పంపగా వెంటనే ప్రచురణ జరిగి అందరికి అందుబాటులోకి వచ్చి విశేష వ్యాప్తి పొందింది. శాస్త్రి చూసి మహదానందపడి ఈ పుస్తక రచయితకు ''What a great event''!అని బదులిచ్చాడు

TO GOKHALE 31

The operation was thorough and successful, as I wired to you. Yesterday he was progressing well till noon when a bad turn began. Fits of unconsciousness, wandering talk, convulsions, unsteady pulse, etc. The hiccough, which had begun on the 21st, was particularly troublesome. General alarm was felt. The Indian doctor threw up his hands. Then they talked of 'giving' him the *prāyaşcitta*. The purohits were sent for. The eldest girl swooned as the preparations seemed earnest. Then we intervened, some of us, and insisted on the English doctor being consulted before the ceremony was resolved on. Before he could come, at about 6-15 p.m. in the evening, there was a rally. The patient regained clear consciousness, but the first use to which it was put was to show him the *mantras* he must himself pronounce! Evidently the matter had been put to him already, for at once he called for his spectacles and read the paper in his own intense way.... "Why is this written down? I have not got to say *it*. This other thing here is not necessary. Where is that essential *mantra*? I see, it is here on this page. Very well. You see it is this way. Yesterday the two European doctors together signed a bulletin pronouncing my condition hopeful. This morning Dr. Smith has written to the Governor to say my condition is satisfactory. If now I act on Dr. Nanjunda Rao's opinion and take the *prāyaşcitta* they will call him a damned fool. Besides, what shall I say to the Governor? No, no: let us wait till Dr. Smith comes again. If he says my case is hopeless or even difficult, we shall go on with this matter."

This he said with such calmness and decision that it brought hope to all. When the doctor came he talked to him collectedly, and we returned home a little encouraged.

అలాంటి మధురమైన రోజులలో శ్రీని వాస శాస్త్రి రామాయణం పై అద్భుత ఉపన్యాసాలు ఇచ్చాడు. జీవిత చరమాంకంలో ఇలాంటివి ఇవ్వటానికి రాయటానికి మాట్లాడటానికి ఆయన కు దొరికిన సమయాన్ని ఎంతో అద్భుతంగా సద్వినియోగం చేసుకొన్నాడు. రేడియోలోనూ చాలా ప్రసంగాలిచ్చాడు. తన తమిళ మాతృభాషను నూత్న వరవడిలో ఆదర్శ ప్రాయం చేశాడు రచనలలో ప్రసంగాలలో.

శాస్త్రి తన వయసు వారైన స్నేహితులు అభిమానులతో ఎంత సంతృప్తిగా గడిపాడో అంతే సంతృప్తిగా యువజనం లోనూ గడిపి వారిని ఉత్సాహ పరచాడు. 21-2-1942 న పూనా నుంచి ఒక ఉత్తరం రాస్తూ శాస్త్రి –''ఈ స్వర్గ ధామం నుంచి నేను పొందిన సంతృప్తిని మీకు తెలియ జేయటానికి అనుమతించండి. ఇది వరకెప్పుడూ ఇంతటి మహోన్నత భావం నాకు కలగలేదు. ఇక్కడి జనం గౌరవం మర్యాద ప్రేమ ఆత్మీయత లలో నాకు మహదానందాన్ని చేకూర్చారు ఇది వరకెప్పుడూ ఇలాంటి అనుభవం నేను పొందలేదు. నన్ను ఇప్పటిదాకా గమనించనికారణమా,నా వయసు, నా అసాధారణ అనుభవం చూసియా ?19 వ తేదీ గోఖలే హాల్ లోఅంతకు ముందు ఎన్నడూ లేనివిధంగా వచ్చిన ఆవిపరీత జనం సంఖ్యాలోనేకాక అన్నిటా విశిష్టమైంది. ''They regard me as a relic of a school of politics remarkable for their earnestness knowledge and sagacity ''అని మనసునిండుగా అభినందించాడు.ఆ అనుభవాన్ని అందరికి పంచాడు శాస్త్రి.

1946 జనవరి-ఫిబ్రవరి మధ్యలో దాదాపు మృత్యు సమీపం లో ఉన్న శాస్త్రిని మహాత్ముడు జనరల్ హాస్పిటల్ లో చేరిన మర్నాడే వచ్చి చూసి పవిత్ర ఆశీస్సులు అందజేశాడు. గాంధీ మద్రాస్ పర్యటనలో శాస్త్రిని చూసేలోపే చనిపోతాడని అనుకొన్నారు కాని ఒక అద్భుతంగా ఆయనరావటం చూడటం ఆశీర్వదించటం జరిగిపోయాయి. శాస్త్రి మహాత్ముని సందర్శనంతో ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. ఇలా మూడు సార్లు గాంధి వచ్చి శాస్త్రిని చూసి వెళ్లటం అసాధారణ విషయం. ఈ చివరి రెండు సార్లు ఈ రచయిత అక్కడే శాస్త్రి ప్రక్కన ఉన్నాడు. దానిపై రచయిత ఇలారాశాడు-"The communion of these important pair of friends had almost a divine beauty and tenderness. The second meeting was in some ways the most memorable. Whole Gandhi sat suffused with the glow of admiring love,Sastri bathed him in a torrent of worshipful affection.''తరచుగా తానూ ఈ మధ్య రామాయణ ప్రవచనాలలో గాంధీని రాముడుగా అభి వందించటం ఇప్పుడు ప్రత్యక్షంగా అనుభవిస్తున్నాడు శాస్త్రి ఒక శబరిలా,మతంగ మహర్షిలా. కొద్దిగా అపస్మారక స్థితిలో ఉన్నా శాస్త్రి మనసులు గాంధీ శ్రీరాముడి గానే దర్శనమిచ్చాడు. మనసంతారామమయమే అయిపోయింది గాంధీ రామ భక్త శాస్త్రి హనుమాన్ కి. తనను రాముడితో పోల్చటం గాంధీకి నచ్చక "వాట్ నాన్సెన్స్ శాస్త్రి "అన్నాడు. తన బలహీనతను ఒక క్షణం వదిలేసి శాస్త్రి తన సహజ గంభీర స్వరంతో "నాకు గాంధీ తెలిదా ?మీరు నన్ను ఒక స్నేహితుడిని లా చూడటానికి వచ్చినా,మీరు ఇవాళ ప్రపంచంలో సజీవ మహోన్నత మానవ మూర్తి "అన్నాడు మళ్ళా గాంధి తన నిరాడంబరత చాటుకొని "వాట్ నాన్సెన్స్ శాస్త్రి "అన్నాడు మళ్ళీ. తర్వాత అత్యంత ప్రేమ వాత్సల్య పూర్వకంగా "నేను మద్రాస్ వచ్చి చాలా పర్యటనలు చేశానుకాని ఇప్పుడు నిన్ను చూడటం అత్యంత పవిత్రం అనిపించింది. మీ డాక్టర్లు అనుమతిస్తే ఇంకా ఎక్కువ సేపు నీతో గడుపుతాను "అన్నాడు మహాత్ముడు. మదురై వెళ్ళి మద్రాస్ వచ్చి వార్ధా వెళ్ళబోతున్న గాంధీకి ఉన్న మూడే మూడు గంటల వ్యవధిలో శాస్త్రిని చూడటానికి మూడవ సారి శాస్త్రి హాస్పిటల్ నుంచి డిస్చార్జ్ అయి స్వగృహం "స్వాగతం "లో ఉండగా గాంధి వచ్చి చూశాడు. ఇదే చివరి చూపు అయింది. భావోద్వేగంతో శాస్త్రి ఒక అంతర్గత నోట్ రాస్తూ "Brother you have done me exceptional honour,especially by paying this visit when you are in a great hurry. You are nearer and dearer to me than my own brothers,son,daughter and members of my family "అని వినయాంజలి ఘటించాడు శాస్త్రి మహాత్మునికి. కష్టంగానే ఊపిరి పీల్చుకొంటూ అతి నెమ్మది స్వరంతో శాస్త్రి "మీరు ఇక్కడికి అంతర్భావ మహోన్నత తో వచ్చారు. బయటి ఏరకమైన స్నేహమూ దీనికి కారణాలు చెప్పలేదు. Gokhale was but the occasion of it. ''అంటూ మహాత్మునికి మరింత దగ్గరకు జరిగి "నేను మాటలు వృధా చేయను. నేను చెప్పదలచిందేమిటో మీకు తెలుసు "అన్నాడు హీన స్వరంతో.

32 LETTERS OF SRINIVASA SASTRI

This morning the fever is again at 102·4 and the hiccough troublesome. The patient is very weak, but quite clear. The doctor reports the wound healthy and the general condition slightly better. But we are not reassured, especially as he has ordered the nourishment to be injected through the rectum.

He remembered you just before the operation. " Did you write to Mr Gokhale ? " he asked me. " No ", I said, " not after the telegram which I sent at your instance on the 20th instant." " Write today after the operation is over and wire the substance."

While he is in this condition I cannot go to Congress. I hope you approve of my decision. Why, I feel you would like to be here yourself if that were possible.

Affectionately yours
V. S. SRINIVASAN

SERVANTS OF INDIA SOCIETY
Madras Branch
17, SYDOJI LANE, TRIPLICANE
7th February 1913

My dear Baba Sahib

I am ashamed to think how long I have postponed writing to you. Everyday during the last fortnight I have desired to write, but " tomorrow " has always seemed better, as I might have something more definite to say.

A little speech I made on the spur of the moment at the Krishnaswami memorial meeting led to something unexpected and kept me in a flutter for a few days. It is

శాస్త్రి జీవితం సమాప్తి ఆయె రోజులు దగ్గరపడ్డాయి రోజురోజుకీ బలహీనమౌతున్నాడు. మనసుమాత్రం దృఢంగానే ఉండి బుద్ధి బాగా పని చేస్తోంది. ఆయన మనసు బుద్ధీ అన్నీ ఇండియాఐక్యత,ప్రపంచ శాంతి యే ఆక్రమించాయి. చివరి ఘడియలు అనుకోకుండా దగ్గర పడ్డాయి. 17-4-19946 రాత్రి మేము కొందరం ఆయన ప్రక్కనే ఉన్నాం రాత్రి 10 వరకు. అప్పుడు ఆయన తన కుటుంబ సభ్యులతో మాతో ఉల్లాసంగానే మాట్లాడాడు. రాత్రి 10-15కి స్పృహ కోల్పోయాడు శాస్త్రి. 10-35 కు శాస్త్రి అంతిమ శ్వాస విడిచాడు. ప్రపంచం నలుమూలలనుంచి ఆయనకు నివాళులు కుప్పలు తెప్పలుగా వచ్చాయి. అందులో శాస్త్రి డియరేస్ట్ ఫ్రెండ్ అండ్ బ్రదర్ మహాత్మాగాంధీ రాసిన నివాళి ఉత్కృష్టమైనది –"మననుంచే కాక ప్రపంచం నుంచి కూడా శాస్త్రిని మృత్యువు దూరం చేసింది. భారత మాత ఉత్తమ కుమారులలో ఆయన అగ్రగణ్యుడు. దేశాన్ని ఆయనంత గొప్పగా ప్రేమించి ఆరాధించిన వారులేరు. చివరి సారి మద్రాస్ లో నేను ఆయన్ను చూడటానికి వెళ్ళినప్పుడు ఇండియా, దేశ సంస్కృతీ తప్ప వేరే మాట్లాడనే లెదు. వాటికోసమే ఆయన జీవించాడు ప్రేమించాడు చనిపోయాడు. మరణ శయ్యపైన ఉన్నా ఆయన తన గురించి ఎమీఆలోచించలేదు. అంటే ఆయన ఎంతటి ఉదాత్త ఉత్తమ స్వార్ధరహిత దేశ భక్తుడో మనకు అర్ధమౌతుంది. ఆయన ఇంగ్లీష్ భాషా పాండిత్యం ఎంతగోప్పదో ఆయన సంస్కృత పాండిత్యమూ అంతే గొప్పది. రాజకీయంగా మేము భిన్నాభిప్రాయులమే అయినా –"Our hearts were one,and I could never that his patriotism was less than that of the tallest patriot. Sastri,the man,lives though his body is reduced to ashes "అని నివాళి అర్పించాడు ఆమహాత్ముడు ఆశాస్త్రి మహోన్నత ఆత్మకు.

## మహా విద్యావేత్త,మహా వక్త,మహా అక్షరార్చకుడు

రైటానరబుల్ శ్రీనివాస శాస్త్రి జీవితం అంతా నేర్చుకొంటూ బోధిస్తూ గడిపాడు."బోధించటానికి నేర్చుకో. నేర్చుకోవటానికి బోధించు "అనే ప్రాచీన నానుడిని అనుసరించాడు. పట్టుదలతో జీవితకాలమంతా నేర్చుకొంటూనే ఉన్నాడు.దాన్ని గర్వంగా రంధ్రాన్వేషణకు ఉపయోగించలేదు. విద్యాబోధన స్కూల్ టీచర్ అయినా హెడ్మాస్టర్ అయినా వైస్ చాన్సలర్ అయినా ఆయనకు గొప్ప ఆనందమిచ్చేది. జీవితం చివరికాలం లో వాల్మీకి రామాయణం పై అనేకవ్యాసాలు రాశాడు. ఆకాలపు విద్యావిధానాన్ని మెచ్చుకొంటూ "గురు శిష్యులు ఒకే నదిలో స్నానం చేస్తూప్రకృతి పరవశించేట్లు వేద అధ్యయన అధ్యాపనాలు చేస్తూ,ఆపవిత్ర మంత్రాలు వాతావరణాన్ని పరిశుభ్రపరుస్తూ పవిత్రీకరిస్తుంటే,ఆకాశంలో బారులు తీరి దేవతాగణం ఆలకించి తరిస్తుంటే,రాజుల వేట తుపాకుల ధ్వనులు లేకుండా ప్రశాంత గురుకులవాస ంలొ హోమాలు

యజ్ఞయాగాలు ప్రజా సంక్షేమం కోసం జరుగుతుంటే ఆ మహా ప్రశాంత వాతావరణం పవిత్రత దర్శించాలని మనసు పడుతున్నాను "అంటాడు శాస్త్రి పరవశంగా.

18 వ ఏటనే ఫ్రెష్ గ్రాడ్యుయేట్ గా విద్యాబోధన ప్రారంభించాడు శాస్త్రి. "యవ్వనం స్వర్గం "అని పించింది. ఉత్సాహం ఆనందంతో నే ప్రతిపని చేసేవాడు. తోటి విద్యార్ధులకంతటే ఎక్కువ బుద్ధి మంతుడు కనుక తనకు వచ్చింది ఇతరులకు నేర్పాలనే గొప్ప సంకల్పం ఆయనది. టీచర్స్ ట్రెయినింగ్ అయ్యాక ఎవరికి ఎలా చెప్పాలో అర్ధం చేసుకొన్నాడు. ఉపాధ్యాయులకు శిక్షణ గొప్ప వరం అనే వాడు. హెడ్ మాస్టర్ గా విద్యావిషయక జర్నలిస్ట్ గా,యూనివర్సిటి బాడీ మెంబర్ గా,శాసన సభ్యునిగా,దక్షిణాఫ్రికాలో భారతప్రభుత్వ ఏజెంట్ జెనరల్ గా,,వైస్ చాన్సలర్ గా విస్తృతమైన పరిధులలో సేవ అందించాడు. విద్యా విధానానికి బోధనకు ఆయన ఏమీ కొత్త ఆకర్షణీయ విదానం ప్రవేశ పెట్టలేదు. ఉన్నదాన్ని మెరుగు పెట్టేప్రయత్నం చేశాడు. ఇదే ఆయన సంస్కరణ విధానం. మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్ లో 1938 మార్చి లో మాట్లాడుతూ కాంగ్రెస్ ప్రభుత్వాలు ప్రవేశ పెట్టాలనుకొన్నవార్ధా విధానం కానీ బేసిక్ ఎడ్యుకేషన్ కానీ ముందు గా కొన్ని చోట్ల ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టి ఫలితాలుసంతృప్తిగా ఉంటే విస్తరించమని హితవు చెప్పాడు. అప్పటి విద్యావిధానం గుమాస్తాలను తయారు చేయటానికే అనే వాదాన్ని శాస్త్రి ఒప్పుకోలేదు. క్రమాగాతమైన అభివృద్ధి రావాలని,విద్యాబోధకులతో నిరంతరం చర్చలు జరపాలని చెప్పాడు. లిబరల్ విద్యావిధానమే అందరికి శరణ్యం అన్నాడు. హైగ్రేడ్ టెక్నికల్,వొకేషనల్ విద్యా సంస్థలు యేర్పడాల్సిందే కానీ,వాటిలో సామర్ధ్యత,తగినంత ఆర్ధిక వనరులు ముందే చూసుకొని ప్రారంభించాలి. వాటికి డిమాండ్ ఎప్పుడూ ఉంటుంది. అవి నిరుద్యోగ సమస్యను పరిష్కరిస్తాయని భావించవద్దు. వారికి ఉద్యోగాలు రాకపోతే వొత్తిడి ఎక్కువై సంఘ వ్యతిరేకులయ్యే ప్రమాదం ఉంది.నిరుద్యోగాన్ని అన్ని ప్రయత్నాలూ చేసి తొలగించాల్సిందే. కనుక విధానాలు బహుజాగ్రత్తగా పకడ్బందీగా ఉండాలి. మన విసుగుదలతో స్కూళ్ళు కాలేజిలు మూసెయ్యకూడదు మొదటికే ప్రమాదం.-The un developed faculties,idle brains and un directed energies of the young will become a danger to the community,a hundred times more difficult than the present un employment. పెద్దగా పరిశ్రమలు ఉత్పత్తి విధానాలు నెలకొల్పి ఆర్ధిక అభివృద్ధి సాధించి సరిపడా ఉద్యోగాలు మన యువతకు కల్పించి బంగారు భవిష్యత్తు అందజేయాలి.

మహిళా సంక్షేమం కూడా చాలాముఖ్యం అన్నాడు శాస్త్రి. స్త్రీలు విద్యావంతులయితేనే కుటుంబం సమాజం దేశం ప్రగతి సాధిస్తుంది. విద్యాఉద్యోగాలలో స్త్రీ పురుష భేదం ఉండరాదు. పురుషులకు స్త్రీలకూ ఒకే ధ్యేయంగా ఉండాలి. ఎప్పటికీ స్త్రీని సమాజానికి దూరం చేయరాదు. అనేది శాస్త్రి నిశ్చితాభిప్రాయం.

--

## మహా వక్త

ఉపాధ్యాయుల హక్కులను శాస్త్రి ఎప్పుడూ సమర్ధించేవాడు. సౌత్ ఇండియన్ టీచర్స్ గిల్డ్ కు ఒక వ్యాసం రాస్తూ ఉపాధ్యాయుని అవసరం సమాజానికి చాలా ఉందని ఆయన పాత్ర సర్వ శ్రేష్టం అని అన్నాడు. వారు ఆదర్శంగా నిబద్ధతతో

వ్యక్తిత్వం లోవిధి నిర్వహించాలి,వారు కాంతి రేఖలై మార్గ దర్శులు గా ఉండాలి..విద్యావిధానంలో మతం జోక్యం చేసుకోకూడదు. అకాడెమిక్ ఫ్రీడం ను ఆయన కోరాడు. యూని వర్సిటియాజమాన్యంలో అధికారుల ప్రాముఖ్యత ఉండరాదు. విస్తరిస్తున్న ప్రజాస్వామ్యం లో దేవాలయాల వంటి విద్యాలయాలలో పవిత్రత కాపాడాలి అన్నాడు.

**OPEN LETTERS**

[Dated 24th October 1943]

To Mr A. L. AMERY

Dear Mr Amery

Was your speech at the farewell to our new Viceroy meant as a specific Instrument of Instructions? If so, it was both misconceived and unhelpful. You told him in effect that he was not to take the initiative in resolving the deadlock, but wait till the Congress High Command ate the humble pie and withdrew their offending resolution. Was it right to tie him down to the present do-nothing policy? Should he not be free to try a new approach to the problem? We trust he will not be long in perceiving that your instructions are more honoured in the breach than in the observance. The war-guilt clause, it is now generally admitted, was not the wisest part of the Peace Treaty of 1920. Men of honour do not require men of honour to do public penance; they trust the new facts to teach the necessary lesson. The war and the internal situation of India unfold promising phases. In 1930 I pleaded at the Round Table Conference for honourable parley with those of another political faith whom the logic of events had proved wrong. Let me perform a similar office now and invite your compatriots and you not to heed the promptings of passion but to walk in the footsteps of the noble statesman who in similar circumstances in the last century proclaimed " No, I will not govern in anger." Verbal recantation is not of the essence of a changed outlook. The failure of the Congress policy is writ large on

ప్రపంచ ప్రసిద్ధ మహా వక్తలలో శాస్త్రి ఒకడు. ఆకాలపు మహా గొప్పనాయకులు ఆయన వక్రుత్వాన్ని విశేషంగా మెచ్చుకొన్నారు. లార్డ్ బాల్ఫార్ శాస్త్రిని ప్రపంచ ప్రసిద్ధ పంచ మహా వక్తలలో ఒకరుగా పేర్కొన్నాడు. ది మాస్టర్ అఫ్ బిల్లిలాల్,మిస్టర్ స్మిత్ "శాస్త్రి వచో విధానం విన్నతర్వాత నాకు ఇంగ్లీష్ భాషా సౌందర్యం ఏమిటో తెలిసింది "అన్నాడు. లేడి లిట్టాన్ శాస్త్రిని "మాటల శిల్పి " ఆర్టిస్ట్ ఆఫ్ వర్డ్స్ - అన్నది. సర్ థామస్ స్మార్ట్ "The Empire's silver –tongued orator "అన్నాడు. లాయడ్ జార్జ్,స్టాన్లీ బా ల్డ్విన్,డా.హెచ్ ఎ ఎల్ ఫిషర్ మొదలైన మేధావులు శాస్త్రి వాక్ పాండిత్యాన్ని బహుధా మెచ్చారు. ఒక సారి బాల్డ్విన్ శాస్త్రి ప్రసంగం విని "I wish I had made that speech "అని ఉబ్బి పోయాడు.. లండన్ హెరాల్డ్ చీఫ్ ఎడిటర్ తన స్టాఫ్ కు "As the authority for the particular pronunciation of a word in dispute "అని పరిచయం చేశాడు.

శ్రీనివాస శాస్త్రికి ఇంగ్లీష్ భాషపై,పాండిత్యం పై సంపూర్ణమైన పట్టు ఉంది.ఆయనప్రయోగించే శబ్దాలు దోషరహితమైనవి. పదజాల ప్రయోగం మహదానంద దాయకం. ఆ భాషా ప్రవాహం స్వచ్ఛంగా ప్రశాంతంగా పవిత్రంగా ఉంటుది అది ఆయన ప్రత్యేకత. ఏనాడు హద్దులు దాటి ఆమహాప్రవాహం ప్రవహించదు. ఆయన పదజాలం ఎంత గొప్పగా ఉంటుందో ఆయన మధ్యమధ్య ఆపే చోట్లు కూడా అంతే అందంగా ఉంటాయి. "The spell of his cultured eloquence has left a lasting impression in Great Britain, in the Dominions,and America and Geneva,and South Africa as well as in our own country. ఆయనకు సెన్స్ ఆఫ్ హ్యూమర్ ఎక్కువ. తేలికపదాలతో గుండెలను తాకుతుంది ఆయన ప్రసంగం,మంత్ర ముగ్ధుల్ని చేస్తుంది. ఎక్కడా తెచ్చిపెట్టుకున్నట్లు ఏదో కష్టపడి పోతున్నట్లు ఇబ్బంది పడుతున్నట్లు ఉండదు. సహజ గంభీరంగా గంగాప్రవాహంగా అంత పవిత్రంగా ఉంటుంది ఆ వాక్ ప్రవాహం. ముచ్చటేస్తుంది విన్నా, చూసినా. ఆయన ఉపన్యాస ధోరణిని ఒకాయన ఇలా వర్ణించాడు –"ముందుగా ప్రశాంతంగా లేచి నిలబడుతాడు. ఇబ్బంది లేని విధంగా నెమ్మగా మొదలుపెడతాడు. తర్వాత ఒక భంగిమలో నిలబడి ప్రసంగం పూర్తయ్యే దాకా అలాగే ఉండి పోతాడు. నిటారుగా చక్కగా నిలబడుతాడు. ముందు బల్ల ఉంటే ఒక చేయి దానికి ఆనిస్తాడు లేకపోతె రెండు చేతుల్ని మర్చే పోతాడు. ఆయన ఉపన్యాసానికి నిలబడితే ఒక ఆర్టిస్ట్ మోడల్ అని పిస్తుంది ఆభంగిమ. శరీర భాగాలు కదల్చడు. ఎప్పుడైనా కనుమలు కదిలిస్తాడు. "It is a proud bearing,in the happiest sense of the word –not arrogant but conveying more the quality of dignity ".

వాల్మీకి రామాయణ ప్రవచనం చేస్తున్నప్పుడు శాస్త్రి హనుమ వాగ్వైభావాన్ని శ్రీ రాముడు లక్ష్మణుడికి వివరిస్తూ –"అతని శబ్దాలు శక్తి వంతాలు మధుమదురంగా స్నేహాన్ని కోరేట్లు మాట్లాడాడు. మూడు వేదాలు అభ్యసిన్చినట్లు,వాటిపై పూర్తీ ఆధిపత్యం ఉన్నట్లు ఉన్నాయి అతడి మాటలు. ఉచ్చారణ అనితర సాధ్యంగా ఉంది.పదజాల ప్రవీణుడు అనిపించాడు. చాలా సేపు మాట్లాడినా అందులో ఒక అపశాబ్దం కూడా దొరలక పోవటం విశేషం. మాట్లాడుతున్నప్పుడు ఒకే రీతిలో శారీరక చేష్టలు లేకుండా ఉండటం మరో విశేషం.మరీ ఎక్కువగా మరీ తక్కువ కాకుండా ఎంత మాట్లాడాలో అంతే మాట్లాడాడు. అతని మాటలు హృదయ కుహరం నుంచి జాలు వారాయి. చక్కని స్థాయిలో మాట్లాడాడు హెచ్చు తగ్గులు లేవు. అరుపులు లేవు హీన స్వరమూ లెదు. చెప్పాల్సిన విషయం పైననే దృష్టిపెట్టి చక్కగా అర్ధమయేట్లు చెప్పాడు. దేనితర్వాత ఏది చెప్పాలోఅలా చెప్పాడు. అతడు పదాలు ఉచ్చరిస్తుంటే సూటిగా హృదయాలకు తాకెట్లు ఉంది. అతడి ప్రసంగం లో గొప్ప కళ ఉంది. అది నిజంగా కళాత్మక ప్రసంగమే. మాట్లాడుతున్నప్పుడు అతడి శరీర భాగాలు అతడి పూర్తీ అధీనంలో ఉన్నాయి. హనుమమాటలు నా హృదయాన్ని గెలిచాయిపూర్తిగా. సంతోషం కలిగించాయి –"An ambassador who has such grace and beauty of speech can win even an enemy rushing towards him with an uplifted sword " ఇవి హనుమాన్ గురించి చెప్పినా, ఆలక్షణాలన్నీ రైటానరబుల్ శ్రీనివాస శాస్త్రిలో మూర్తీభ వించి ఉన్నాయి.

# మహోన్నత మనీషి శాస్త్రి

మాటలో శాస్త్రి పాటలో లాగా మాధుర్యం చిదింస్తాడు. He was the master of "the other harmony of prose ".పీస్ శివ స్వామి,సిపి రామస్వామి అయ్యర్ లు అసూయ పడతారనికాని లేకపోతె ప్రపంచానికి ఇంగ్లిష్ ప్రోజ్ లో మాస్టర్ పీస్ లు అందించి ఉండేవాడు. ప్రపంచానికి. తనేదో సందేశం ఇస్తున్నానని ఎప్పుడూ బడాయి కబుర్లు చెప్పలేదు శాస్త్రి. అప్పుడప్పుడు మాత్రమె రాసేవాడు. అవి అరుదైన మొదటి తరగతికి చెందినవిగా గుర్తింపు పొందాయి వీటినే "బెల్లెస్ లెటర్స్ అంటారు. ఆయన రాసిన జ్ఞాపకాలు స్కెచెస్ ఆణిముత్యాలు. ఇవి "ఆదర్ హార్మని"గా,''ది థంబ్స్ నైల్ స్కెచెస్ " వచనాలుగా ముద్రణ పొందాయి. దాదాభాయ్ నౌరోజ్ తో మొదలుపెట్టి తేజ్ బహదూర్,సి,పి రామస్వామి అయ్యర్ తో ముగించాడు వీటిని. ఈ వ్యాసాలలో మేధా పటుత్వం అత్యున్నత స్థాయిలో ఉంటుంది. ఆయన రాసిన ఉత్తరాలు "లెటర్స్ "గా ముద్రణ పొందాయి. వక్తలు చాలామంది ఉన్నారుకాని శాస్త్రి అరుదైన లేఖక రచయిత అన్నాడు సిపి రామస్వామి అయ్యర్. వాటిలో శాస్త్రి విద్వత్తు చురుకు తనం చెణుకులు విపరీతమైన ప్రశంసలు పొందాయి. గాంధీ "మై ఎక్స్ పెరిమెంట్స్ విత్ ట్రూత్ "కు నెహ్రు "ఆటో బయాగ్రఫీ "కి ఎంత విలువున్నదో "లెటర్స్ ఆఫ్ శ్రీనివాస శాస్త్రి "కి అంతటి గౌరవం,విలువ ఉంది.ఈ పుస్తక రచయితకు ఒక స్నేహితుడు జాబు రాస్తూ –"శాస్త్రి లెటర్స్ తనివి తీరా ఆనందాన్ని ఇస్తున్నాయి. ఆయనలోని అపార ప్రజ్ఞా,మేధస్సు అనుకంప ప్రపంచానికి చాటాయి. ఆయన వ్యక్తిత్వం వాదనాపటిమ,సహిష్ణుత వ్యక్తం చేశాయి.

TO MAHATMA GANDHI 389

generations. At the ensuing Peace Conference, which may meet sooner than most people expect, the afflicted nations will seek ardently for brave and honoured advocates of justice, equality and brotherhood without distinction of race, colour or religion. You must be there. Who, if not you? War must be banished for ever from the earth and all possibility of its recurrence provided against so far as it can be provided against by human fore-sight. Would you be missing on that supreme occasion? No, a thousand times No. Pacifism, non-violence, *ahimsa*—whenever and wherever these words are pronounced, the name of Gandhi will occur to the minds of people all over the earth. What should keep you from bearing irrefragable witness to the truth that you have ever cherished in your heart, the truth that must resound through the ages when your body has perished? After several humiliations due to association with earthly causes, the hour of exaltation approaches you. I see you, Great Soul, in a vision of glory, go up the Mount of Expectancy of a weary, waiting world, raise high the right hand of blessing, and solemnly utter the word which is in all hearts and which comes full of hope and full of meaning from your inspired lips.

Come, then, bestir yourself. Not a day should be lost. There is so much to do before civilised administration can be restored and competent authorities in the provinces and at the Centre can be formed with national aims and appropriate means for the choice of delegates through whom the soul of India can speak to the rest of the world. Don't say you are not free. You can be free, if you but realise that you are waited for. Your last movement has not

జీవిత చరమ సంధ్యలో శాస్త్రి "సర్ ఫిరోజ్ షా మెహతా అండ్ హిజ్ టైమ్స్ "పై ప్రసంగాలు ఇచ్చాడు ఈ సంకలనం లో శాస్త్రి వివిధ వ్యక్తులతో పొందిన అనుభవం,ఆనాటి సమస్యలపై అవగాహన,పరిపూర్ణ ప్రజ్ఞా ద్యోతకమౌతాయి. ఇండియన్ సోషల్ రిఫార్మర్ కు చెందిన విమర్శకుడు కే.నటరాజన్ "It is invaluable source book for future writers on the history of Indian politics in the last three quarters of this century "అని మెచ్చాడు. అంత్యకాలం లో శాస్త్రి చాలాపవిత్రమైన, ఎన్నో ఏళ్ల నుంచో చేయాలనుకొన్న గొప్ప కార్యక్రమం నిర్వహించి జీవితం ధన్యం చేసుకొన్నాడు. అదే మద్రాస్ మైలాపూర్ కాలేజీలో ఆయన రామాయణం పై చేసిన ప్రసంగ పరంపర. దీన్ని "Immortal product of the human mind "అన్నారు. మానవ స్వభావంలోని వివిధ కోణాలను ఈ ఉపన్యాసాలద్వారా ఆయన ఆవిష్కరించాడు. ప్రొఫెసర్ కే. శ్రీనివాస అయ్యంగార్ ఈ ఉపన్యాసాలు –"Constitute his major achievements as a humanist,as a scholar,and as an artist in words who wielded the English language with such ease and sureness and sense of purpose.They reveal a Bradleyan sweep and subtlety of analysis and an utter mastery of the material " అని కీర్తించాడు.

శాస్త్రి రామాయణ ఉపన్యాసాలలో రామాయణ పాత్రలు అసలైన మానవులులా తమ స్వరూప స్వభావాలను ఎలా ప్రదర్శించారో మొదటి ఉపన్యాసంలోనే చెప్పాడు. తర్వాత జరిగిన మలుపులు వివరించాడు. మహర్షి వాల్మీకి మానవ స్వభావాలను కాచి వడబోసి మన ముందు ఉంచుతాడు. మనిషిలో ఉత్తమ విలువలను నాశనం కాని ఉత్తమ ధర్మాలను ఆపాత్రలద్వారా వ్యక్తం చేయించి మార్గదర్శనం చేశాడు.. షేక్స్పియర్ నాటక పాత్రలు లాగా రామాయణంలోని రాముడిని సీతను భావించలేదు. వారిలోని పవిత్రత ప్రతి ఘట్టం లోను దర్శింపజేశాడు. సీతా పరిత్యాగం లాంటి సందర్భాలను వివరిస్తున్నప్పుడు ఆయన నిజంగా కన్నీరు మున్నీరుగా విలపించేవాడు. ధర్మమే సర్వోత్కృష్టం అని నమ్మాడు. రామాయణ ప్రవచన పరంపరల చివర యధావిధిగా శ్రీరామ పట్టాభి షేకం చేయించేవాడు. ఆసందర్భంగా మాట్లాడుతూ "మనకందరకు ఇప్పుడు రామ పట్టాభి షేకం జరిగినందుకు పరమానందంగా ఉంది..ఇది బాహ్యంగా మాత్రమె జరగటం కాదు. మన అంతరంగాల్లో సీతారాములకు పట్టాభి షేకం జరగాలి. ఆపవిత్ర జంట మన మన ఆలోచనలను,జీవితాలను చక్కగా పాలన చేయాలి మనల్ని ఉత్తముల్ని చేయాలి. ప్రతి సందర్భంలోనూ వారిని గుర్తు చేసుకొంటే మనం దారి తప్పి ప్రవర్తించం. ఇదేదో సెంటిమెంట్ గా చెప్పటం లెదు నిజమైన ఆత్మ భావన ఇది. సీతారాములపై రైటానరబుల్ శ్రీని వాస శాస్త్రికి ఉన్న విధేయత నివాళి ఆరాధన మహాత్మాగాంధీకి వారిపై ఉన్నదానికంటే తక్కువ ఏమీ కాదు

నిరుపేద కుటుంబంలో జన్మించిన శ్రీనివాస శాస్త్రి ఉత్తమ సంస్కారం వివేచనా,అత్యుత్తమ నడవడిక,అపార మేధస్సు ఆర్జించిన మహానుభావుడు. ఆయన బాహ్య స్వరూపమే ఆయన అంతరంగాన్ని ఆవిష్కరిస్తుంది. ఆయన వస్త్రధారణలో పరిశుభ్రత,హుందాతనం,ఆకర్షణ గోచరిస్తాయి.ఇవన్నీ ఆయనను అత్యున్నత స్థాయికి చెందిన రాయబారిగా చేయటానికి

లోడ్పడ్డాయి. రాజకీయ వేత్త ను చేశాయి –"To win the applause of listening senates'' అయ్యాయి. ఆయన వ్యక్తిత్వం ప్రైవేట్ లోనూ పబ్లిక్ లోనూ ఒకే రకంగా ఉండటం ప్రత్యేకత. ఆయన మంచి విధ్యుక్తధర్మం నిర్వహించిన తనయుడు తండ్రికి తల్లికి. బాబాయిలకు సోదరులకు ఆత్మీయుడు,మనుమలను మనుమరాళ్ళను బాగా ప్రేమించిన తాతయ్య. ఇంటి వ్యవహారాలలో చాలా ఉదాత్తంగా ఉన్న గృహస్తు. "క్రూర సముద్రాలు ""ఆయనను ఆయన కుటుంబానికి అనేక సార్లు దూరం చేసినా వారందరిపై తరగని ప్రేమాభిమానాలు చూపిస్తూ తరచుగా యోగ క్షేమాలు తెలుసుకొంటూ వారి సంక్షేమాన్ని చూసిన ఇంటి పెద్ద. కుటుంబం లోని ప్రతి వారినుంచి హృదయ పూర్వకమైన ప్రేమాభిమానాలు పొందిన గొప్ప అదృష్ట వంతుడు శాస్త్రి.

-

# మహోన్నత మనీషి శాస్త్రి -2

స్నేహ పవిత్రత శాస్త్రి బాగా గుర్తించాడు గాంధీలాగానే స్నేహధర్మం జీవితాంతం కొనసాగించాడు. స్నేహంలో డగ్నిటి ఉండరాదు. మానవులు పరిపూర్ణంగా ఉండటం దేవతలకు ఇష్టం ఉండదు ఈర్ష్య పడతారు. స్నేహం లో వ్యాపారం ప్రవేశిస్తే ఇక స్నేహం ఖాళీ. బాల్యం నుంచి ఇతరులకు మంచిచేయటమే ఆయనకు తెలుసు క్షమించటం ఆయన ఉత్తమ గుణం. బాయ్స్కౌట్స్ కు సందేశమిస్తూ తన ఎనిదవ క్లాస్ లో హితోపదేశం నుంచి ఒక శ్లోకం చదివి వినిపించి,మంచికి మంచి చేయాలని,చెడు చేసినవారిని గట్టిగా చెడు చేయాలనే ఉందికాని వారికి కూడా మంచి చేసి మానవత్వం చాటుకోవాలని చెప్పాడు ఆ లేత బుర్రడు. ద్వేషం,అసూయ ఆయనకు సహజం గానే లేవు. శత్రువుతో మిత్రునితో చాలా హుందాగా ప్రవర్తిస్తాడు. ఇతరులలోని మంచి గుర్తించి వారిని పొగడటం ఆయనకు బాగా ఇష్టం.రాజకీయ ద్వేషం లేని వాడు. He judged issues and persons strictly on their merits. He showed in his life that a politician couldbe a perfect gentle man. He radiated in every sphere of his life and activity 0sweetness and light. వివాదాలు నేరారోపణ ఆయన నిఘంటువులో లేవు. ఆయన గురువు గోఖలె లాగా శాంతి,సౌభ్రాతృత్వాలే ఆకాంక్షించాడు. తనపై వ్యక్తిగత దూషణచేస్తే సమాధానం ఇచ్చేవాడుకాడు. "least said,soonest mended "అనేది శాస్త్రి మోటో. అంటే తక్కువగా మాట్లాడటం ఎక్కువగా సరిదిద్దటం. రాజీ చేయటం ఎక్కువ ఇష్టం. వాటిని చెడుతో తప్పులతో చేయరాదు. వెలుగు కోరే వారికి ఆయన బీకన్ లైట్. ఎంతటి ఉత్తమ గుణ సంపన్నుడు కాకపోతే శాస్త్రిని మహాత్ముడు –"Your criticism soothes me. Your silence makes me nervous "అంటాడు ?

ఇతరులు చెప్పేది చాలాశ్రద్ధగా వింటాడు శాస్త్రి. అవతలి వాడు చెప్పదలచుకోన్నదేమిటో శాస్త్రికి తెలిసినట్లుగా చెప్పే వాడికి తెలిదు అని ఆయన స్నేహితుడు అంటాడు. ఆయనది ముమ్మాటికి లిబరల్ దృక్పధమే. ఆ కళ్ళ ద్దాలతోనే లోకాన్ని చూస్తాడు. ఆయన జీవితకాలమంతా మధ్యవర్తిత్వం నెరపటం సరైన రాజీ పరిష్కారం సాధించటం తోనే సరిపోయింది. మిర్జా ఇస్మాయిల్ అన్నట్లు –"It was not in him to mediate between good and evil. To mediate yes between powers and peoples and creeds that was his very nature,to understand and reconcile. But never without candour,never in condonation of radical evil "అని గొప్పగా చెప్పాడు.

శ్రీనివాస శాస్త్రి సాధారణ రాజకీయనాయకులతో స్నేహం చేయలేదు. పార్టీలు మార్చలేదు. ఆయన గురించి ఒక మాట చెబుతారు –"He never worked in team and that he ploughed a lonely furrow ".ఇది పూర్తి నిజం కాదు. ఆయన ఇతరులతో కలిసి పని చేయటం తన భావాలను తగ్గించుకొని ఉండటం అందరికి తెలుసు. లీడర్షిప్ కోసమో కీర్తికోసమో ఆయన వెంపర్లాడ లేదు –"That last infirmity of noble mind ".ఆయన చాలా వినయంగా ఉంటాడు ఆశలేని వాడు. కీర్తి ప్రతిష్టలు ఆయన కోరకుండానే వచ్చిపడ్డాయి. తన స్వంత భావాన్ని గురించి చెబుతూ శాస్త్రి –A diffident un grasping man is generally at a disadvantage,but luck has been friendly to me " అని తనను తానూ బాగా ఎస్టిమేట్ చేసుకొన్నాడు. తనకు దొరికిన దానితో సంతృప్తిగా తినటం ఇష్టం. సత్యమే ఎప్పుడూ మాట్లాడుతాడు. తనపై ఆరోపణలు వస్తే కుర్చీ వదిలిపెట్టి వెళ్ళి పోవటానికి సిద్ధంగా ఉంటాడు. విజేతలు దృఢ హృదయులు అంటాడు –conquerors must be made of sterner stuff "అన్నాడు.



390 LETTERS OF SRINIVASA SASTRI

borne the fruit that you wished. Admit what everybody sees. No hesitation need be felt in recognising facts. You yield, no doubt. But you yield to Fate and not to man. Stoop and conquer. Many a hero before you has done so and many a hero after you will do so. Let us consult the Ramayana, a book which we revere alike. It counsels against the single aim and the single strategy. A good general should vary them. These are the words of Hanuman, whose aid all Hindus invoke before beginning great enterprises:

"No single plan is adequate to achieve even a small aim. Only he can succeed in his purpose who adopts different plans in different circumstances."

Yours affectionately
V. S. SRINIVASAN

శాస్త్రి మనసు,బుద్ధి ప్రకాశాత్మకం గా అగాధంగా ఉంటాయి. అవి సంస్కృతం ఇంగ్లీష్ భాషా సాహిత్యాలవలన ఏర్పడ్డాయి. బర్క్ పండితుని గురించి డాక్టర్ జాన్సన్ చెప్పిన "His stream of mind is perpetual "ఆయన మనో ప్రవాహం నిరంతరశాశ్వతమైనది. అన్నమాటలు రైటానరబుల్ శ్రీనివాస శాస్త్రి కి కూడా చక్కగా వర్తిస్తాయి. ఆయనది నిత్య వసంత సృజనాత్మక ఆలోచన. ప్రతి సమస్యను లోతుకు వెళ్ళి తరచి పరిష్కారం సాధించే మేధస్సు ఆయనది. ఆయనతో పోల్చదగిన నాయకులు లేరనే చెప్పవచ్చు. అలాంటి అరుదైన రత్నమాణిక్యం శాస్త్రి.

## రైటానరబుల్ "శ్రీనివాస శాస్త్రి (చివరి భాగం )

ప్రతి వ్యక్తీ గౌరవాన్ని వ్యక్తిత్వాన్ని శాస్త్రి గౌరవించాడు. అవతలి వారి తప్పులపై విరుచుకు పడేవాడుకాదు. నెమ్మదిగా చెప్పి మారేట్లు చేసేవాడు. మాట్లాడే స్వేచ్చ అందరికి ఉండాలనే వాడు. తన అధికారాన్ని తప్పనిసరిగా ప్రయోగిన్చాల్సి వస్తే మృదువుగా, అవతలి వారి అభివృద్ధికి దోహద పడేట్లు, వారి స్వేచ్చకు ఇబ్బంది కలగకుండా నే ప్రయోగించే వాడు. ఒక స్నేహితుడికి రాస్తూ –''Your rules are good for the humdrum, sin –dreading type. The genius will break through them, however rigid. It is well he does. If the rules be not rigid from the start several semi – geniuses will show themselves. That is why I am not a martinet . Not that I love order and discipline less, but that I love freedom more ''అని స్వేచ్చమీద ఆయనకు ఎంతటి మక్కువ ఉందొ వ్యక్తం చేశాడు శాస్త్రి.

యువకుడు గా ఉండగా సైన్స్ రచయితలూ మేధావులు అయిన జూలియస్ హక్స్లీ, జే ఎస్ మిల్స్, హెర్బర్ట్ స్పెన్సర్ వంటి వారి రచనలు చదివి అర్ధం చేసుకొన్నాడు. సైన్స్ దాని విధానాలు ఏమిటో అవగాహన అయింది. తరతరాల కర్మకాండ ను ఇష్ట పడలేదు.. ప్రతిదానికి కారణం సాక్ష్యం కోరేవాడు. కానీ నమ్మకం లేనివాడుగా మరీ రేషనలిస్ట్ గా అవలేదు. ''ఎ కన్ఫెషన్ ఆఫ్ ఫెయిత్ ''లో ''అజ్ఞేయవాదం '' తనను ఎలా బాధించిందో చెప్పాడు. పునర్జన్మ పై తన అంతరాత రా లలో ఒక విశ్వాసం నిరంతర ప్రవాహంగా ఉందన్నాడు. లాప్ లేస్ ఒక సారి నెపోలియన్ చక్రవర్తితో ''సిస్టం ఆఫ్ సెలెస్టియల్ మెకానిక్స్ ''పై చర్చిస్తూ ''మీ విధానం లో దేవుడికి ఉన్న ప్రాధాన్యం ఏమిటి ?అని చక్రవర్తి ప్రశ్నిస్తే '' ఈ పరికల్పన –హైపొథిసిస్ పై నాకు ఎప్పుడూ అవసరం కలగలెదు ''అన్నాడు. ఇలాంటి నిశ్చయ పూర్వక గర్వం టో ఉన్న సమాధానం శాస్త్రిఎప్పుడూ చెప్ప లెదు. శాస్త్రి అజ్ఞేయవాదం అంటే'ఎగ్నాస్టిజం మతాన్ని వదిలి పారిపోయేదికాదు.అది నిరంతర అన్వేషణ. విశ్వాసం పై కారణం కున్న అన్వేషణ. భగవద్గీతలోని భక్తియోగం లోని చివరి ఎనిమిది శ్లోకాల వచో మాధుర్యం తనను కట్టి పడేసింది అని చెప్పేవాడు. వాటిలోని ఆదర్శం హృదయపు లోతుల్లోకి చేరి పరవశం కల్గిస్తుందనే వాడు. ఇంతకన్నా విలువైన సాహిత్యం ప్రపంచం మొత్తం మీద నాకు తెలిసి నంతవరకు లేనే లెదు అన్నాడు, వాటిని తలచినపుడల్లా తనలో ఏదో విద్యుత్తు ప్రవహించి తనను ఉత్తమ స్థితిలోకి చేర్చేది అన్నాడు. అందుకే జీవితాంతం నేను స్వీయ నియంత్రణ పాటించి ఆనదానుభూతి పొందాను. ''అనే వాడు.

వయోభారం పెరిగిన దగ్గర్నుంచి జీవిత మూల విలువలను తరచి తరచి చూశాడు. మరణం దూరంగా ఉన్న పుకారు కాదు అది యదార్ధం అనే భావం బలమై పోయింది ఆయనలో. మరణం తర్వాత ఏమిటి ? నేను ఒక నీటి బుడగ లాగా మాయమౌతానా ?''అనే ప్రశ్న ఆయనను బాగా తొలచింది. మరణానికి మూడేళ్ళ ముందు నుంచి శాస్త్రి ''మరణమే సమాప్తమా "'?అనే విషయం పై ఎన్నో ఉపన్యాసాలిచ్చాడు. ఒక ఏడాదిలో చనిపోతాడనగా స్నేహితుడికి రాసిన జాబులో – ''My intellect refuses to be convinced by the usual evidence in favour of the soul and the future world. So I am internally a man of un fulfilled longing and unhappy ''అని తన వ్యధను వెలిబుచ్చాడు. ఒక సారి ఎస్. సత్యమూర్తి పబ్లిక్ మీటింగ్ లో '' '' హరిశ్చంద్రుడు ఒక హెచ్చరిక కానీ ఎట్టిపరిస్తితులలోను సత్యమే చెప్పటానికి ఉదాహరణకాదు ''అన్నాడు. దానిపై కౌంటర్ ఇస్తూ శాస్త్రి ''పురాణ హరిశ్చంద్రుడు నాపై గొప్ప ప్రభావం కల్గించాడు. ఆయనలాగానే నేనూ ఎప్పుడూ సత్యాన్నే పలికాను అదే ఆదర్శంగా జీవించాను. మహాత్మాగాంధీ కూడాంతే సత్యమూర్తి అన్నట్లు హరిశ్చంద్ర ఒక ఎక్సామ్పుల్ మాత్రమె కాదు ''అన్నాడు.

19-2-1945 గోఖలే జన్మ దినం రోజు తనగురువు గోఖలే జీవితంలోని ఒక ముఖ్యఘట్టం పై ప్రసంగిస్తూ స్పృహ తప్పాడు శాస్త్రి. డాక్టర్ ని పిలిపించి చికిత్స చేయించారు స్పృహ వచ్చింది. ఇంటికి తీసుకు వెళ్లారు మళ్ళీ స్పృహ కోల్పోయాడు. తన పని అయిపోయిందని తెలుసుకొన్నాడు. వెంటనే అక్కడున్న వారిని భక్తియోగం లో తనకిష్టమైన ఆ ఎనిమిది శ్లోకాలను చదవమన్నాడు. కోలుకున్నాడు. వెంటనే షేక్స్ పియర్ రచనలో ''హిజ్ లేటెస్ట్ సెల్ఫ్ అస్సెర్టేడ్ ఇట్సెల్ఫ్ '' పేరా చదవమన్నాడు. శాస్త్రికి విశ్వాసం ఉంది.ఆనమ్మకం తేలికైనదికాదు మహా గాఢమైనది. ఆయన రాస్తూ తనకు అత్యుత్తమ ఫిలాసఫీ మాత్రమె దారి చూపిందని స్వాముల భస్మాలు తీర్ధాలు ప్రవచనాలు కావు అన్నాడు. ''I cannot sign away my

judgement in any sphere to another, however great and worthy ''అన్నది శాస్త్రి ఉన్నత ఆదర్శం. He was an exemplar of the highest virtues and his was a life of sacrifice according to the highest standards of our Dharma. ఆయన మానవాతీతుడు. గాంధీలా సత్యప్రేమికుడు శాస్త్రి. శాంతిమార్గం స్నేహ సౌభ్రాతృత్వాలు పరస్పరసహకారం ప్రేమ లపైనేనడిచాడు.ధర్మమే జయిస్తుంది అనే సంపూర్ణ విశ్వాసం ఆయనది. ప్రపంచమంతా యుద్ధభయంతో అల్లల్లాడుతుంటే ఆయనమాత్రం వీటిపైనే విశ్వాసంతో ఉన్నాడు. 1940లో రేడియో లో మాట్లాడుతూ శాస్త్రి –''ప్రస్తుత యుద్ధం మానవ విలువలను ధ్వంసం చేస్తోంది. దయా దాక్షిణ్యా లను పాతిపెడులోంది. క్రూరత్వం వికటాట్ట హాసం చేస్తోంది. మనం ఇండియాలో గోప్పపనులు సాధించాలని అనుకొంటున్నాము. వాటిని రుజుమార్గం లో నిజాయితీగా, పద్ధతి ప్రకారంనెమ్మదిగా తప్పక సాధించాలని కోరుతున్నాం.కంగారుగా చేసిన పని కంగాళీ అవుతుంది. హిట్లర్ విజయాలు ఎంతకాలం నిలుస్తాయో వేచి చూద్దాం. మనకు స్వాతంత్ర్య కిరీటం కావాల్సిందే. కాని దీనికోసం మానవ సంహారం కావాలా ?వద్దు వద్దు. హిట్లర్ లాగా దయకు తలుపులు మూసేసి తప్పు చేద్దామా ?వద్దు. ఈ విశ్వాసమే ఈ ధర్మం పై నమ్మకమే శాస్త్రిని మిగిలిన నాయకులకంటే అత్యుత్తమ నాయకుడిని మహోన్నత వ్యక్తిని చేసింది. మనిషిని చేసింది. ''His whole of harmonius personality even as the enthralling magnificence and beauty of Taj Mahal emanates not from the minaret or that dome however exquisite, but from the ensemble (సమష్టి )అలాగే శ్రీనివాస శాస్త్రి ఆయన నిరాడంబరత వలననే ఆరాధ నీయుడయ్యాడు. ''Sastri was an artist to the core, radiating beauty f0rm,harmony and proportion in all he that did and said ''అని ఘనమైన నివాళులు అర్పించాడు రచయిత టి. ఎన్. జగదీశన్.



మనవి- దాదాపు అరవై డెబ్భై ఏళ్లనుంచి రైటానరబుల్ శ్రీనివాస శాస్త్రిని, ఆయన వాగ్ధాటి గురించి వింటూనే ఉన్నాను. కానీ ఆయన జీవితం గురించి మనజాతిని తీర్చిదిద్దటం లో ఆయన వహించిన అత్యుత్తమ పాత్ర గురించి ఏమీ తెలిదు. మా అబ్బాయి శర్మకు చెబితే నెట్ లో వెతికి ఈ పుస్తకం నాకు పంపితే ఇంత పుస్తకాన్ని అనువాదం చేయగలనా అని సందేహించాను. మావాడు ''నాన్నా !ఆయన గురించిఎవరూ తెలుగులో రాయలేదు. మనం రాసి ఆలోటు తీరుద్దాం ''అన్నాడు సరే అని మొదలుపెట్టి ఈ 63 ఎపిసోడ్ లు రాసి ఇవాళ స్వాతంత్ర్య దినోత్సవం నాడు పూర్తి చేశాను. ఇంగ్లీష్ లో ఆయన చెప్పినవి రాసినవి ఆయనగురించి మహత్తరంగా ఇతరులు చెప్పినవి యధాతధంగా ఆ వాక్యాలు ఇంగ్లీష్ లో అలానే ఉంచాను వాటి రామణీయకత చెడి పోతుందేమో అనే భయం చేత. దీనికి క్షంతవ్యుడను. ముందే చెప్పినట్లు ఈ వ్యాసాల డిజిటల్ పుస్తకాన్ని ఈ రోజే ఆన్ లైన్ ఆవిష్కరణ జరిపి, ఆమహానుభావుడు ''రైటానరబుల్ వి.ఎస్..శ్రీనివాస శాస్త్రికి సరస భారతి అంకితం చేసి ఋణం తీర్చుకొంటోంది.

భారత స్వాతంత్ర్య దినోత్సవ శుభా కాంక్షలతో -

## శాస్త్రి రచనలు

Kenya Problem A Selection From The Speeches And Writings

https://ia801409.us.archive.org/27/items/in.ernet.dli.2015.46569/2015.46569.Kenya-Problem-A-Selection-From-The-Speeches-And-Writings.pdf

Lectures On The Ramayana (1949)

https://ia804709.us.archive.org/27/items/in.ernet.dli.2015.1078/2015.1078.Lectures-On-The-Ramayana-1949.pdf

The Indian Citizen

https://ia804708.us.archive.org/34/items/in.ernet.dli.2015.90205/2015.90205.The-Indian-Citizen.pdf

Self Government For India Under The British Flag

https://ia802909.us.archive.org/11/items/in.ernet.dli.2015.510221/2015.510221.Self-Government.pdf

https://indianculture.gov.in/rarebooks/sastri-speaks-being-collection-speeches-and-writings-right-honourable-vs-srinivasa-sastri

## ఆధారం

T. N. Jagadisan (1969). Builders of modern India: V. S. Srinivasa Sastri. Government of India.

https://ia804700.us.archive.org/3/items/in.ernet.dli.2015.149273/2015.149273.V-S-Srinivasa-Sastri.pdf

The Rt. Hon. V. S. Srinivasa Sastri (1869–1946) centenary souvenir (22-9-1969). Servants of India Society. 1969.

# రచనలు

## ముద్రిత రచనలు

శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ రాసిన,సరసభారతి ప్రాచురించిన పుస్తకాలు డిజిటల్ రూపం లో. క్లిక్ చేస్తే చాలు పుస్తకం ప్రత్యక్షం

| | పుస్తకం పేరు | వివరాలు | ప్రచురణ | అంకితం | పేజీలు |
|---|---|---|---|---|---|
| 1 | ఆంధ్ర వేద శాస్త్ర విద్యాలంకారులు | 27 తెలుగు వేదశాస్త్ర ప్రవీణులు రచనలు | సెప్టెంబర్ 2010 | స్వర్గీయ శ్రీ కోమలి సూర్యనారాయణ శాస్త్రి | 55 |
| 2 | జనవేమన | వేమన యోగి గా మారిన విధం | ఏప్రిల్ 2012 | చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ | 116 |
| 3 | దర్శనీయ దైవ క్షేత్రాలు | 100 ప్రసిద్ధ దేవాలయాల చరిత్ర, దివ్యధామ దర్శనం | జనవరి 2015 | శ్రీ కోగంటి సుబ్బారావు శ్రీమతి సావిత్రి | 164 |
| 4 | శ్రీ హనుమత్ కథా నిధి | హనుమాన్ దివ్య చరిత్ర, పూజ శ్లోకాలు | ఉగాది 2012 | స్వర్గీయ పవని రాధాకృష్ణ | 159 |
| 5 | శ్రీ ఆంజనేయ స్వామి మహాత్మ్యం | ఆంజనేయస్వామి మహాత్యం, కథలు, విశేషాలు | జూన్ 2013 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 120 |
| 6 | సిద్ధ యోగిపుంగవులు | 35 సిద్ధుల జీవిత చరిత్రలు | ఏప్రిల్ 2013 | స్వర్గీయ మైనేని సౌభాగ్యమ్మ కుమ్మమూరు | 120 |
| 7 | మహిళా మాణిక్యాలు | 50 ప్రపంచ ప్రసిద్ధ మహిళల చరిత్రలు | మార్చి 2014 | శ్రీమతి మైనేని సత్యవతి USA | 184 |
| 8 | పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు | 125 ఇంగ్లాండ్,అమెరికా దేశాల కవుల చరిత్ర | ఆగుస్ట్ 2014 | శ్రీ రాచకొండ నరసింహ శర్మ వైజాగ్ | 280 |
| 9 | గీర్వాణ కవులకవితా గీర్వాణం -1 | 146 సంస్కృత కవుల జీవిత విషయాలు | మార్చి 2015 | శ్రీ మైనేని గోపాలకృష్ణ USA | 408 |
| 10 | గీర్వాణ కవుల కవితా గీర్వాణం -2 | 482 సంస్కృత కవుల జీవిత విషయాలు | డిసెంబర్ 2014 | గబ్బిట భవానమ్మ మృత్యుంజయశాస్త్రి | 632 |
| 11 | గీర్వాణ కవుల కవితా గీర్వాణం -3 | 462 సంస్కృత కవుల జీవిత విషయాలు | డిసెంబర్ 2017 | డా|| భండారు రాధాకృష్ణ మూర్తి, సులోచన | 520 |
| 12 | దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు -1 | 201 ఆంజనేయ దేవాలయాల విశేషాలు | మే 2015 | శ్రీమతి వేలూరి దుర్గ, శ్రీ వివేకానంద | 264 |
| 13 | దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు -2 | 221 ఆంజనేయ దేవాలయాల విశేషాలు | మార్చి 2019 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 312 |
| 14 | కెమోటాలాజి పిత డా.కొలాచల సీతారామయ్య | ఆయిల్ సైన్స్ శాస్త్ర సాంకేతిక శాస్త్రజ్ఞుడు | జనవరి 2016 | శ్రీ యలమంచలి సీతారామయ్య,శేషుమాంబ | 144 |
| 15 | దైవ చిత్తం | Mind of god కు తెలుగు స్వేచ్ఛ అనువాదం | ఏప్రిల్ 2016 | శ్రీ మైనేని గోపాలకృష్ణ USA | 80 |
| 16 | బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి | శత జయంతి ఉత్సవ సమీక్ష | మార్చ్ 2017 | శ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి | 17 |
| 17 | ఆధునిక ప్రపంచ నిర్మాతలు – జీవితాలలో చీకటి వెలుగులు | చరిత్రను మలుపు త్రిప్పిన వివిధ రంగాల 91 ప్రపంచ ప్రముఖుల జీవితం సమగ్ర గ్రంథం | డిసెంబర్ 2017 | శ్రీ స్వర్గీయ పరచూరి రామకృష్ణయ్య | 704 |
| 18 | షార్లెట్ సాహితీ మైత్రీ బంధం | అమెరికా నార్త్ కరోలిన షార్లెట్ యాత్రా సాహిత్యం | 2018 | అమెరికా షార్లెట్ | 344 |
| 19 | అణుశాస్త్రవేత్త డా.ఆకునూరి వెంకట రామయ్య | 117 మూలకం టెన్నిస్సిన్ 'Ts'ఆంధ్ర అణుశాస్త్రవేత్త | అక్టోబర్ 2018 | స్వర్గీయ ఆకునూరి వెంకట సుబ్బమ్మ | 40 |
| 20 | శాస్త్రపరిశోధన పిత డా.పుచ్చా వెంకటేశ్వర్లు | ఆంధ్ర కాంతి శాస్త్ర పరిశోధన సాంకేతికవేత్త | మార్చి 2019 | శ్రీ ఆకునూరి రామయ్య | 32 |
| 21 | ఊసుల్లో ఉయ్యూరు | 75ఏళ్ళ అనుబంధం,జ్ఞాపకాలు నాస్టాల్జియా | మార్చి 2020 | శ్రీ కోట సూర్యనారాయణ శాస్త్రి, సీతమ్మ | 304 |
| 22 | సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా | 6 రాష్ట్రాల క్షేత్ర సందర్శన యాత్రా సాహిత్యం | మార్చి 2020 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 328 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 23 | ఆధునిక ఆంధ్ర శాస్త్ర మాణిక్యాలు | 62 ఆంధ్ర శాస్త్రవేత్తల జీవిత విశేషాలు, | మార్చి 2020 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 168 |
| 24 | వ్యాఖ్యాన చక్రవర్తి కోలాచలం మల్లినాద సూరి | శ్రీ పిజి.లాల్యే ఇంగ్లీష్ "మల్లినాథ'అనువాదం | మార్చి 2021 | శ్రీ మల్లినాద | 120 |
| 25 | ఆధునిక విదేశీ సంస్కృత విద్వాంసులు | 42 విదేశ సంస్కృత విద్వాంసుల రచనలు | మార్చి 2021 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 80 |
| 26 | Dr. Ankunuri Venkata Ramayya | డా ఆకునూరి వెంకటరామయ్య ఇంగ్లీష్ అనువాదం | అక్టోబర్ 2020 | స్వర్గీయ ఆకునూరి వెంకట సుబ్బమ్మ | 40 |
| | | | | | 5735 |

సంపాదకత్వం

| | పుస్తకం పేరు | వివరాలు | అంకితం | ప్రచురణ | పేజీలు |
|---|---|---|---|---|---|
| 1 | జ్యోతిస్సంశ్లేషణం | విద్వాన్ గబ్బిట మృత్యుంజయశాస్త్రి రచన | స్వర్గీయ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి | మార్చ్ 2010 | 15 |
| 2 | ఉయ్యూరు ఊసులు | గబ్బిట కృష్ణ మోహన్ ఉయ్యూరు జ్ఞాపకాలు | ఉయ్యూరు | డిసెంబర 2010 | 42 |
| 3 | మహా కవితా సంతం | కవుల కవితలు సెప్టెంబర్ 2010 | స్వర్గీయ టి ఎల్ కాంతారావు | సెప్టెంబర్ 2010 | 32 |
| 4 | మా అక్కయ్య | ఉగాది కవితా సంపుటి | | ఆగష్టు 2011 | 40 |
| 5 | "ఆదిత్య "హృదయం | పద్య వచన కవితా సంకలనం | | మే 2012 | 24 |
| 6 | త్యాగి పే"రెడీలు' | శ్రీ టీవీ సత్యనారాయణ రచనలు | బాపు రమణ | మార్చి 2015 | 96 |
| 7 | శ్రీరామవాణి | శ్రీ తూములూరి దక్షిణామూర్తి గారి రచన | | | 24 |
| 8 | మా అన్నయ్య | కవితాసంకలనం | తాడికొండ భోగ మల్లికార్జునరావు దంపతులు | జూలై 2016 | 45 |
| 9 | శ్రీ సువర్చలా వాయు నందన శతకం | రామలక్ష్మణచార్యులు | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 64 |
| 10 | శ్రీ సువర్చలా మారుతి శతకం | ముదిగొండ సీతరావమ్మ | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 40 |
| 11 | శ్రీ సువర్చలేశ్వర శతకం | మంకు శ్రీను | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 35 |
| 12 | వసుదైక కుటుంబం | ఉగాది కవితల సంకలనం | | మార్చి 2018 | 40 |
| 13 | సాహితీ ప్రవంతి | (సాహితీ మండలి తరఫున ) | | మార్చి 2012 | 25 |
| | | | | | 522 |

అంకాత్మక (డిజిటల్) పుస్తకాలు

| | పుస్తకం పేరు | వివరాలు | విడుదల | పేజీలు |
|---|---|---|---|---|
| 1 | కోనసీమ అందాలకు వేదపవిత్ర సొబగులు సౌరభాలు అద్దిన ఆహితాగ్నులు | Emeritus of South Asian Studies at the University of Visconsin, Madison లో Professor Da vid.M.Knipe Vedic Voices-intimate Narratives of a Living Andhra Tradition కి అనువాదం | 19-04-2019 | 67 |
| 2 | సమస్త భక్త శిఖామణులు | దైవం కోసం, దేశం కోసం, రాజ్యం కోసం, సాహిత్యం కోసం పాటుపడి చరిత్రలో మిగిలిపోయిన భక్త శిఖామణులు | 15-08-2021 | 350 |
| 3 | వేద, ఇతిహాస, తాత్వికరచనల విశ్లేషణ | వివిధ రామాయణ, భారత, భాగవత,వేద ఉపనిషత్తులు మొదలైన వాటిపై విశ్లేషణ | 10-09-2021 | 460 |
| 4 | దర్శనీయ మహాదే(వ-వి)నాయక ఆలయాలు | శివ, దేవి, వినాయక, విచిత్ర ఆలయాల చరిత్ర, శ్రీ ఆదిశంకర విశిష్ట వేదాంత రచన | 15-10-2021 | 625 |
| 5 | బ్రహ్మశ్రీ విద్వాన్ శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి | బ్రహ్మశ్రీ విద్వాన్ శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి సాహిత్య, సామాజిక సేవ వార్తాపత్రికల | 15-08-2022 | 45 |

| | | | | |
|---|---|---|---|---|
| | | సంకలనం 132 వ జయంతి కానుక | | |
| 6 | శమీ అష్టోత్తరం పూజా విధానము | శమీ అష్టోత్తరం పూజా విధానము | 05-10-2022 | 15 |
| 7 | సహస్రచంద్రదర్శనం | సహస్ర చంద్ర దర్శనం, సరసభారతి సాహితీ పుష్కరోత్సవం | 05-10-2022 | 60 |
| 8 | శ్రీ శంకర | ఆది శంకరాచార్యుల బోధనలు | 22.03.2023 | 200 |
| 9 | శ్రీ శోభ కృత్ ఉగాది 2023 | శ్రీ శోభ కృత్ ఉగాది 2023 కవితా సంకలనం | 14-05-2023 | 50 |
| 10 | రైట్ హానరబుల్ శ్రీనివాస శాస్త్రి | **టి ఎన్ జగదీశన్ రాసిన వి ఎస్ శ్రీనివాస శాస్త్రి ఆంగ్ల పుస్తకానికి తెలుగు స్వేచ్ఛానువాదం** | 15-08-2023 | 110 |


గబ్బిట దుర్గాప్రసాద్

http://sarasabharati.wordpress.com

http://sarasabharativuyyuru.wordpress.com

http://suvarchalaanjaneyaswami.wordpress.com

Telugu Wikipedia : https://te.wikipedia.org/wiki/%E0%B0%97%E0%B0%AC%E0%B1%8D%E0%B0%AC%E0%B0%BF%E0%B0%9F_%E0%B0%A6%E0%B1%81%E0%B0%B0%E0%B1%8D%E0%B0%97%E0%B0%BE%E0%B0%AA%E0%B1%8D%E0%B0%B0%E0%B0%B8%E0%B0%BE%E0%B0%A6%E0%B1%8D

youtube channel : https://www.youtube.com/channel/UCCB-Z-3t-3SxVy1G_BcwS6w

youtube.com/@sarasabharati

FB page : https://www.facebook.com/sarasabharathi.vuyyuru

Gabbita Durga Prasad
Rtd. head Master Sivalayam Street
Vuyyuru 521165 Krishan District

Andhra Pradesh
India
Cell : 9989066375

8520805566

Land Line : 08676-232797